# ఆత్మానందలహరి
ఇలపావులూరి పాండురంగారావు

ప్రథమ ముద్రణ
మార్చి, 2003

మూల్యము : రూ. **90/-**

ముద్రణ:
వాసు ఆఫ్‌సెట్ ప్రింటర్స్
**విజయవాడ. ఫోన్ : 2438324, 5528324**

కూర్పు
పల్లవి గ్రాఫిక్స్
కాకినాడ. ఫోన్: 0884-2361158

ప్రచురణకర్తలు :
ఎమెస్కో బుక్స్
ఏలూరు రోడ్డు, విజయవాడ - 2
ఫోన్స్ : 0866-2577498, 2575281

# అక్షరానికి నమస్కారం

నేనెప్పుడు ఏ కార్యక్రమం ప్రారంభించినా ముందుగా అక్షరానికి అంజలి ఘటిస్తాను. ఎందుకంటే అక్షరంతో నాకున్న బంధంవల్లే అత్యంత సామాన్యుడినైన నేను అనేకులు మహానుభావులతో, విద్వాంసులతో, కవులతో, పండితులతో పరిచయాన్ని కలిగివున్నాను. అక్షరం ఏర్పరచిన బంధంతో వారితో సంభాషించగలుగుతున్నాను. వారి ఆత్మీయ వచనాలతో నా జీవన గమనంలో పురోగామి కాగలుగుతున్నాను.

అలాంటి అక్షరం ఏర్పరచిన బంధమే పూజ్యులు శ్రీ ఇలపావులూరి పాండు రంగారావుగారితో నాకు ఏర్పడ్డ సంబంధం. 13 సంవత్సరాల క్రితం నాకో సంకల్పం కలిగింది. జ్ఞానపీఠం పురస్కారం పొందిన భారతీయ సాహిత్యాన్ని తెలుగువారికి అందించాలని! ఆ సందర్భంగా అప్పటికే ఎమెస్కో సంస్థతో ఆత్మీయబంధంగల శ్రీ పాండురంగారావుగారిని ఢిల్లీ వెళ్ళి కలవడం జరిగింది. వారు అప్పుడు భారతీయ జ్ఞానపీఠ్‌కు కార్యనిర్వాహక సంచాలకులుగా వున్నారు. రెండు దినాలపాటు నేనప్పుడు వారితో గడిపాను. స్ఫటిక సదృశ్యమైన ఆయన మూర్తి నన్నెంతగానో ప్రభావితం చేసింది. ఆనాడాయన చూపించిన ఆత్మీయత నాకు జీవితకాలం గుర్తుంచుకునే చక్కని అనుభూతి. ఆ తరువాత ఎమెస్కో జ్ఞానభారతి ప్రారంభించడం, దాని ప్రారంభానికి శ్రీ పాండురంగారావు గారు విజయవాడ రావడం, విజయవాడ విద్వత్ సమాజాన్ని ఎంతో ప్రభావితం చేసిన ఆయన ప్రసంగం ఇవన్నీ ఒకదానివెనుక ఒకటి జరిగాయి. విజయవాడ నుండి హైదరాబాద్‌కు కారులో తిరుగు ప్రయాణంలో నేను వారి వెంట ఆరుగంటల సమయం గడిపాను. ఆ సమయంలో ఆయన విష్ణు సహస్రనామాన్ని గురించి నాకు వివరంగా చెప్పడం జరిగింది. నాకు భారతీయ ధార్మిక హిమోన్నత శృంగాన్ని కళ్ళముందు కట్టినట్టు ఆవిష్కరించారు. ఎంతటి అదృష్టం! ఎంతటి భాగ్యం! నేను ఓ ప్రచురణకర్తను కానట్టయితే ఓ మహారాజునైనా నాకో భాగ్యం కలిగేదా? అందుకు నన్ను నేను ఎంతో అభినందించుకున్నాను.

ఒక సంవత్సరం క్రితం నేనూ, నా మిత్రులు ప్రముఖ పత్రికా సంపాదకులు శ్రీ కె. రామచంద్రమూర్తిగారు, శ్రీ పాండురంగారావుగారు హైదరాబాద్ వచ్చారని తెలిసి వెళ్ళి కలిసాము. ఆ రోజు ఆయన బాల్యం నుంచీ సుమారు 70 ఏళ్ళ జీవితాన్ని మాకు వివరించారు. మాకు పోతనను చూపించారు. మా ముందు వాల్మీకిని ఆవిష్కరించారు. ఆ తన్మయంలో తన్నుతాను మర్చిపోయారు. వారిని చూసిన క్షణం మాకు కలిగిన దివ్యానుభూతిలో మమ్మల్ని మేము మర్చిపోయాము. మూడుగంటలు గడిచాక ఓ ఉద్విగ్నమైన స్థితిలో మేము బయటకు వచ్చాం.

ఆ రోజు రాత్రే శ్రీ పాండురంగారావు గారి కుమారులు, మిత్రులు శ్రీ ఐ.వి. సుబ్బారావు గారితో వివిధ విషయాలపై శ్రీ పాండురంగారావుగారు వ్రాసిన విలువైన వ్యాసాలను పుస్తక రూపంలో తీసుకురావడం బావుంటుందని, అలాగే వారి "సహస్రధార" (విష్ణు సహస్ర నామానికి వ్యాఖ్యానం)ను తెలుగులోకి అనువదించడం ఎంతైనా అవసరమని, వారి రచనలన్నింటిని క్రోడీకరించి ప్రచురించడానికి వీలుగా సేకరించి ఇవ్వాలని కోరడం జరిగింది. శ్రీ సుబ్బారావుగారు ఎంతో శ్రమకోర్చి ఈ కార్యక్రమాన్ని పూర్తిచేశారు. అందుకు వారికి కృతజ్ఞతలు. త్వరలో 'సహస్రధార', 'ఉపనిషత్ సుధ' మీకు అందించాలని సంకల్పం.

ఈ పుస్తకం ప్రచురించే అవకాశం కల్గినందుకు అక్షరానికీ, అక్షరమూర్తి శ్రీ పాండురంగారావుగారికి అంజలి ఘటిస్తున్నాను.

విజయకుమార్

# ఆత్మానందలహరి

ఆత్మీయులు, ఆప్తమిత్రులు శ్రీ దూపాటి విజయకుమార్ గారికి ఆధ్యాత్మిక తత్త్వచింతనను గురించి నేను అప్పుడప్పుడు రచించిన కొన్ని వ్యాసాలను ప్రచురించాలనే సంకల్పం కలగటం నాకు చాలా ఆత్మానందాన్ని అందించింది. మనం జీవితంలో ఎన్ని రకాల ఆనందాలను ఎన్ని పర్యాయాలో ఏ విధంగానో పొంది ఆనందంతో పొంగిపోతూ ఉంటాము. కాని ఆధ్యాత్మిక రసవాహినిలో రసనిర్భరమైన ఆనందతరంగాలను అంతరంగంలో తిలకించి పులకించి ఇహపరాలకు ఒకచైతన్యలహరిని సమకూర్చుకోవాలనే చైతన్యం సామాన్యంగా అందరికీ ఉదయించదు. అలాంటి శుభోదయం రసజ్ఞులయిన శ్రీవిజయకుమార్‌లో ఈనాడు నెలకొన్నది. ఇది "ఆత్మానందలహరి" అనుగ్రహం వల్ల ఆవిర్భవించింది. ఆత్మానందం అన్ని ఆనందాలను మించిన అనుభవం. ఈ ఆనంద వితరణకు నన్ను ఉపకరణంగా వినియోగించాలనే శుభకామనను నేను ఆనందంతో – పరమానందంతో – అంగీకరిస్తున్నాను.

అన్నిటికంటె విచిత్రమైన విషయం ఏమిటంటే ఈనాడు దూపాటి వారి మనస్సులో ఉదయించిన ఈ సంకల్పంలాంటి మహదాలోచన ఒకటి దాదాపు 25 సంవత్సరాల వెనుక యమ్.శేషాచలం కంపెనీకి అధ్వర్యులయిన శ్రీ యమ్.ఎన్.రావు (మద్దూరి నరసింహారావు) గారి హృదయంలో కార్యక్రమలంలా ప్రస్ఫుటించింది. సరిగా నవంబరు 7వ తేదీ, 1977 నాడు వారు "ప్రాగ్భారతీ ప్రచురణలు" అనే నూతన సంకల్పానికి పునాది వేశారు. అంతకుముందు 28 అక్టోబరు ఆ సంవత్సరమే మాయింటికి వచ్చి ఈ ప్రచురణలకు కావలసిన ఏర్పాట్లు చేసుకొని వెళ్ళారు. ఆది–అనాది, ఆదిత్య హృదయం, గీతామృతం, శ్రీవిష్ణుసహస్రనామం, శ్రీలలితా సహస్రనామం ఈ అయిదు పుస్తకాలతో ఈ ప్రాగ్భారతిని వారు ప్రారంభించారు. 7.11.1977నాడు ఆరంభమయిన ఈ ప్రణాళిక 21.12.1977నాటికి సక్రమంగా సాంతంగా నెరవేరింది. 1978 జనవరి 14వతేదీ వారు ఢిల్లీకి వచ్చి ఈ పుస్తక పంచమిని ఢిల్లీ ఆంధ్రులకు అందించారు. అనతికాలంలోనే ఈ రచనలు దేశంలోని తెలుగువారికి వారు అద్భుతమైన ప్రణాళికతో అందచేశారు. వారి సంకల్పదార్ఢ్యం ఎంత సాత్విక శుద్ధి కలదంటే ఈ రచనలతో పాటు మరి కొన్ని ఇలాంటి వాటితో నా యీ రచనలన్నీ తిరుపతిలో స్వామి పదసన్నిధిని చేరుకొన్నాయి.

మరి ఈనాడు చిరంజీవి విజయకుమార్ హృదయంలో కూడా ఉదయించిన ఈ ఆత్మానందలహరి ఇలాగే ఆధ్యాత్మికరంగంలో ప్రసరించి మంచిమంచి మాటలను, మంచి మంచి మనస్సులకు అందజేయగలదని నా నమ్మకం. ఇందులో నా పురుషార్థం కేవలం ప్రతిపదార్థం వరకే పరిమితం. మిగిలినదంతా చదువరులు, ఆత్మీయులు, ఆత్మచింతనతో లోకకల్యాణం కోసం కృషి చేసే ప్రబుద్ధులపై ఆధారపడి ఉంటుంది. మంచి ఇంటికంటె మంచి నయనము మేలు. మంచిని మించిన దృష్టి కంటె మానవజాతికి మార్గశీర్ష సంపదను పంచిపెట్టే ఆధ్యాత్మిక చైతన్య సృష్టి మేలు. అలాంటి దృఢ సంకల్పంతో చి. విజయకుమార్ తన ఆలోచనా సరళిని పోషించుకొని మహత్వ కవిత్వ సంపదలకు మించిన సాత్విక సారస్వత సంపదను ప్రసరింపచేయగలరని నా నమ్మకం.

'ఎమెస్కో' అనగానే నాకు నా 'కామాయని' గుర్తువస్తుంది. సుప్రసిద్ధ హిందీకవి జయశంకర్ ప్రసాద్ రచించిన మహాకావ్యం ఇది. దీనిని నేను తెలుగులో అనువదించాను. వ్రాత ప్రతి చూడగానే శ్రీయమ్.ఎన్.రావు గారు 'ఇది నేను ప్రచురిస్తా'నని తీసుకుని వెళ్ళారు. దానితో వారి మనస్సు 'ప్రాగ్భారతి' వైపు ప్రసరించింది.

ఇదంతా కాల మహిమ అని నాకు అనిపిస్తుంది. అసలు 'ఇలపావులూరు' లాంటి చిన్న పల్లెలో పుట్టిన నాకు ఈనాడు కలలో కూడా అనుకోని హిందీ, బెంగాలీ లాంటి భాషలలో ఉన్న మహోన్నత సాహిత్యం కూడా కరతలామలకం కావటం, ఈ భాషలలో కనిపించిన మంచిమంచి 'ఆత్మానందలహరి' ని మన తెలుగు తల్లికి వినిపించటం – అంతా ఆ పరమాత్మ ప్రసాదించిన వాగ్విలాసమే. ఏడు సంవత్సరాల వయస్సులో తిమ్మనపాలెం అనే పల్లెటూరులో ఉన్నప్పుడు ఎవరో ఒక సాధువు మాయింటికి వచ్చి శ్రీమద్ భగవద్గీతను నాకు అందించి దాన్ని ప్రతిదినం పారాయణం చేయవలసిందని చెప్పారు. అది నాగరీలిపిలో హిందీ భాషలో ఉండటం విశేషం. అది ముక్కోటి ఏకాదశి. అలా గీతామృతం నాకు అవలీలగా అందింది. ఎమెస్కో వారు ప్రచురించిన నా 'గీతామృతం' ఆ సాధువు ప్రసాదించిందే. అలాగే కలకత్తాలో భారతీయ భాషా పరిషత్తులో పనిచేసేప్పుడు బెంగాలీతో బాగా పరిచయం ఏర్పడింది. ఇవన్నీ ఆత్మ అందించిన ఆనందమే కాని మరేమీ కాదు.

ఈ లహరిని చక్కగా లోకకల్యాణానికి ఉపయోగించవలసిందని చిరంజీవి విజయకుమార్‌కు నా సలహా. మంగళం మహత్.

రాధామాధవమ్, మహావీర్ ఎన్‌క్లేవ్,
పాలం, న్యూఢిల్లీ

ఇలపావులూరి పాండురంగారావు

## ఆధ్యాత్మికలహరి



## సాహిత్యవిమర్శలహరి



## కవితాలహరి

## అనువాద కవితాలహరి

# ఆదిత్య హృదయం

ప్రపంచంలోని ప్రాణికోటికి ప్రాణశక్తిని ప్రసాదించే ప్రభాకరుడు ప్రత్యక్షదైవం. ఇతర దేవతలు భావనాగమ్యులు. సామాన్యులకు సాధ్యులు కారు. సకల దేవతల శక్తి సామర్థ్యాలను దయా దాక్షిణ్యాలను, అగ్రహానుగ్రహాలను తన హృదయంలో దాచుకొని తనను ఆరాధించేవారిని తగు మాత్రంలో అనుగ్రహించే ఆదిత్యుని హృదయాన్ని వివరించే స్తోత్రరాజం – ఆదిత్య హృదయం.

ఆదిత్యుడంటే సూర్యుడు. కాని సూర్యుడికి సవిత, రవి, అర్కుడు, భాస్కరుడు, దివాకరుడు, దినమణి, తపనుడు అని ఎన్నో పేర్లు ఉన్నాయి. ఈ పేర్లన్నీ సూర్యుని గుణగణాలను వివరిస్తాయి. ఇందులో 'ఆదిత్య' నామం ఈ స్తోత్రం రచించిన ఆదికవి వాల్మీకిని ఎక్కువగా ఆకర్షించింది. అందువల్లనే దీనికి ఆదిత్య హృదయమనే పేరు వచ్చింది.

ఆదిత్యులు పన్నెండుమంది. ఈ పన్నెండుమంది ఆదిత్యులలో విష్ణువు కూడా ఒకడు. "ద్వాదశాదిత్యులలో విష్ణు స్వరూపము నాది" అని గీతాచార్యుడు ప్రతిపాదించటం దీనికి ప్రమాణం. కనుక ఆదిత్యులలో ప్రధానుడైన శ్రీ మహా విష్ణువును కూడా ఉద్దేశించి చెప్పబడిన స్తోత్రమగుటచేత దీనికి ఆదిత్య హృదయమనే పేరు సార్థకమవుతుంది. నిజానికి మనకు కావలసిన కాంతిని, శాంతిని, నిలకడను, సరసతను, హాయిని, స్థాయిని ప్రసాదించే సచ్చిదానంద శక్తి ఆదిత్యహృదయంలో ఉన్నది.

సామాన్యంగా ఆదిత్య శబ్దానికి అదితి పుత్రుడనే అర్థం చెప్పుకుంటారు. దితి సంతతిని దైత్యులని, అదితి సంతతిని అదీనులైన దేవతలని భావించటం పరిపాటి. దితి శబ్దానికి దైన్యం అనే అర్థం కూడా ఉంది. దైన్య రాహిత్యం వల్ల ఆవిర్భవించే తేజోమూర్తి ఆదిత్యుడు. సర్వకాల సర్వావస్థలయందు నిర్వికల్పంగా నిశ్శిథిలంగా గగన వీథిని సంచరించే ప్రభాపుంజం ఆదిత్య హృదయం. ఆదిత్యుని హృదయాన్ని అవగాహనం చేసికోగలిగితే అనంతమైన జ్ఞానాన్ని సొంతం చేసుకొన్నట్టే. కనుకనే "వేదాహ మేతం పురుషం మహాంతం ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్" అని శ్రుతివిశారదులు పారవశ్యంతో పొంగిపోయారు. సూర్య మండల మధ్యస్థయైన మహాత్రిపురసుందరిని మనసా దర్శించిన పరమేశ్వరీ పరాయణులు కూడా ప్రభాకరుని ప్రాభవాన్నే ప్రకటించారు. ఆకాశంలో నిర్విరామంగా, వేవెలుగులతో వెలుగుతున్న ఆదిత్యునే మూడు సంధ్యలలో జ్యోతిర్విదులు ఆరాధిస్తారు. వేద మాతయైన గాయత్రీ మంత్రంలో సవితా దేవత యొక్క వరేణ్య వైభవమే వివరింపబడింది.

ఇంతటి అమోఘమైన సూర్య తేజస్సును 31 శ్లోకాలలో పుణ్యశ్లోకుడైన వాల్మీకి మనకు అందించడం మన అదృష్టం. ఇంత సులభసూత్రంగా వేదాంతశాస్త్రమంతా మనకు అందుబాటులో ఉన్నప్పటికీ దాని జోలికి మనం వెళ్ళకపోవటం మన దురదృష్టం.

వాల్మీకి రామాయణంలో ఆదిత్య హృదయం ఎలా ప్రవేశించింది? రామాయణ కథానాయకుడు రాముడు. సూర్యవంశంలో పుట్టినవాడు. పట్టపగలు, మిట్ట మధ్యాహ్నపు వేళ రామజననం జరిగింది. అకారణంగా కాలచోదితుడైన రావణుడు ఆయనతో వైరం పెట్టుకున్నాడు. సామదాన భేదాలు ఫలించలేదు. కోదండపాణి దండపాణియై రణరంగంలోకి దూకాడు. రావణుడు నిశాచరుడు. చీకటిలా ప్రపంచాన్ని ఆవరించి చిన్మయానందంలో ఓలలాడవలసిన ప్రాణికోటికి చిత్రవిచిత్రమైన బాధలు కల్పిస్తున్నాడు. తనకే గాక తనతోటి మానవకోటికి కూడా కంటకంగా ఉన్న రావణుని సంహరించేందుకు రాముడు సర్వప్రహరణాయుధాలతో సమరం సాగించాడు. అమోఘమైన తపశ్శక్తితో పరమేశ్వరుని అనుగ్రహం పొందిన రావణుణ్ణి సంహరించటం అంత సులభంగా కనిపించలేదు. రావణుడు రణరంగంలో అలసిపోయినా సరే అసురధైర్యంతో ఎదుర్కొంటున్నాడు. అతనిని ఎలా సంహరించటం అని రాముడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అప్రతిమానమైన రామ రావణ యుద్ధం చూచేందుకు అంతరిక్షంలో దేవతలు, మహర్షులు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు అందరు విచ్చేశారు. వారిలో అగస్త్య మహర్షి కూడా ఉన్నాడు. ఆలోచనలో మునిగి ఉన్న రామచంద్రుని వదనారవిందం చూచి అగస్త్యుడు క్రిందికి దిగి వచ్చాడు. ఏకాంతంగా రాముని చెంతకు చేరి కులదేవత, పరదేవతయైన సూర్య భగవానుని ఆరాధించమని ఆదిత్యహృదయం అందిస్తాడు. రాముడు అందుకుంటాడు, ఆనందిస్తాడు. ఆరాధిస్తాడు. మరుక్షణంలోనే రామరావణ యుద్ధం ముగిసిపోతుంది. ఇది వాల్మీకి రామాయణంలో యుద్ధ కాండలో 105వ సర్గలో జరిగిన వృత్తాంతం. ఈసర్గలో మొత్తం 31 శ్లోకాలు ఉన్నాయి. దీన్నే ఆదిత్య హృదయం అంటారు.

రామరావణ యుద్ధంలో రామవిజయం, రావణ పరాజయం చీకటి వెలుగుల పోరాటంలో వెలుగు గెలుపును చాటి చెపుతుంది. బహిరంతర తిమిరాన్ని ఛేదించి చిరంతన చైతన్యంలోని నిత్యసత్య సందీప్తిని సాక్షాత్కరించుకొనేందుకు ఈ ఆదిత్యహృదయం ఆనాడు రామ చంద్రునికి రణరంగంలో ఎలా సహకరించిందో, ఈనాటికీ ప్రాణికోటికి అంతరంగిక జీవిత రంగంలో అలాగే ఉపకరిస్తుంది. కృష్ణార్జునుల నిమిత్తంగా గీతామృతం ప్రవహించినట్లే అగస్త్యరామచంద్రులను ఆలంబనం చేసికొని ఆదిత్య హృదయం ఆవిర్భవించింది. భారతంలో భగవద్గీత, రామాయణంలో ఆదిత్యహృదయం–ఈ రెండు రణరంగంలోనే వెలువడడం గమనించదగ్గ విషయం. ప్రపంచశాంతికి ఆత్మతుష్టికి మూలకందములైన భయభక్తులు ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉన్నాయేమో అని అనిపిస్తుంది.

వాల్మీకి రామాయణంలో ఇలాంటి స్తోత్రాలు ఎక్కువగా కనిపించవు. అసలు వాల్మీకి రామాయణమంతా ఒక మహాస్తోత్రం, మంత్రరాజం, ఒక్కొక్క అక్షరం మహాపాతకాలను నశింపచేసే మహత్తరమైన మంత్రం. అలాంటి మంత్రశక్తితో గాయత్రీ బీజసమ్మితంగా రచించిన రామాయణంలో చోటు చేసుకొన్న ఈ స్తోత్రం ఎంత ప్రశస్తమైనదో ఊహించవలసిందే కాని మామూలు మాటలలో వివరించటం సాధ్యం కాదు.

ఆదిత్య హృదయంలోని 31 శ్లోకాలలో సర్గసమాప్తిని సూచించే చివరి శ్లోకాన్ని శాంతిపాఠంగా భావిస్తే 30 శ్లోకాలు మిగులుతాయి. ఇందులో మొదటి తొమ్మిది శ్లోకాలు స్తోత్రానికి పూర్వరంగాన్ని సమకూర్చుతాయి. చివరి తొమ్మిది స్తోత్ర ప్రాశస్త్యం, ఫలశ్రుతి మొదలైన వాటిలో ముగింపును సూచిస్తాయి. ఇలా మొదటి తొమ్మిది, చివరి తొమ్మిది శ్లోకాలను మినహాయిస్తే మధ్య పన్నెండు శ్లోకాలు కేవలం స్తుతి భాగానికి చెందినవిగా కనిపిస్తాయి. ఈ పన్నెండు శ్లోకాలు ద్వాదశాదిత్యులకు ప్రాతినిధ్యం వహిస్తున్నట్టు కనిపిస్తుంది. సరిగా ఈ స్తుతి మధ్య భాగంలో "ద్వాదశాత్మన్నమోస్తుతే" అనే నమోవాకం కూడా వినవస్తుంది. ఒక విధంగా చూస్తే ఈ నమోవాకం ఈ సూర్యానువాకానికి సంధి స్థలంగా గోచరిస్తుంది. పూర్వభాగంలో భాస్కరుని ప్రభావైభవాలను ప్రకటించే దివ్యనామ సంకీర్తనం వినిపిస్తుంది. ఉత్తర భాగంలో నమోవాకపురస్సరంగా ఆరాధ్యదేవతకు అంజలి అర్పించటం కనిపిస్తుంది. కాబట్టి మొదటి ఆరు శ్లోకాలు స్తుతికి చెందినవని, తరువాతి ఆరు శ్లోకాలు నుతికి చెందినవని భావించినా తప్పులేదు. రుద్ర ప్రశ్నలోని నమకచమకాలవలె ఆదిత్యహృదయంలో ఈ రెండు భాగాలు అందులోని శబ్దాలకు శ్రుతి గౌరవాన్ని సంక్రమింప చేస్తాయి.

ఈ విధంగా ఆదిత్యహృదయంలోని మంత్రభాగం, సర్గమధ్యలో స్తోత్ర హృదయంలో సంపుటీకరించబడింది. ప్రతి స్తోత్రానికి అనుషంగికంగా ఉండే అంగన్యాసకరన్యాసాలు కూడా ఈ మంత్రభాగానికి ముందుగా ఉన్న శ్లోకాలకు చేర్చబడ్డాయి. కాబట్టి ఈ స్తోత్రం సర్వసమగ్రమైనది. స్తోత్రం పఠించేప్పుడు సామాన్య ధరాతలం నుండి మనస్సు క్రమంగా భూర్భువస్సువలోకాలకు పయనించి మహత్తరమైన సత్యాన్ని సాక్షాత్కరించుకొని మరల పుడమికి తిరిగినట్టుగా అనిపిస్తుంది.

ఈ స్తోత్రం 'తతో యుద్ధ పరిశ్రాంతం' అనే చరణంతో ఆరంభమవుతుంది. ఇందులోని మొదటి పదం, సుందరకాండలోని మొదటి పదం ఒకటే కావటం గమనించదగ్గ విషయం. తదీయమైన ఈ పదాన్నే అన్వేషిస్తూ వెళతాడు సీతాతత్త్వార్థకోవిదుడు హనుమంతుడు. 'తత్త్వమసి' 'యత్తత్పదమనుత్తమం' 'చితి స్తత్పద లక్ష్యార్థా' మొదలైన సూక్తులలో కీర్తించబడిన తత్త్వార్థమే ఈ 'తతః' అనే శబ్దంలో స్ఫురిస్తుంది.

ఆదిత్యహృదయంలోని మొదటి రెండు శ్లోకాలు స్తోత్ర సందర్భాన్ని వివరిస్తాయి. అగస్త్యుడు రాముని సమీపించటం ఈ రెండు శ్లోకాలకు తాత్పర్యం. మూడవశ్లోకం అగస్త్యుని సంబోధనలతో ఆరంభమవుతుంది. "రామరామ మహాబాహో" అని అగస్త్యుడు ఆజానుబాహువైన రామచంద్రుని సంబోధిస్తాడు. రణరంగంలో రావణ సంహారం కోసం తన పరాక్రమాన్ని సద్వినియోగం చేస్తున్న రాముణ్ణి మహాబాహువని సంబోధించటంలో ఎంతో ఔచిత్యం ఉంది. అంతకు మించిన ఔచిత్యం "రామరామ" అని రెండు మార్లు రామ శబ్దాన్ని ఉచ్చరించటంలో ధ్వన్యాత్మకంగా దాగి ఉన్నది. బాల్యంలోనే రాఘవరాముడు, భార్గవ రాముణ్ణి నిర్జించి అతని తేజస్సును తనలో లయింపచేసుకున్నాడు. కాబట్టి భార్గవరాముని పరాక్రమం, దశరథ రాముని దాక్షిణ్యం – రెండూనీలో మేళవించి ఉన్నాయి సుమా అని అగస్త్యుడు హెచ్చరిస్తున్నాడు. నీవు కౌసల్యాదశరథులు కన్న మామూలు రామయ్యవు కావు, చతుర్బాహువైన శ్రీమహావిష్ణువు తేజస్సు నీలో మూర్తీభవించి ఉన్నదని కూడా అగస్త్యుడు సూచిస్తున్నాడు. మహాబాహువనే సంబోధనలో బాహువుల సంఖ్య సూచింపబడలేదు. వాటి మహత్తు మాత్రమే చెప్పబడింది. ఎదుట నిలబడి ఉన్న శత్రువు దశకంధరుడు. అతనికి ఇరవై బాహువులున్నాయి. అన్ని బాహువులున్నా రామచంద్రుని రెండు బాహువులలో ఉన్న మహత్తత్త్వం అతనికి లేదు. భూర్భువస్సువ లోకాలకు మించినది మహర్లోకం. ఆదిత్యుడు దానికి అధిపతి. మహ ఇతి బ్రహ్మ అన్న తైత్తిరీయ సూక్తిని బట్టి పరబ్రహ్మ యొక్క బాహుపరాక్రమం రామునిలో ఉన్నదని మహాబాహువనే సంబోధన తెలియపరుస్తుంది. మహ ఇత్యాదిత్యః అన్న శ్రుతి వాక్యం సూర్యశక్తి రామబాహువులలో ఉన్నదని స్ఫురింపచేస్తుంది. ఈ సంబోధనతోనే ఆదిత్యహృదయంలోని మంత్రశక్తి ప్రారంభమవుతుంది. ధ్వన్యాత్మకమైన ఈ సంబోధన తరువాత పరమ రహస్యం, పరమ పురాతనమైన పదార్థాన్ని నీకు అందజేస్తున్నానని అగస్త్యుడు అంటాడు. ఈ పరమ రహస్యం ఈ సంబోధనలోనే ఉంది.

నాలుగవ శ్లోకంనుండి స్తోత్ర ప్రాశస్త్యం ఆరంభమవుతుంది. ఆదిత్యహృదయం పరమ పావనమైన స్తోత్రమట. అంతః శత్రువులను నశింపచేయగలిగిన శక్తి ఈ స్తోత్రంలో ఉన్నదట. దీనిని నిత్యం జపించిన వారికి జయము చేకూరుతుందట. శుభం కలుగుతుందట. లభించిన జయం, కూడిన శుభం కలకాలం నిలబడుతాయట. మంగళకరమైన వస్తువులకన్నింటికీ మాంగళ్యాన్ని ప్రసాదించగలిగే ఈ మహామంత్రం సకల పాపాలను, చింతలను, చీకులను, శోకాన్ని ఉపశమింపచేస్తుందట. ఆయుస్సు పెంచుతుందట. ఇంతకు మించిన స్తోత్రం లేదట.

అరుణోదయ కిరణ కాంతితో చతుర్దశ భువనాలను లాలించి పాలించే భాస్కరుని దేవతలు, గంధర్వులు, రాక్షసులు అందరు ఏదో విధంగా ఆరాధిస్తారు. సూర్యుడు

ఉదయించగానే అర్ఘ్యపాద్యాదులతో అంజలి ఘటిస్తూ దేవతలందరు ప్రత్యక్ష దైవమైన ప్రభాకరునికి నమస్కరిస్తారు. ఈ ప్రాశస్త్యం తెలియని రాక్షసులు, తత్తుల్యులు నిద్రాముద్రలోనే సవితకు సాష్టాంగ నమస్కారం చేస్తారు. సూర్యుడు సర్వతోముఖుడు కాబట్టి ఏ దిక్కు నుండి నమస్కారం చేసినా ఆ మొక్కు ఆయనకే చెందుతుంది. ఇలాంటి సూర్య దేవతను పూజించవలసిందని అగస్త్యుడు రామచంద్రునికి ఉపదేశిస్తాడు. ఈ ఉపదేశ వాక్యం ఆరవశ్లోకంలో ఆరు భాగాలుగా వినవస్తుంది. పూజయస్వ (పూజించుము) అనే ఆదేశపదానికి రశ్మిమంతం, సముద్యంతం, దేవాసుర మనస్కృతం, వివస్వంతం, భాస్కరం, భువనేశ్వరం అనే ఆరు పదాలు అంగన్యాసకరన్యాసాలతో షణ్ముఖ సంపదను సూచిస్తాయి. ఆదిత్యహృదయమనే మంత్రానికి ఇది న్యాసభాగం.

భాస్కరుని ఉపాసించవలసిందని ఉపదేశించిన తరువాత సకలదేవతలు ఆ భాస్కరునిలోనే మూర్తీభవించి ఉన్నారని అగస్త్యుడు వివరిస్తాడు. కిరణ కరణములతో తేజోమూర్తిగా భాసించే భాస్కరుడు సర్వదేవతాస్వరూపుడు. దేవతలను, రాక్షసులను సమభావంతో పోషించే సాత్వికమైన స్వభావం సూర్యకిరణములలో స్వతస్సిద్ధంగా ఉంది. మంచివారికీ, చెడ్డవారికీ, ఉన్నవారికీ, లేనివారికీ, రాజభవనాలకూ పూరిగుడిసెలకూ సూర్యకాంతి సమానంగా లభిస్తుంది. ఒక విధంగా చూస్తే కోటల కంటె కుటీరాలకే సూర్యకిరణాలు ఎక్కువ సూటిగా ప్రసరిస్తాయి. తన కిరణజాలంతో లోకబాంధవుడు సమస్తలోకాలను సృష్టిస్తాడు, పోషిస్తాడు, లయింపచేస్తాడు. కనుకనే బ్రహ్మ, విష్ణువు, శివుడు ముగ్గురు సూర్యకాంతిలోనే ఉన్నారు. అంతేకాదు, దివినుండి భువికి దిగివచ్చిన దేవతను స్కందుడని భావించటంలో కూడా పొరపాటు లేదు. ఇంద్రుడు, కుబేరుడు, యముడు, సోముడు, వరుణుడు పితృదేవతలు, ఎనిమిది మంది వసువులు, ఇద్దరు అశ్వినీ దేవతలు, మరుద్గణాలు, సాధ్యులు-అందరు భాస్కరునికి ప్రతిరూపాలుగా గోచరిస్తారు. వాన కురిపించేవాడు ఇంద్రుడు. కాని సూర్యుని సహకారం లేనిదే ఇంద్రుడా పని చేయలేడు. అలాగే సకలసంపదలను ప్రసాదించే కుబేరుడు, ఆధివ్యాధులను పోగొట్టే అశ్వినీ కుమారులు, ప్రాణములను పోసే ప్రజాపతి, ఆ ప్రాణములను హరించే యముడు, వసుంధరను సస్యశ్యామలం చేసే చంద్రుడు, వసువులు, ఆలోచనలిచ్చే మనువు, గాలి, నిప్పు, ఊపిరి, ఋతువులు, పగలు, రాత్రి, వెలుగు-వీటన్నిటికీ మూలాధారం సూర్యుడు. సూర్యరశ్మి సహకారంతోనే ఈ పనులన్నీ యధావిధిగా జరుగుతూ ఉన్నాయి.

ఆది దేవుడైన సూర్యునికి ఆదిత్యనామం సర్వధా సార్థకమైనది. సర్వస్వం ప్రసవింపచేసేవాడు కాబట్టి అతనికి సవిత అనే పేరు వచ్చింది. ఎవ్వరు చొరరాని చోటులో కూడా సూర్యకిరణాలు చొచ్చుకొని పోతాయి. కాబట్టి ఖగనామధేయం అతనికి చెల్లింది.

విశాలమైన రెక్కలతో వినువీధిని సంచరించే గరుత్మంతునికి కూడా ఖగరాజనే పేరుంది. గరుత్మంతునిలా సూర్యుడు కూడా ఆకాశమార్గంలో సంచరిస్తూ అఖిలప్రపంచానికి అమృతం పంచిపెడతాడు. ప్రాణికోటిని పోషించేవాడు కాబట్టి పూషనామం వచ్చింది. కిరణాలతో శోభిల్లుతూ ఉంటాడు కాబట్టి గభస్తిమంతుడని పించుకున్నాడు. పసిడి వన్నెతో మిసమిసలాడుతూ, వెలుగుతూ వెలిగిస్తూ, పగటి వెలుగును వెలయిస్తూ ఉంటాడు కాబట్టి స్వర్ణ రేతస్కుడనిపించుకున్నాడు.

ఆకుపచ్చని గుర్రాలపై వేవెలుగులసామి రాజఠీవితో విహరిస్తాడట. ఆయన గుర్రాలకు సప్తి అని పేరు. సప్తి నామధేయంగల ఏడు గుర్రాలపై పయనిస్తాడు. కాబట్టి సప్తసప్తి అనే పేరు ఆయనకు వచ్చింది. సూర్యకాంతిలో ఏడు వన్నెలు ఇమిడి ఉన్నాయి. భూర్భువస్సువాది సప్తలోకాలలో సూర్యకాంతి ప్రసరిస్తుంది. సప్తమినాడు సూర్యకాంతి సర్వలోకపర్వంగా ప్రజ్వలిస్తుంది. అందువల్లనే రథసప్తమి సూర్యపర్వంగా రూపొందింది. సూర్యకిరణాలకు మరీచులని పేరు. ఎండమావులను కూడా మరీచికలంటారు. సూర్యకిరణాలు శూన్యం నుండి వెలువడి సకలభువనాలలో ప్రసరించే శక్తి చైతన్యం లాంటివి. కనకనే శివశక్తి సామరస్యాన్ని సూర్యమండల మధ్యవర్తిగా భావించటం భావనాపరులకు అభీష్టం. సూర్యుని పేరు చెపితేనే చీకటి ఛిన్నాభిన్నమై చెదరిపోతుంది. చీకటిని చిలికి దానిలో నుంచి శివతత్వాన్ని నవనీతంగా వెలికి తీయగలిగిన దిట్ట కాబట్టి సూర్యుణ్ణి మహర్షులు శంభువుగా కూడా భావించారు. ఆయన త్వష్టఅట. త్వష్ట అంటే వడ్రంగి అని అర్థం. వడ్రంగి అడవిలో దొరికిన కొయ్యను తీసుకొని తన రూపకల్పనకు అనుగుణంగా దానిని కోసి మలిచి ఒకానొక రమణీయమైన ఆకృతిని సృష్టిస్తాడు. అలాగే సూర్యుడు కూడా ప్రాణులకు కావలసిన ప్రాణశక్తిని తగుమోతాదులో తగినరీతిలో ప్రసాదించి వారికి పరిమిత లావణ్యాన్ని, అవయవ సౌష్ఠవాన్ని చేకూరుస్తాడు. అంతేకాదు, దేశకాలాలను కూడా ఇలానే నియమితం చేసి రేయింబవళ్ళను, తిథులను, నక్షత్రాలను, మాసాలను, ఋతువులను, అయనాలను, సంవత్సరాలను కల్పిస్తాడు. కనక సూర్యుడు నిజమైన త్వష్ట. కాని ఈ త్వష్ట యొక్క ఆశయం వికసింపచేయటమే కాని నశింపచేయటం కాదు. వినాశంలో కూడా వికాసాన్ని బీజరూపంలో ఇమడ్చగల శక్తి అతని చైతన్య కిరణరాశికి ఉన్నది.

అతడు హిరణ్యగర్భుడు 'హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్' అని శ్రుతి కీర్తించిన హిరణ్యగర్భుడు సూర్యుడే. సృష్టికి ఆది, ఆధారం ఈ హిరణ్యమే. ఈ హిరణ్యం సూర్యుని గర్భంలో పుష్కలంగా ఉంది. ఎంత కాలరాత్రి గడిచినా సూర్యుడుదయించటంతో ఆశలు చిగురిస్తాయి. పసిడి కాంతితో ప్రకృతి పరిఢవిల్లుతుంది. శిశిరంలో ఉన్న చల్లదనం, మెత్తదనం, నైరాశ్యం, నిర్వేదం సూర్యుని వల్లనే లభిస్తాయి. ఆ

సూర్యుడే మండువేసవిలో తపనుడై భూమిని తపింపచేస్తాడు. ఒకప్పుడు కాంతినిచ్చే భాస్కరుడు, మరొకప్పుడు చైతన్యాన్ని ప్రసాదించి అంతస్తేజస్సును వెలయించే రవి అవుతాడు. అతని కడుపులో పసిడి ఉన్నట్టే అగ్ని కూడా ఉంది. అదితి కన్న అల్లారుబిడ్డ కాబట్టి అతడు ఎక్కడికి వెళ్ళితే అక్కడి వాయుమండలమంతా పవిత్రమవుతుంది. శంఖ శబ్దంలో శం మంచిని సూచిస్తుంది. ఖ శబ్దం ఆకాశవాచ్యం. సూర్యగమనం ఆకాశానికి పావనత్వాన్ని ప్రసాదిస్తుంది. అతడున్న చోట మంచు నిలవలేదు. మంచును హరించి మంచిని పెంచే మహనీయుడు సూర్యుడు.

ఆకాశానికి అధిపతి అవడంవల్ల అతనికి వ్యోమనాథుడనే పేరు వచ్చింది. చీకటిని చీల్చుకొని వేదత్రయ నాదాన్ని లోకత్రయికి వినిపిస్తూ, మేఘాలను మెరిపిస్తూ, వర్షాలను కురిపిస్తూ, నీళ్ళతో నెయ్యం జరిపిస్తూ, వింధ్యాచలం మీద గంతులు వేస్తూ, విహరిస్తూ ఉంటాడు, వేయి వన్నెల వేల్పు సూర్యదేవుడు.

కోపం వస్తే కాలాగ్నిలా మండిపడతాడు. సూర్యమండలం అతనికి జన్మకుండలి. ఆ మండలికి అతడే ప్రభువు. పింగళ వర్ణంలో ప్రజలకు ప్రాణాలు పోసే సూరన్న అవసరమని తోచినప్పుడు వాళ్ళను తపింపచేస్తాడు. లేనిది సృష్టించగల శక్తి కలవాడు కనక అతనికి కవి నామం సార్థకమయింది. విశ్వరూపుడైన అతని దివ్యతేజస్సుతో రంజిల్లని అంశముండదు. అన్ని భావాలకు, భవనాలకు, భువనాలకు, ఉద్భవాలకు అతడే మూలం.

ఆకాశంలో కనిపించే చుక్కలు, గ్రహాలు, నక్షత్రాలు, అన్నీ ఆయన చెప్పుచేతలకు లొంగి నడుచుకుంటూ ఉంటాయి. గ్రహాలు, నక్షత్రాలు ఒకే కాంతివలయంలో కొన్ని నియమాలకు కట్టుబడి ఉండడం సూర్యశాసనానికి నిదర్శనం. అశ్విని, భరణి మొదలైన ఇరవైఏడు నక్షత్రాలు. మిగిలినవి చుక్కలు. కదలిక గలవి గ్రహాలు, కదలకుండా ఉన్నట్టు కనిపించేవి చుక్కలు, నక్షత్రాలు. ఇవన్నీ సూర్యమండలంలో భాగాలే. మన సూర్యుడిలాంటి సూర్యులనేకులు బ్రహ్మాండంలో ఉన్నారు. ఆ సూర్యులకందరికీ ఆదిసూర్యుడు ఆదిత్యుడు. అలాంటి ఆదిత్యులు పన్నెండుమంది. వారిలో విష్ణువు ప్రధానుడు. ఈ ద్వాదశాదిత్యులలో వెలిగే ద్వాదశాత్మ అందరికీ నమస్యుడు, వంద్యుడు, ఆరాధ్యుడు.

ఈ ద్వాదశాత్మ సంస్మరణంతో ఆదిత్య హృదయంలోని పూర్వార్ధం – స్తుతి భాగం ముగుస్తుంది ఆ తర్వాత ఉత్తరార్ధంలో నుతి భాగం లేక నమకం ఆరంభమవుతుంది. సూర్యుడుదయించే తూర్పుదిక్కు, అస్తమించే పడమర దిక్కు – రెంటికీ నమస్కారం. ప్రపంచంలో కనిపించే వెలుగుకు, పగటికి అధిపతి అయిన కాంతి దేవునికి నమస్కారం.

జయస్వామికి నమస్కారం. మంగళకరమైన జయాన్ని ప్రసాదించే జయభద్రునికి నమస్కారం. పచ్చని గుర్రాలతో పయనించే వేవెలుగుల ఆదిత్యునికి మరిమరి నమస్కారం.

ఉగ్రమూర్తికి నమస్కారం. శూర ధీరునికి నమస్కారం. విలక్షణమైన వాక్కును వెలయించే వీరునికి నమస్కారం. సంసార సారాన్ని అవగాహనం చేసుకొని, తను తరించి, ఇతరులను తరింపచేసే తరణికి నమస్కారం. రేయి చివరి జామున చల్లని గాలికి హాయిగా నిదురపోతున్న కమలాలకు కిరణాలతో గిలిగింతలు పెట్టి మేల్కొల్పే చిలిపి చేతల చిన్మయమూర్తికి నమస్కారం. మృత్యువును స్వాధీనపరచుకొన్న మార్తాండునకు నమస్కారం.

బ్రహ్మను, ఈశానుని, అచ్యుతుని – ముగ్గురినీ స్వాధీనం చేసుకొన్న సూరనార్యునికి నమస్కారం. ఎంత ప్రసరించినా తరుగని అక్షయకాంతితో శోభిల్లే జ్యోతిరాదిత్యునికి నమస్కారం. భక్ష్యం – అభక్ష్యం అనే భేదం లేకుండా సర్వం హరించి, సర్వం తపింపచేసే రుద్రమూర్తికి నమస్కారం.

చీకటిని హరించి, మంచును పటాపంచలు చేసి, శత్రువులను సంహరించే సూర్యుడు మహితాత్ముడు, అమితాత్ముడు. అతని శక్తి అమోఘం. తలచుకుంటే అతడు కృతఘ్నులను కూడా సంహరించగలడు. అయాచితంగా, అవ్యాజంగా, అంతులేని కాంతిని మనకు ప్రసాదించేందుకు అతడు ఎక్కడినుండో మన పంచల్లోకి దిగివస్తే మనం మంచం మీది నుండి కూడా దిగేందుకు బద్ధకిస్తే మనం కృతఘ్నులం కాక మరేమవుతాం? కాబట్టి సూర్యదేవునికి ఏ మాత్రం అపచారం చేయకూడదు. సూర్యోదయమయ్యేసరికి లేచి ఆ ప్రాణసందేశాన్ని గ్రహించేందుకు సిద్ధంగా ఉండటమే ఆయనకి మనం చేయదగిన ఉపచారం. అలా చేయకపోవటమే అపచారం. వెలుగుల వేల్పు విచ్చేసేసరికి మనం మెలకువతో ఉండటమే మన విధి. అలాంటి జ్యోతిర్మయునికి నమస్కారం.

కాచిన బంగారపు వన్నెతో కళకళలాడే అగ్నిదేవునికి నమస్కారం. సకల కార్య సమర్థుడైన విశ్వకర్మకు నమస్కారం. బహిరంతర తిమిరాన్ని భేదించి కాంతిని ప్రసరింపచేసే లోకసాక్షికి నమస్కారం.

ఇంతటితో నమకం ముగుస్తుంది. మళ్ళీ సూర్య మహిమ ఆరంభమవుతుంది. ప్రాణులను నశింపచేసి మళ్ళీ సృష్టించగల శక్తి ప్రభాకరునిలో ఉంది. అతడు రక్షిస్తాడు, శిక్షిస్తాడు, వేడి వేడి కిరణాలతో మాడ్చివేస్తాడు, చల్లని వర్షం కురిపిస్తాడు.

మనం నిద్రపోయినా మనల్తో అతను మేల్కొని ఉంటాడు. "అగ్నే, త్వం సుజాగృహి, వయం సుమందిశీమహి" అన్న శ్రుతి గీతంలో చెప్పినట్టు సర్వకాల సర్వావస్థలయందు మనకు తోడునీడగా మనలో వెలుగుతూ ఉన్న ఆదిత్య రూపం సర్వథా ఆరాధ్యం. మనం చదివే వేదాలు, చేసే క్రతువులు, యజ్ఞయాగాదులు, వాటి ఫలితాలు, సకల కార్యకలాపాలు – అన్నిటికీ సాక్షీభూతుడై అంతరాత్మలా అతడు మన చెంతనే ఉంటాడు. మన వాక్కే

ఋగ్వేదం. మనం చేసే పనులే యజుర్వేదం. మన మనస్సులోని సామ్యమే సామవేదం. ఈ మూడింటిని నడిపించేవాడు ప్రాణస్వరూపుడు సూర్యుడు. అలాంటి సూర్యుణ్ణి స్మరిస్తే చాలు. భయంకరమైన ఆపదలు కూడా నశిస్తాయి. అడవి కూడా ఆనందనిలయంగా మారుతుంది.

"కాబట్టి ఆ దేవదేవుని, జగదీశ్వరుని ఏకాగ్రంగా ఆరాధించు. ఈ స్తోత్రం మూడు సార్లు పఠిస్తే యుద్ధంలో నీకు విజయం లభిస్తుంది. ఈ క్షణంలోనే నీ చేతుల్లో రావణ సంహారం జరుగుతుంది." అని అగస్త్యుడు రాముడికి బోధిస్తాడు. తొలిపలుకుల్లో చేసిన 'మహాబాహో' అనే సంబోధన ఈ మలిపలుకుల్లో కూడా రావటం గమనించదగ్గ విషయం. ఈ బోధనతో ఆదిత్య హృదయంలోని మంత్రభాగం ముగిసి ఫలశ్రుతి ప్రారంభమవుతుంది.

ఈ మాటలు చెప్పి అగస్త్యుడు తాను వచ్చిన దారిని తిరిగి వెళ్ళాడట. ఆ మాటలు విన్న రాముడు వినయంతో, ఆనందంతో, నిష్ఠతో ఆదిత్యహృదయం జపించాడట. కోదండం చేతబట్టుకొని రాముడు రావణ సంహారం కోసం రణరంగంలో ప్రవేశిస్తాడు. ఆ సమయంలో అంతరిక్షంనుంచి సూర్యుడు దిగివచ్చి రాముని సమీపించి 'త్వర' త్వరగా పని పూర్తి చేయవలసిందని సూచిస్తాడు. 'త్వర' అనే మాట, సూర్యుని నోట వెలువడటమే ఆలస్యం, లోకరావణుడైన రావణుడు పంచత్వాన్ని పొందుతాడు.

ఇదీ ఆదిత్య హృదయం. ఈ స్తోత్రం చదివేందుకు మూడు నాలుగు నిమిషాలకు పైన పట్టదు. సూర్యుడుదయించేందుకు ఎంతకాలం పడుతుందో, సరిగా అంతే సమయంలో ఈ స్తోత్రం చదవవచ్చు. అలా లెక్కప్రకారం వాల్మీకి ఈ స్తోత్రం వ్రాశాడా అనిపిస్తుంది. ఈ స్తోత్రం ఎప్పుడైనా చదవవచ్చు. కాని ఉదయం, సాయంత్రం, మధ్యాహ్నం, నిష్ఠగా నియమంతో చదవటం మిక్కిలి శ్రేయస్కరం. ఎక్కడ, ఎప్పుడు చదివినా సూర్యబింబాన్ని మనస్సులో ధ్యానించి చదవటం మంచిది. సూర్యబింబానికి ఎదురుగా నిలబడి ఉదయాస్తమయ సమయాల్లో చదవగలిగితే మరీ మంచిది. ఏ రూపంలో, ఏ కాలంలో, ఏ ఉద్దేశ్యంతో స్మరించినా ఆదిత్యనామ సంస్మరణ సకల పాపాలను పోగొట్టి త్రికరణ శుద్ధిని ప్రసాదిస్తుంది.

★ ★ ★

# శ్రీలలితామృతలహరి

శ్రీ విష్ణు సహస్రనామం ప్రణవం చూపిన పరమ పావన పుష్ప హాసమయితే, శ్రీ లలితా సహస్రనామం శ్రీమాత చేసిన చిన్మయ చారుహాస మవుతుంది. ఆదివిష్ణువు కృష్ణచైతన్య రూపంలో చూపిన విశ్వరూపం దివ్యనామ సహస్రంలో గేయమయితే, అదే దేవీనామ సహస్రంలో, ధ్యేయమయింది. రెండూ ఒక విధంగా విశ్వనామ సహస్రాలే. దివ్య సహస్రంలో...

"సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షః సహస్రపాత్" అని కొనియాడబడిన విశ్వరూపమే.

దేవీ సహస్రంలో "సహస్ర శీర్ష వదనా సహస్రాక్షీ సహస్రపాత్"గా సాక్షాత్కరిస్తుంది. నిజానికి శ్రీ మహావిష్ణువు లోని దివ్యతత్త్వం, శ్రీమాతలోని దేవీతత్త్వం,

ఒకే పరమ తత్త్వానికి రెండు రూపాలు. సాధకులకు సద్భావంలో సగుణంగా, రెండూ వేరు వేరుగా గోచరించినా, చిన్మయ దృష్టితో తన్మయభావంలో తరిచి చూస్తే, రెంటిలోను ఒకే ఆనందమయ బిందువు కనిపిస్తుంది. ఆ పరమానంద బిందువే, శ్రీలలితా పరమేశ్వరి.

ఈ బిందువులో జడచేతన భేదం లేదు. ప్రకృతి పురుష భేదం కూడా లేదు. పరమేశ్వరుడు పరమేశ్వరికి పరాధీనుడై పారవశ్యాన్ని పొందుతాడు. పరమేశ్వరి పరమశివుని ప్రాపకంలో ప్రపంచ సారాన్ని తన బిందు చైతన్యంలో ఇముడ్చుకొని తన యిష్టప్రకారం, తోచినప్పుడు తోచినట్టుగా తనలో చైతన్యాన్ని, వైభవాన్ని, లావణ్యాన్ని, ఆనందాన్ని, ప్రపంచానికి పంచి పెడుతుంది. ఈ పని పరమేశ్వరి స్వతంత్రంగా చేయుటలేదు. పరమశివుడు కూడా తనంతట తానుగా ఏ పని చేయలేడు. పరాప్రకృతి, పరమ పురుషుని సహకారంతో, తనకు ప్రకృతిని, ప్రతిరూపాన్ని, ప్రతిబింబాన్ని ప్రపంచంలో వెలయిస్తుంది.

శ్రీ శివాత్మకమైన శివశక్తి సమైక్యంలో శ్రీ లలితా పరమేశ్వరి చిన్మయ బిందువులా ఆవిర్భవిస్తుంది. తల్లి పుట్టుపూర్వోత్తరాలను బ్రహ్మాండ పురాణంలోని, లలితోపాఖ్యానం చిన్న చిన్న కథలలో లలిత లలిత పదబంధంలో వివరిస్తుంది. కాని కథల వెనుక దాగియున్న గంభీర భావాలను బోధపరచుకొంటేనే కాని, అసలురహస్యం బయటపడదు. శ్రీమాత ప్రాదుర్భవాన్ని, ప్రాభవాన్నీ చెప్పిన తర్వాత హయగ్రీవుడు అగస్త్యుని కోరికపై తల్లి నామాలను చెప్తాడు. ఇదే శ్రీ లలితా సహస్రం. దీనినే హయగ్రీవుడు "రహస్యనామ సహస్రం" అని అంటాడు. ఇవి మామూలు పేర్లుకావట! రహస్య నామాలట! ఒక్కొక్క నామాన్ని జాగ్రత్తగా

పరిశీలించి చూస్తే, తల్లిఉనికి, కలిమి, చెలిమి. వెలుగు తెలుస్తాయి. రహస్యం తెలుసుకొని, పరమేశ్వరిని ప్రతి వచనంలో భావిస్తూ, నామ సంకీర్తన చేస్తే తల్లి అనుగ్రహం లభిస్తుంది. పూర్తిగా రహస్యం తెలియకపోయినా, భక్తితాత్పర్యాలతో నామాలను స్మరిస్తే తల్లిప్రేమతో పలుకుతుంది. ఒక తల్లికి పుట్టిన పిల్లలందరూ తెలివిగలవాళ్ళే వుండరు. కాని తల్లికి అందరూ సమానులే. ఒకవిధంగా తెలిమి, కలిమి తక్కువగా ఉన్న పిల్లలమీద తల్లికి మక్కువ ఎక్కువగా ఉండవచ్చును. తక్కువ మాత్రం ఉండదు. 'అమ్మా' అని ఆప్యాయంగా, ఆర్తితో పిలిస్తే పలుకని తల్లి ఉండదు. అందువల్లనే యీ రహస్యనామ సహస్రంలోని మొట్టమొదటి నామం **"శ్రీ మాతా"**

ప్రపంచంలో, తల్లికి మించిన దైవంలేదు. ప్రత్యక్షదైవమయిన ప్రభాకరుడు కూడా తల్లికంటే దూరమే. ధర్మసాధనకు ఆధారభూతమైన శరీరాన్ని ప్రసాదించిన తల్లికి మించిన తత్త్వంలేదు. కాని తల్లిదండ్రులందరూ పార్వతీపరమేశ్వరులయితే ప్రపంచంలో దేవతా స్వరూపులు కానివారెవరు? అనే అనుమానం రావచ్చు. "మాతృదేవోభవ, పితృదేవోభవ" అన్న ఆదేశవాక్యాల్లోని ఆంతర్యం గమనిస్తే ఈ అనుమానంరాదు. తల్లిని, తండ్రిని, ఆచార్యుని దేవతాస్వరూపులుగా భావించటంవల్ల మనలోని దివ్యత్వమే వ్యక్తమవుతుంది. భావజీవుల భావనాశక్తిలోనే 'భవాని' నివసిస్తుంది. కన్నతల్లినే కాదు. ప్రతీ యువతినీ, ప్రతి స్త్రీని మాతృమూర్తిగా చూడగలిగితే మనలో మరుగుపడియున్న 'శ్రీమాత' వెలుగులోకి వస్తుంది. వెలుగు చూపిస్తుంది. నిజానికి శ్రీలలితాపరమేశ్వరి ప్రతివ్యక్తిలో ప్రచ్ఛన్నంగా దాగివున్నది. భావనాశక్తితో ఆమెను ప్రసన్నం చేసుకోవచ్చు. ప్రాణికోటికి ఆశ్రయమైన పాంచభౌతిక శరీరమే పరమేశ్వరికి ఆలయం. ఇందులో నశ్వరమైన అనాత్మతత్త్వాన్ని తొలగిస్తే మిగిలే ఆత్మతత్త్వమే దేవీ స్వరూపం.

'స్వాత్మైవ దేవతా ప్రోక్తా లలితా విశ్వవిగ్రహా' అన్న భావనోపనిషత్సూక్తి ననుసరించి తనలోని ఆత్మతత్త్వమే లలితా పరమేశ్వరి. విశ్వమంతా ఆమె విగ్రహమే. కదలే ప్రతికణంలో, సాగే ప్రతిక్షణంలో, ప్రసరించే ప్రతికిరణంలో, ప్రచరించే ప్రతిప్రాణంలో పరమేశ్వరి లాలిత్యం వ్యక్తమవుతూ ఉంటుంది. అసలు లాలిత్య మంటేనే చలనం, స్పందనం, నర్తనం, ఆవర్తనం, చైతన్యం, "లోకా నతీత్య లాలతే లలితా తేన సోచ్యతే"!

లోకాలనుమించి అతిలోక లావణ్యంతో లాస్యంచేసే లలనామణి లలితాంబిక. లోకోత్తర లావణ్య భావాలతో చిన్మయ చైతన్యంతో, ఆనందాతిరేకంతో, అణువణువులో ఆడి పాడి ఓలలాడే లీలావతి లలితా పరమేశ్వరి. ఈ లలితాంబిక వెలయించే లాస్య లీలలకు లాలనా స్థలి లలాటం.

లలితాంబిక లీలలోని లాలిత్యమంతా లలాటంలో కనిపిస్తుంది. వెయ్యిరేకులతో వేవెలుగులతో జగజ్జేగీయమానంగా శోభిల్లే సహస్రారంలో చోటు చేసికొని, ఆటలతో పాటలతో ఆయుస్సును తపస్సుగా మార్చే తరుణ తపస్విని లలితాంగన, ఒక విధంగా చూస్తే సహజమైన లాలిత్యాన్ని అణువణువులో, అంగాంగంలో అలరించుకున్న అంగన లందరూ లలితా స్వరూపులే. ఆడుది అంటేనే లలిత. కనక శాబ్దికంగా చూచినా, ఆడవాళ్ళంతా లలితా స్వరూపులు. ప్రతి పురుషుడు పరమేశ్వరుడు. ప్రతి స్త్రీ పరమేశ్వరి. కాని వ్యక్తిలో అలాంటి శివభావన ఉదయించనిదే, తనలో దాగియున్న యీ దివ్యశక్తి తనకు గోచరించదు. శివశక్తి సామరస్యం, ప్రతివ్యక్తి లలాటంలో తాండవిస్తూ ఉంటుంది. కాని యీ లాలిత్యాన్ని చైతన్యాన్ని మరగుపరచి, వ్యక్తిలోని శివత్వాన్ని, శక్తిని బయటకురాకుండా అతన్ని ఒకానొక జడత్వం, భండత్వం ఆవరించి ఉంటుంది. మానవుడు సహజంగా భోగలాలసుడు. దిగులులేకుండా తిండితిని, నిద్రపోయే వసతి ఉంటే అతనికి ప్రపంచంతో ప్రమేయముండదు.... లేదు. హాయిగా, యుగాలను నిముషాలుగా గడుపుకుంటాడు. ఇది భండాసుర లక్షణం. భండాసురుని సంహరిస్తేనేగాని లోపలి లాలిత్యం బయటకిరాదు. బ్రహ్మాండ పురాణంలోని భండాసుర వధలో ఉన్న పరమార్థమిదే. పురాణగాథల్లోని పరమార్థాన్ని అర్థంచేసుకోకుండా ఊరక వల్లెవేస్తే అవి పుక్కిటపురాణాలే అవుతాయి. డొక్కశుద్ధి కావాలంటే వాటి గూఢార్థం కనుక్కోవాలి. శ్రీమహాశంభువు శ్రీయాగం చేసి, చిదగ్నికుండంలో శ్రీమాతను ఆవిష్కరించుకున్నాడని పురాణ గాథ. ఈ శ్రీయాగం చేయగల ప్రతి వ్యక్తికీ, తన చిన్మయాకాశంలో శ్రీమాత సాక్షాత్కరిస్తుంది. ప్రపంచాన్ని పాలించి, ప్రాణికోటికి పరమానందం కలిగించే ప్రసాదించే పరమేశ్వరి, తనలోనే తన నేత్రోన్మీలనంకోసం ఎదురుచూస్తూ నుదుటి వెనుక దాగియున్నదనే పరమార్థం ఎంత త్వరగా తెలుసుకుంటే, జీవి అంత త్వరగా తరిస్తాడు. దీనికి బాహ్యనేత్రాలు చాలవు. అంతశ్చక్షువులు తెరుచుకోవాలి. బాహ్యప్రపంచాన్ని మించిన బ్రహ్మాండపురాణంలోని లలితోపాఖ్యానం వివరిస్తుంది. అందువల్లనే పరమేశ్వరి అంతర్యాన్ని వివరించే రహస్యనామ సాహస్రంలో ఆమెను అంతర్ముఖ సమారాధ్యా అనీ, బహిర్ముఖ సుదుర్లభా అనీ వర్ణించడం జరిగింది. సహజంగా బహిర్ముఖమైన ఇంద్రియ సంతతిని అంతర్ముఖం చేసుకొని, అతీంద్రియమైన ఆంతరిక జగద్విలాసాన్ని ఒక్కసారి చవిచూస్తే, బయట కనిపించే పటాటోపమంతా సారహీనం, క్షణ భంగురం, సాధన మాత్రం అనే విషయం గోచరిస్తుంది. ఈ విషయం కథగా చెప్పిన తర్వాత, ఓపికగా విన్న అగస్త్యుడు లోపలి లాలిత్యాన్ని స్మరించేందుకు 'నామ తారకం' అనుగ్రహించ వలసినదని హయగ్రీవుని కోరుతాడు. ఏ పేరిట పిలిస్తే ఆ తల్లి పలుకుతుందో ఆ పేర్లన్నీ హయగ్రీవుని అశ్వకంఠం నుండి ఆశువుగా వెలువడుతాయి. ఈ నామసంగ్రహమే లలితాసహస్రం. రామరావణ యుద్ధంలో రామచంద్రుని

విజయానికి సాధనంగా రామునికి ఆదిత్యహృదయం ఉపదేశించిన అగస్త్యుడు లలితా సహస్రంలో శ్రోత కావటం గమనించవలసిన విషయం. "అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాథ ప్రబోధినీం" అని శ్రీరహస్యాన్ని శ్రుతులు కీర్తిస్తాయి. అలాటి అశ్వగంభీర కంఠంతో హయగ్రీవుడు వివరించే ఈ నామసహస్రంలోని గాంభీర్యం వేరే చెప్పనక్కరలేదు. అసలీ నామాలను వశిన్యాది వాగ్దేవతలు మొట్టమొదట పరమేశ్వరి యెదుట గానం చేశారట. వాగ్దేవి నోట వెలువడిన ఈ స్తోత్రం, సమస్త వాఙ్మయానికీ అమూల్యమైన అలంకారం. అందువల్లనే, కేవలం సారస్వత దృష్టితో చూచినా శ్రీలలితా సహస్రంలోని లాలిత్యం మరోచోట కనిపించదు.

ఈ రహస్యనామ సహస్రం పేరుకు లలితా సహస్రమే. కాని ఇందులో కామాక్షి, పార్వతి, దుర్గ, మహాకాళి, సరస్వతి, భవాని, నారాయణి, కళ్యాణి, రాజరాజేశ్వరి, మహాత్రిపురసుందరి, వైష్ణవి, మహేశ్వరి, చండి, విశాలాక్షి లాంటి అనేక దేవీరూపాలు గోచరిస్తాయి. అసలు ప్రధానమయిన 'లలితాంబిక' నామం చిట్ట చివర వినిపిస్తుంది. దేవిని ఏ రూపంలో ఆరాధిస్తే ఆ రూపంలో సాక్షాత్కరిస్తుంది. అన్ని రూపాలకు, అన్ని నామాలకు సారం **'లలితాంబిక'**

సకలదేవీ దేవతల రహస్యాన్ని సంగ్రహంగా వివరించే శ్రీ లలితా సహస్రం కేవలం స్తోత్రంకాదు. గొప్పశాస్త్రం కూడాను. శ్రీ విష్ణు సహస్రనామం సామాన్యదృష్టికి నామకీర్తన లాగానే కనిపిస్తుంది. దానిలో ఒక శాస్త్రీయ సంబంధ సూత్రం ఉన్నదనే విషయం, నిశితంగా పరిశీలిస్తేనే కాని తెలియదు. కాని శ్రీ లలితా సహస్రం చదువుతూంటేనే అందులోని శాస్త్ర శైలి గోచరిస్తుంది. భక్తితో పఠించేందుకు అది దివ్యస్తోత్రంగాను, పరమార్థచింతనతో పరిశీలించేందుకు శాస్త్రంగాను ఉపకరిస్తుంది. శాస్త్ర వివేచనకు కావలసిన విషయ పరిచ్ఛేదం అందులో స్పష్టంగా కనిపిస్తుంది. మొట్టమొదట శ్రీమాత ఆవిర్భావం, తర్వాత ఆమె, లోకోత్తర లావణ్యం, ఆ తర్వాత ఆమె పరాక్రమం, దుష్టశిక్షణ, శిష్టరక్షణ, తర్వాత సూక్ష్మరూపంలో పరమేశ్వరీ స్వరూపం, భావనామయ స్వరూపం షట్చక్రదర్శనం. ఇలా శారీరక మీమాంసకు సంబంధించిన విషయాలు దేవీపరంగా చెప్పుకుంటూ చివరకు శివ, శక్తి, సామరస్యంతో, ఆత్మసాయుజ్యాన్ని ప్రతిపాదించే ఈ రహస్యనామ సాహస్రం, పూర్వాపర సంబంధంతో పూసగ్రుచ్చినట్లు ఆత్మతత్త్వాన్ని వివరించే శ్రీ రహస్య సర్వస్వం, బ్రహ్మజిజ్ఞాసను సూత్రీకరించిన బ్రహ్మసూత్రాలను శారీరక మీమాంస అన్నట్టుగా, ఆత్మతత్త్వాన్ని శాస్త్రీకరించిన ఈ రహస్యనామ సహస్రాన్ని "ఆత్మానందలహరి" అని అనవచ్చు. ఇందులో లావణ్యలహరి, వైభవలహరి, భావనాలహరి, ఆనందలహరి, చైతన్యలహరి, సాలోక్యలహరి, సామీప్యలహరి, సారూప్యలహరి, సాయుజ్యలహరి -- అనే తొమ్మిది తరంగాలు కూడా, ఒకదాని తరువాత మరియొకటి పొంగిపొరలి, శ్రీ మాతృస్వరూపాన్ని వెలయిస్తున్నట్టు తోస్తుంది. ఈ తరంగాలలో ఒక్కొక్కటి

దాదాపు 20 శ్లోకాల వరకు వ్యాపించినట్టు భావించవచ్చు. ఈ తొమ్మిది తరంగాలలో శ్రీ చక్రంలోని తొమ్మిది ఆవరణాలు కూడా తొంగి చూస్తూన్నట్టు తోస్తుంది. అన్నింటికి బాహ్యమైన తొలి ఆవరణం లావణ్యలహరిలో కనిపిస్తుంది. బ్రహ్మాది దేవతలచేత కొనియాడబడిన దేవి ఆత్మవైభవం, సర్వాశాపరిపూరక చక్రానికి ప్రతీకంగా కనిపిస్తుంది. ఇలా తొమ్మిది తరంగాలలో తొమ్మిది ఆవరణాలను పోల్చుకుంటూ పోతూ పోతే, అంతరాంతర కుహరంలో ఉండే సర్వానందమయ బిందువు సాయుజ్యలహరిలో ప్రతిబింబించి ఉంటుంది. శ్రీసహస్రాన్ని సరిగా అవగాహన చేసుకొనేందుకు, శ్రీ చక్రాన్ని గురించి కొద్దిగా తెలుసుకొని ఉండాలి. శ్రీచక్రానికి, శ్రీవిద్యకు కూడా సన్నిహితమైన సంబంధం ఉంది. శ్రీ విద్య మంత్రం. శ్రీ చక్రం యంత్రం.

శ్రీలలితా సహస్రం, ఈ మంత్రానికి, యంత్రానికి సంబంధించిన తంత్రం.

"తనోతి – ఇతి" (వ్యాపించేది) తంత్రం. శ్రీవిద్యలో అక్షర రూపంలో ఉన్న లలితా పరమేశ్వరి, శ్రీచక్రంలో రేఖాకారంలోనూ, శ్రీసహస్రంలో సూక్ష్మ రూపంలోను సాక్షాత్కరిస్తుంది. శ్రీ విద్యను, శ్రీచక్రాన్ని సేవించటం, అర్చించటం, అందరికి సాధ్యమైనది కాదు. కాని సహస్రనామాలను చదవటం, ఆ నామాలతో శ్రీలలితా పరమేశ్వరిని, అర్చించటం అందరికీ సాధ్యమైన పని. ఈ వేయినామాలలో ఏఒక్క నామమైనా, శ్రీపరమేశ్వరి అనుగ్రహాన్ని సాధించేటందుకు చాలునని హయగ్రీవుడంటాడు. అన్ని నామాలను చదివితే శ్రీ పరమేశ్వరి పరిపూర్ణ కటాక్షం లభిస్తుంది. అసలీ నామాలన్నీ ఆత్మనామాలు. శ్రీపరమేశ్వరి పేరిట, మనం మనలోని పరతత్త్వాన్ని భావించి సేవిస్తున్నాం. శ్రీచక్రం కూడా శరీరంలోని ఆరు చక్రాలకు పైన వెయ్యిరేకులతో వెలిగే సహస్రారకాంతినే ప్రతీకాత్మకంగా నిరూపిస్తుంది.

మానవ శరీరంలోని షట్చక్ర సందర్శనమే సకల దేవతా సందర్శనం. సహస్రారంలోని చిన్మయానంద బిందువే పరమేశ్వరి స్వరూపం. కాని, శరీరంలోని ఈ చక్రాలు చర్మ చక్షువులకు గోచరించేవి కావు. శల్యపరీక్షకు అందేవికావు. భావనాశక్తితో సాధించి, శోధించవలసిన చైతన్యసోపానాలు. ఈ చక్రకాంతులు, వీటికి మూలాధారంలో ఉన్న కుండలిని ఆధారం. మెలికలుతిరిగిన పాములా, ఆసనస్థానంలో నిద్రాణంగావున్న ఈ కుండలిని మేల్కొని, మేరువు చివరకు పయనించి, లలాటస్థలంపైన ఉన్న సహస్రారాన్ని చేరి, అందులోని అమృతాన్ని ఆప్యాయంగా ఆస్వాదించినపుడు, మర్త్యుడు మృత్యుంజయుడవుతాడు. మరణించే శరీరం మరణించి నశించినా, మరణించని అమరత్వాన్ని దర్శించడమే ఆత్మవిద్య. ఈ విద్య శ్రీలలితా సహస్ర నామంలో వివరంగా వెయ్యి మాటల్లో వివరించబడింది. ఈ రహస్య నామ సాహస్రాన్ని కూర్చిన మహర్షి, ప్రతినామంలోనూ ఆ నామం తెలిపే తత్త్వాన్నికూడా పొదిగిఉంచాడు. కాబట్టి నామోచ్చారణ మాత్రం చేత సర్వాంతరంగిణియైన పరమేశ్వరీ స్వరూపం గోచరిస్తుంది.

సాత్త్వికమైన సాధన, పరమపావనమైన భావన, నిర్మలమైన హృదయము, నిశ్చలమైన మనస్సు, వీటితో ఈ నామాలను పరిస్తే స్తోత్రానందంతో పాటు శాస్త్రజ్ఞానంకూడా లభిస్తుంది.

శ్రీలలితాసహస్రం శాస్త్రమనేందుకు ఒక ప్రబల నిదర్శనముంది. శ్రీవిష్ణు సహస్రనామంలో చాలానామాలు మాటిమాటికీ వినిపిస్తాయి. అందులో నామసంకీర్తన, స్తుతి ప్రభావం కాబట్టి, ముఖ్యమైన నామాలు వేరువేరు చోట్ల వేరువేరు అర్ధచ్ఛాయలతో వస్తాయి. అది పునరుక్తిఅయినా దోషంకాదు. కాని శాస్త్రవివేచనలో పునరుక్తికి తావులేదు. చెప్పినమాట మళ్లీచెప్పటం శాస్త్రవిరుద్ధం. అందువల్లనే రహస్యనామ సాహస్రంలో ఏ నామంకూడా రెండుసార్లు రాదు. దానికితోడు విష్ణుసహస్రనామాలలో లేని పూర్వాపర సంబంధం, లలితా సహస్రంలో గోచరిస్తుంది. ఈ పూర్వాపర సంబంధం విష్ణుసహస్ర నామంలో జాగ్రత్తగా పరిశీలిస్తేగాని గోచరించదు. లలితాసహస్రనామంలో అది సామాన్య దృష్టికి కనిపిస్తుంది.

ఈ నామ సహస్రాలకు రెండింటికి కొంత సామ్యంకూడా ఉంది. కొన్ని నామాలు స్త్రీ పురుష భేదంతో రెండింటిలో కనిపిస్తాయి. నారాయణి నారాయణులు, భవానీ భవులు ముకుందా ముకుందులు రెండింటిలోను సాక్షాత్కరిస్తారు. కొన్నికొన్ని పంక్తులు కూడా రెండింటిలో సమానంగా వినిపిస్తాయి. విష్ణుపరంగా చెప్పిన "స్తవ్యః స్తవప్రియః స్తోత్రం - స్తుతిః స్తోతారణ ప్రియః" అనే నామమాలిక దేవీపరంగా చెప్పిన "స్తోత్రప్రియా స్తుతిమతీ శ్రుతి సంస్తుత వైభవా" అన్న శ్రుతిహారానికి ఎంతో సమీపంగా ఉంటుంది. అలాగే "మహామాయా మహా సత్త్వామహాశక్తిర్మహారతిః" "చారురూపా చారుహాసా చారుచంద్ర కళాధరా" "రమా రాకేందు వదనా రతిరూపా రతిప్రియా" "కలావతీ కళాలాపా కాంతాకాదంబరీ ప్రియా"

ఇలాంటి నామమాలికలు రాగమాలికలుగా వినిపిస్తాయి. అసలు శ్రీలలితానామ సహస్రమంతా శ్రీరాగ రంజితమైన మహాగానం. ఈ గానంలోనే జ్ఞాన విజ్ఞానాలు మిళితమై ఉన్నాయి. ఇది గానానికి గానం. జ్ఞానానికి జ్ఞానం. స్తోత్రానికి స్తోత్రం. శాస్త్రానికి శాస్త్రం. అర్చనకూ, అధ్యయనానికీ, ప్రార్ధనకూ, పారాయణానికీ, మంత్రసారంగా యంత్రసారంగా, తంత్రసారంగా ఉపకరించే విజ్ఞానసర్వస్వం. రహస్యనామ సాహస్రం. ఇందులోని భావ సౌందర్యానికి ముగ్ధులై శ్రీ శంకర భగవత్పాదులు సౌందర్యలహరి వెలయించారు. తల్లి లావణ్యం కీర్తించే తొలి ఇరవై శ్లోకాలలోని సారాన్ని గ్రహించి, సౌందర్యలహరి శివశక్తి సామరస్యాన్ని శతథా భావించింది. సౌందర్యలహరి ప్రతిశ్లోకం రహస్యనామసహస్రంలోని అక్షర రమ్యతను, రుచిరార్ధనిధిని స్ఫురింపజేస్తుంది. జగదేకమాత ఎవరిని కటాక్షిస్తే అతడే

ఋషి అవుతాడు. ఆమె అవ్యాజ, అద్భుత, అపార కరుణ, అనుగ్రహం కావాలంటే ఆమె నామాలను స్మరించాలి. ఆమె దివ్య రూపాన్ని ధ్యానించాలి.

నిజానికి నామరూపాలు మనవి. ఆమెకు నామంలేదు. రూపంలేదు. ఆమె నామరూప వివర్జిత. కాని నాదంలో ఆమె (శ్రీమాత వినిపిస్తుంది.) "నారాయణ" నాదంలో నామ పారాయణ ప్రీతితో ఆమె సాక్షాత్కరిస్తుంది. ప్రణవనాదమే పరమేశ్వరికి నిలయం. కనిపించే రూపం, వినిపించే నామం జీవలక్షణాలు. ఈ నామరూపాలకు ఆధారభూతమైన అస్తిత్వం (ఉనికి), కాంతి (వెలుగు), ప్రేమ (చెలిమి) పరమాత్మ స్వభావాలు. కనిపించేది జీవాత్మ. కనిపించే జీవాత్మకు ఆధారమైన ఉనికి పరమాత్మ. కనిపించే అవయవాలు పరమాత్మతో కూడి ఉన్నంతవరకే కనిపిస్తాయి, వెలుగుతాయి, వెలుగునిస్తాయి. పరమాత్మతో సంబంధం విడిపోగానే జీవాత్మకు దేహంమీద మమకారం పోతుంది. రక్తమాంసాలు, అస్థిచర్మాలు, కరచరణాలు, క్రమంగా చైతన్యరహితమై పంచభూతాల్లో లీనమైపోతాయి. కాని పోయిందేదో కనిపించదు. కళ్ళు సూర్యునిలో, మనస్సు చంద్రునిలో, వాక్కు అగ్నిలో, శ్వాస వాయువులో, చెవులు దిక్కుల్లో, శరీరం మట్టిలో, వెంట్రుకలు చెట్లు చేమల్లో, రక్తవీర్యాలు నీళ్లల్లో, ఆత్మ అంతరిక్షంలో కలిసిపోయిన తర్వాత మిగిలేది ఏమిటి? అదే చిరంతనచైతన్యం. దానికి ఎదుగుబొదుగులు లేవు. ఎప్పుడూ అది సంపూర్ణమే. అదే పరమేశ్వరి, లలిత, గాయత్రి, దుర్గ, పార్వతి, కల్యాణి, కామాక్షి. ఏ పేరుతో పిలిచినా పరాశక్తి, ఆదిశక్తి, మూలశక్తి. ఒకే చిచ్ఛక్తి. ఈ ప్రపంచమంతా ఆ చిచ్ఛక్తి విలాసం.

ఈ చిచ్ఛక్తిని వేదాలు గాయత్రిగా గుర్తించాయి. ఉపనిషత్తులు ఉమాదేవిగా భావించాయి. పురాణాలు లలిత, కాళి అని పేరుపెట్టాయి. ఆగమాలు మహాత్రిపురసుందరి, రాజరాజేశ్వరి, మహాకాళి, మహాసరస్వతి, మహాలక్ష్మి అని ఆరాధించాయి. ఏమీతెలియని పామరజనులు అంకాళమ్మ, పోలేరమ్మ, నాంచారమ్మ, అని ఏవేవో పేర్లతో జగజ్జననిని తమకుతోచినట్లు భావించి సేవించారు. అన్నింటిలో శక్తి ప్రధానం. ప్రతిపదార్థంలో శక్తిఉంది. పదానికి అర్థం శక్తి. సూర్యునికి వెలుతురు శక్తి. చంద్రునకు వెన్నెల శక్తి. అగ్నికి వేడి శక్తి. ఇలా శక్తిలేని పదార్థం లేనేలేదు.

యస్యయస్య పదార్థస్య<br>
యాయా శక్తి రుదాహృతా;<br>
సాసా సర్వేశ్వరీదేవీ<br>
శక్తిమంతో మహేశ్వరః.

ప్రతి పదార్థంలో ప్రచ్ఛన్నంగా ఉన్న శక్తి పరమేశ్వరి. సర్వేశ్వరి. శక్తి గలవాడే సర్వేశ్వరుడు.

పరమేశ్వరికీ, పరమేశ్వరునికీ భేదం లేనట్లే, శక్తికి-శక్తి మత్పదార్ధానికి భేదం లేదు. పదార్థం స్థూలం. శక్తి సూక్ష్మం.

అందువల్లనే పదార్థవిజ్ఞానశాస్త్రం పరిసమాప్తి చె ందిన బిందువునుంచే, పరమార్థ విజ్ఞానశాస్త్రం ఆరంభిస్తుంది. ఈ పరమార్థాన్ని గ్రహించేందుకు అనేక మంత్రాలు, తంత్రాలు, యజ్ఞాలు, యాగాలు, జపాలు, తపాలు సాగాయి. కాని తల్లి.. అనుగ్రహం లేనిదే ఏ సాధన లభించదు, ఫలించదు.

ఆత్మ తత్త్వం ఎవరిని వరించి తరింపజేస్తుందో, వాడికే ఆత్మ సాక్షాత్కారం లభిస్తుంది. అతనికి ఆత్మ తనంతట తాను-తన తనువును విప్పి చెపుతుందట.

అందువల్ల

"శ్రీమాత్రే నమః" అని శ్రీ పరమేశ్వరిని ఆరాధించటమే ఆత్మ సాక్షాత్కారానికి ఏకైక మార్గం.

బుద్ధిబలంతో, మేథాశక్తితో, తర్కాలతో, తార్కాణాలతో, సామాన్యమైన జ్ఞానాన్ని సంపాదించవచ్చునేమోకాని, ఆత్మజ్ఞానాన్ని సాధించడం తర్కబుద్ధికి సాధ్యంకాదు. ఆత్మ విద్యకూ, మిగిలినవిద్యలకు ముఖ్యమైన తాత్త్వికభేదంవుంది. లౌకికములైన విద్యలలో తెలిసికొనవలసిన విషయం, తెలిసికొనేందుకు ప్రయత్నించే వ్యక్తి వేరువేరుగా కనిపిస్తారు. కాని ఆత్మవిద్య విషయంలో తెలిసికొనవలసినది ఆత్మతత్త్వం. తెలిసికొనేవాడు కూడా ఆత్మవంతుడే. ఆత్మ తనను గురించి తానే తెలిసికొంటున్నది. ఇది చాలా చిక్కుప్రశ్న.

జ్ఞానం, జ్ఞేయం, జ్ఞాత... ఈ మూడున్నూ ఒకటే అవటంతో జ్ఞాన విధానం జటిలం కాక మానదు.

అలాగే-

ధ్యానం, ధ్యేయం, ధ్యాత.. ఈ మూడున్నూ ఒకటే.

మానం (కొలత), మేయం (కొలవ వలసినది), మాత (కొలిచే వాడు).. ఈ మూడూ ఒకేస్థితిలో ఉన్నప్పుడు కొలతకే కొలత కావలసి వస్తుంది.

ఆ తొలి కొలత

శ్రీమాతా.. లలితా పరమేశ్వరి.

ఈ త్రిపుటిని మేళవించేందుకే శ్రీలలితా సహస్రనామం. మాతృమూర్తిని స్మరిస్తూ శ్రీ మాతృనామంతో అరంభిస్తుంది.

మాతృభావంతో దేవిని ధ్యానించడంవల్ల సామాన్యంగా ఇలాంటి ఉపాసనలో సంభవించే ప్రమాదాలు, పొరబాట్లు, తప్పటడుగులు, ఇక్కట్లు రాకుండా "శ్రీరామరక్ష" లభిస్తుంది. త్రికరణశుద్ధిగా శ్రీమాతను నమ్మి, ఆరాధించేవారికి ఆమె కారుణ్యం, వాత్సల్యం, అనుగ్రహం తప్పక లభిస్తాయి.

శ్రీచక్రం, శ్రీవిద్య, శ్రీమాత ఈ మాటలను చూచి దిగ్భ్రమ చెందవలసిన పనిలేదు. ఇదేదో పరమ రహస్యమైన విషయం, ఇది మనకు బోధపడేది కాదని తొలగిపోవలసిన పనిలేదు.

శ్రీమాత మనలనంటిపెట్టే, అనుక్షణం మనకు దారిచూపిస్తూ, కన్నతల్లిలా కాపాడుతూ ఉన్నది.

శ్రీవిద్యలో ఆమె అక్షరరూపాన్ని ధరిస్తుంది. నిజానికి మననోట వెలువడే ప్రతి అక్షరం మంత్రమే. కాని పరమేశ్వరీభావంతో పలికినప్పుడే అది మంత్రమవుతుంది.

అక్షర ప్రపంచమంతా ఒక్క చిన్మయానంద బిందువునుండి ఉదయించింది. చివరకు బిందువులోనే లయిస్తుంది. ప్రణవ రూపంలో పరమాత్మను దర్శించినపుడు "ఓం" కారమే అన్నింటికి బీజమని బోధ పడుతుంది.

"ఓం" కారానికి కూడా తొలి అక్షరమైన "అ" కారం నుంచి వాఙ్మయ ప్రపంచమంతా ఉదయించి, తుదకు "అ" కారంలో లయమయినట్టు తోస్తుంది. అలాగే "శ్రీ" రూపంలో చిన్మయిని సాక్షాత్కరించుకొన్నప్పుడు ఈ సర్వవర్ణ స్వరూపిణి, బిందువులో ఉదయించి సుధాసింధువులో లయించినట్టు గోచరిస్తుంది. శ్రీ చక్రంలో రహస్యం ఇదే.

శ్రీచక్ర నిర్మాణక్రమాన్ని పరిశీలించి చూస్తే ఈ విషయం పూర్తిగా బోధపడుతుంది. కొన్ని రేఖలు, కొన్నిరేకులు, కొన్నికోణాలు, కొన్ని త్రికోణాలు, ఏదో ఒక పద్ధతిననుసరించి ఒకదానిలో ఒకటి మిళితమై దేనినీ దేనినుంచీ వేరుచేసేందుకు వీలులేకుండా ఉన్నట్లు కనిపిస్తాయి. వీటన్నిటికీ మధ్య, దేనికీ అంటకుండా అన్నింటికి కేంద్రంగా ఒక బిందువు కనిపిస్తుంది. ఆ బిందువే సర్వానందమయ బిందువు. ఆ బిందువు చింది రెండు బిందువులయితే మూడుబిందువులతో ముక్కోణం ఏర్పడుతుంది. అలాంటి త్రికోణాలు తొమ్మిది ఏర్పడుతాయి. వాటిలో నాల్గుత్రికోణాలు ఊర్ధ్వముఖంగా ఉంటాయి. అయిదు త్రికోణాలు అధోముఖంగా ఉంటాయి. పైకి వెళ్లే నాలుగు త్రికోణాలు పరమేశ్వర స్వరూపాన్ని నిరూపిస్తాయి.

క్రిందికి వెళ్లే అయిదు త్రికోణాలు పరమేశ్వరి నివాసాన్ని సూచిస్తాయి.

ఈ తొమ్మిది త్రికోణాల ఒకదానిలో ఒకటి చొచ్చుకొనిపోయి, మధ్య ఒక బిందువును ఏర్పరిచినట్టు కనిపిస్తుంది.

అదే శివ, శక్తి, సమైక్యం.

ఇలా తొమ్మిది త్రికోణాలు ఏర్పడ్డంవల్ల బిందువు చుట్టూ ఎనిమిది మూలలు ఏర్పడుతాయి. ఈ మూలలను కలిపితే చక్రంలో మూడో ఆవరణం ఏర్పడుతుంది. బిందువు మొదటిది. త్రికోణం రెండవది. ఎనిమిదికోణాలు మూడో ఆవరణాన్ని నిర్మిస్తాయి. దీని వెలుపలి నాల్గవఆవరణంలో పదికోణాలు. పిదప ఆవరణంలో మరి పదికోణాలు కనిపిస్తాయి. ఆ తర్వాత 14 (పదునాలుగు) మూలలతో మరోఆవరణ కనిపిస్తుంది. ఆ అయిదు ఆవరణాలు తొమ్మిది త్రికోణాలవల్ల ఏర్పడుతాయి. వీటిని చుట్టి మరి రెండువలయాలు ఉంటాయి. వాటిలో మొదటిదానిలో ఎనిమిది, రెండవదానిలో పదహారుదళాలు కనిపిస్తాయి. ఇంత వరకు ఏడుఆవరణాలు ఏర్పడుతాయి. వీటి తర్వాత మూడువృత్తాలతో ఎనిమిదవ ఆవరణం ఏర్పడుతుంది. అన్నిటికి చివర మూడు చతురస్ర రేఖలు, ఇంటికి ప్రాకారంలో, శ్రీ చక్రానికి తొమ్మిదవ ఆవరణం నిర్మిస్తాయి. లోపలి బిందువు ఇలా తొమ్మిది ఆవరణాల్లో సమస్త చక్రాన్ని సృష్టిస్తుంది. ఈ దివ్య నిర్మాణాన్ని వివరించే చిన్న శ్లోకం స్మరించదగింది యున్నది.

బిందు త్రికోణ - వసుకోణ - దశారయుగ్మ మన్వశ్ర - నాగదళ సంయుత - షోడశారం వృత్తత్రయంచ ధరణీ సదనత్రయంచ శ్రీచక్రమేతదుదితం పరదేవతాయా.

ఇది శ్రీచక్రం. ఇందులోని తొమ్మిది ఆవరణాలు శరీరంలోని తొమ్మిది ద్వారాలకు చిహ్నాలు. పరమేశ్వరి సృష్టించిన ప్రాణికోటికి ప్రాణంతో పాటు ఈ దివ్య చక్రం కూడా సహజంగా లభించింది. ఒట్టి చక్రమే కాదు. అందులో తనను ప్రతిష్ఠించుకొని ఒక్కొక్కరికి ఒక్కొక్క చక్రం ప్రసాదించింది అమ్మ. లోపలి చక్ర సౌష్ఠవాన్నే బయట నిరూపిస్తున్నాము. అర్థం చేసుకొనేందుకు ప్రయత్నిస్తున్నాం. అంతరాంతరాలలోని ఆనందబిందువును చూచి ఆనందించడమే జీవిత పరమావధి. బయట త్రైలోక్య మోహన చక్రంలోని లావణ్య శేవధి నుంచి, లోపలి సర్వానంద మయ బిందువులోని శివ - శక్తి సమైక్యం వరకు, శ్రీ లలితా సహస్ర నామం మనల్ని చెయ్యి పట్టుకొని తీసికొని పోతుంది. శ్రీ పరమేశ్వరి మనవైపు పయనించేటప్పుడు, ఆనంద బిందువు నుంచి త్రైలోక్య మోహన చక్రం వైపు బయటకు ఆవిర్భవిస్తుంది. మనం పరమేశ్వరిని సమీపించేటప్పుడు, బాహ్య చతురస్రమయిన త్రైలోక్య. మోహనచక్రం నుండి సర్వాశాపరిపూరక, సర్వ సంక్షోభణ, సర్వరక్షాకర, సర్వసౌభాగ్య దాయక, సర్వార్థదాయక, సర్వరోగహర, సర్వసిద్ధిప్రద చక్రాలను దాటి, లోపల కేంద్రస్థానంలో ఉన్న సర్వానందమయ బిందువును చేరుకోవాలి. ఈ దివ్య పద్ధతినే శ్రీలలితా సహస్రనామం అవలంబించింది.

అయితే నామోచ్చారణ మాత్రం చేత ఈ ఆనంద బిందువు ఎలా లభిస్తుంది? అనేది అర్థం చేసుకోవాలి.

అందుకే శ్రీచక్రం.

ఇందులోని బిందువే సకల వాఙ్మయానికీ కేంద్రం. బిందువు నుండి విసర్గ ఏర్పడుతుంది. విసర్గ నుండి స,శ,ష లు "ర" కారం వెలువడుతాయి. బిందువు నుంచి అను నాసికాలు "ఙ,ఞ,ణ,న,మ," ఏర్పడుతాయి. ఈ అనునాసికాలే వర్గాక్షరాలకు "క,చ,ట,త,ప" లకు మూలం. అయిదు వర్గాక్షరాలకు ప్రాణం పోసే అచ్చులు తరువాత ఏర్పడుతాయి.

ఇవన్నీ బీజాక్షరాలే.

కాని వీటి కూర్పును బట్టి మన శరీరంలో, మనస్సులో మార్పు వస్తుంది. మంచి మాటలను, మంచి వరుసలో చెప్పటమే మంచి కవిత్వమని కొందరు భావించారు.. అలాగే ముఖ్యమైన అక్షరాలను ముచ్చటగా కూర్చినదే మంత్రం. ఈ మంత్రాలకు కేవలం సృష్టిచాలదు. దృష్టి కూడా కావాలి. కాబట్టి మహర్షులే మంత్ర ద్రష్టలు కాగలరు. అలాంటి మహర్షులు మానవ కల్యాణం కోసం కూర్చిన మంత్ర రాజాలు.. గాయత్రి, శ్రీవిద్య, షోడశాక్షరీ, పంచ దశాక్షరీ, పంచాక్షరీ, త్ర్యక్షరి.

"గాయత్రి" ని మించిన మంత్రం లేదని వేదాలు ఘోషించాయి. కాని అందరికీ ఆ కేక వినిపించలేదు. తర్వాత స్మృతులు, పురాణాలు అనేక విధాలుగా ఈ అక్షర భారతినే మనకు అందించాయి. శ్రీలలితా సహస్ర నామం కూడా ఈ ప్రాగ్భారతికి చెందిన ప్రశస్త స్తోత్రం.

శ్రీ చక్రంతో ప్రమేయం లేకుండానే ఈ స్తోత్రాన్ని చదువవచ్చు.

శరీరమే శ్రీచక్రమని భావిస్తే చాలు.

శ్రీమాతను ఎక్కడ ఏరూపంలో భావిస్తే అక్కడ సాక్షాత్కరిస్తుంది.

పంచ భూతాలలో, పంచ తన్మాత్రలలో, పగటిలో, రాత్రిలో, సంధ్యలో, తిథులలో, నక్షత్రాలలో.. అంతటా అమ్మ చిద్విలాసమే. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలలో అమ్మ ఐశ్వర్యాన్ని భావిస్తే మననోట పరుషమైన వాక్కు రాదు.

శబ్దమంతా అమ్మదే. అలాగే మనం అనుభవించే స్పర్శలో పరమేశ్వర భావం ఉంటే మనస్సు నిర్మలమయి పోతుంది. కనిపించే రూపమంతా అమ్మదే.. తల్లిదే.. ఆస్వాదించే రసమంతా అమ్మ ప్రసాదమే. కమ్మని వాసనలో చల్లని అమ్మ నివసిస్తుంది. ఇలాంటి పవిత్రమైన భావనతో మనం చేసే ప్రతికార్యం అమ్మ ఆరాధనే అవుతుంది. ఏ పని చేస్తున్నా-

"ఇది నేను చేయుట లేదు..

నాలోని అమ్మ చేయిస్తున్నది..."

అనే నిర్లిప్త నైవేద్య భావంతో చేస్తే అది ఈశ్వరారాధన అవుతుంది. అది మాత–అమ్మ ఆరాధన అవుతుంది. జీవితమంతా ఒక మహా సాధన.

ఇందులో ఏ ఒక్క క్షణం మనది కాదు. దానిని వ్యర్థం చేసేందుకు మనకు అధికారం లేదు.

శ్రీ మాత ప్రసాదించిన అమృత సారం.

అమోఘమైన శరీర యంత్రం మనకు ప్రసాదించిన అమ్మను స్మరిస్తూ, ఈ శరీరము మన కూడా ఉండగనే, ఇందులో దాగియున్న ఆనంద బిందువును అప్రమత్తంగా, ఆప్యాయంగా, అనాయాసంగా అందుకోవాలి.

అందుకు మూలాధారం శ్రీలలితా సహస్రనామ, స్మరణ, ధ్యాన, అర్చన, కీర్తన. ఈ దివ్య రహస్య సహస్రనామం చదివితే, జీవితం తరిస్తుందని పరిపరి విధాల హయగ్రీవుడు చెప్పాడు. అపమృత్యువు పోతుందట. ఆయుస్సు పెరుగుతుందట. ఆరోగ్యం చేకూరుతుందట.

ఒక్క నామం జపించినా పాపాలు తొలిగి పోతాయట. నామ కీర్తన చేసేవాళ్ల ముఖం చూస్తేనే పాపాలు పోతాయట. శ్రీ పరమేశ్వరి... దివ్య నామాలు జపించగా జపించగా, సాధకుడే అమ్మ స్వరూపము పొందుతాడు. తనకు, అమ్మకు భేదం లేదని గమనించిన తనయుడు, అమ్మ అనుగ్రహాన్ని తప్పక పొందుతాడు, జీవితంలో అంతకు మించినటువంటి ఆనందం లేదు.

★ ★ ★

# సత్యం పరం ధీమహి

సంవత్సరానికి ఒకసారయినా శ్రీ సత్యనారాయణస్వామిని పూజించి వ్రతం చేసుకోవటం తెలుగు వాళ్ళకే కాక మనదేశంలో చాలమంది ఆస్తికులకు అలవాటు. ముఖ్యంగా వివాహం, గృహ ప్రవేశంలాంటి శుభకార్యాలు జరుపుకొనే సందర్భములో చాలమంది వ్రతం చేసుకుంటారు. 'తెలుగుభాషలో వ్రతమనే మాట సత్యనారాయణ వ్రతమనే అర్థంలోనే రూఢి అయిపోయింది. మా ఇంట్లో ఈరోజు వ్రతం జరుగుతుంది' అంటే సత్యనారాయణ వ్రతమనే అర్థం. ఆ విషయం వేరే చెప్పనవసరం లేదు. ఉత్తరదేశంలో సత్యనారాయణ కథ చాలా ముఖ్యమయినది. నరజీవిత పరమార్థంగా భావించి సేవించడమే సత్యనారాయణ వ్రతం. శ్రీమన్నారాయణుడు సత్యస్వరూపుడు. సత్యమే శ్రీమన్నారాయణ గుణగణాలలో అగ్రగణ్యమైన గుణరాజం. సత్యాన్ని సేవిస్తే నారాయణ సేవ చేసినట్టే. సత్యం ద్వారా నారాయణ తత్వాన్ని అవగాహన చేసుకోవడమే వ్రతం. ఇదే అందరికీ అందుబాటులో నున్న ఆధ్యాత్మిక సాధన. బాహ్యప్రపంచంలో ప్రత్యక్ష దైవంగా భాసించే సూర్యనారాయణస్వామి వలె అంతరంగంలో నిత్యసత్య సందీప్తితో సత్యమైన వాక్కులో నివసించే సత్యనారాయణస్వామి వాక్కుగల ప్రతి వ్యక్తికి ఆరాధ్యుడే. ఇందులో ఇహం పరం కూడా ఇమిడి ఉండేవిధంగా మనవాళ్ళు వ్రత విధానం ఏర్పాటు చేసారు. ముఖ్యంగా ఆధ్యాత్మిక తత్వ చింతనతో కూడిన ఈ వ్రతాన్ని శుభకార్యాలతో జోడించి దీనికి సాంఘికమైన రూపకల్పన చేసి భక్తితోపాటు రక్తిని మేళవించడం జరిగింది. సత్యనారాయణస్వామి వ్రతమనగానే పీటలమీద కూర్చోటం, నూతన వస్త్రాలు, చదివింపులు, ప్రసాదం, ఆ తర్వాత సాదం – అన్నీ గుర్తుకు వస్తాయి. వ్రతానికి రమ్మని పిలిస్తే వెళ్ళకపోవటం తప్పు, వెళ్ళిన తర్వాత వ్రతం మధ్యలో లేచి రావటం తప్పు, ప్రసాదం తీసుకోకుండా వెళ్ళటం మరీ తప్పు, కథ సాంతం వినకపోవటం అన్నింటికీ మించిన తప్పు. ఇలా వ్రతకల్పంలో ఏర్పాటు చేసుకున్న కొన్ని కట్టుబాట్లతో దీనికి ఆస్తిక సమాజంలో మంచి ఆదరణ పలుకుబడి ఏర్పడ్డాయి. కాని కాలక్రమంలో ఈ వ్రతం వెనుక ఉన్న పరమార్థం వెనుకబడి సాంఘికమైన ఆచారాలు, ఆడంబరాలు ఎక్కువ అయ్యాయి. అయినప్పటికీ ఏదో ఒక రూపంలో ఈ వ్రతం కొనసాగుతుండటం ఆనందించవలసిన విషయం. అసలు వస్తువంటూ ఉంటో అందులోని వాస్తవత్వం కొద్ది రోజులకయినా బోధ పడుతుంది.

శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతానికి మూలాధారమయిన కథావస్తువు స్కంధ పురాణంలో ఉంది. ఈ పురాణంలో రేవాఖండంలో దీనికి సంబంధించిన ఐదు అధ్యాయాల్లో

సౌఖ్యాన్ని అవలీలగా అందుకోవచ్చు. కాని బ్రహ్మభావంతో శ్రవణ సంకీర్తనలు జరగాలి. అప్పుడే పుణ్యశ్రవణ కీర్తనుడు ప్రతిపదంలో పదార్థంలో ప్రసారంలో ప్రత్యక్షమవుతాడు.

ఏ నామం చూసినా దానిలో ఎన్నో వేదమంత్రాలు, ఉపనిషత్సూక్తులు, గీతార్థాలు ఇమిడి వున్నట్లుతోస్తుంది. గానం చేసే వ్యక్తి సంస్కారాన్ని బట్టి అందులో ఒదిగి వున్న ఓంకారం సహస్రనామాల్లో, సహస్రరూపాల్లో, సహస్రధారగా వెలువడుతుంది. ఎంత మెలకువతో ఎంత నిలకడగా దీన్ని మననం చేస్తే అంతగా అంతరాత్మ వికసిస్తుంది. ఆయురారోగ్యాలకు అష్టైశ్వర్యాలకు ఆధ్యాత్మిక సంపత్తికి, ఆత్మ సాక్షాత్కారానికి అన్నింటికి పరమావధియైన అద్వైత సిద్ధికి పెన్నిధి ఓంకారం. ఈ ఓంకారంతోనే చిట్టచివరినామం సహస్రనామం ఆరంభమవుతుంది. ఆ ఓంకారంలోనే అదిలయమవుతుంది. మొట్టమొదటి నామం విశ్వం; సర్వప్రహరణాయుధః – ఈ ఓంకార వైభవాన్నే సమీకరణశైలితో వివరిస్తాయి. ఓంకారమే విశ్వం అదే ఆయుధం అందులోనూ సామాన్యమైన ఆయుధంకాదు, సర్వప్రహరణాయుధం నశ్వర తత్వాలను నశింపచేసి, అవినశ్వరమైన ఆత్మతత్వాన్ని వెలయింపచేసే అఖండమైన జ్యోతి ఈ ఓంకారంలోనే ఉంది. నిజానికి సహస్రనామమంతా ఓంకారం చేసిన సమాహాసం, సమాసహాసం, మాటల్లో ఇమిడిన మందహాసం వేదాలు కొనియాడిన ఓంకారం, వేదవిదులు జపతపాల ద్వారా శోధించి సాధించుకున్న ఓంకారం మృత్యుదేవత బ్రహ్మ జిజ్ఞాసువైన నచికేతుడికి సకల విజ్ఞానసారంగా ఉపదేశించిన ఏ కాక్షరం, ఈ నామసహస్రంలోని ప్రతినామంలో దృశ్యాదృశ్యంగా స్పృశ్యాస్పృశ్యంగా, స్పష్టాస్పష్టంగా – సంసారులకు అస్పష్టంగా సంస్కారులకు స్పష్టంగా ద్రష్టలకు స్పష్టాక్షరంగా – గోచరిస్తుంది. ఈ రహస్యం తెలుసుకొన్నవాడికి 'అతడు కోరినదెల్ల ప్రత్యక్షమవుతుంది.' (యోయదిచ్ఛతి తస్యతత్) అన్న కఠోక్తి సార్థకమవుతుంది కనుకనే ఈ దివ్యనామాలను నరజాతి భూతికోసం, లోకకల్యాణం కోసం, విశ్వశాంతి కోసం చెపుతున్నానని సహస్రనామం ఆరంభించేముందు భీష్ముడు అంటాడు.

**"యాని దివ్యాని నామాని**
**విఖ్యాతాని మహాత్మనః**
**ఋషిభిః పరిగీతాని**
**తాని వక్ష్యామి భూతమే"**

ఈ నామాలను ఋషులు పరిపరివిధాల గానం చేశారట. ఇవి అందరికి తెలిసినవేనట, వీటిని కొత్తగా సృష్టించలేదట. అవి దివ్యనామాలట, భవ్యజగత్తుకు అతీతమైనవట, అవి మనమేలు కోసం ఒకచోట కూర్చి పెట్టాడట తాతముత్తాతలకు తాత భీష్మాచార్యుడు.

ఈ మాటలకు మనం మామూలుగా చెప్పుకొనే అర్థం కుదరదు. అవి దివ్యనామాలు. భవ్యమైన భావాలతో పాటు దివ్యమైన తేజస్సు కూడా వాటిలో ద్యుతియుతంగా విద్యుదుద్దీప్తంగా నిండి నిబిడీకృతమై వుంటుంది, దాన్ని అవగాహనం చేసుకునేందుకు సర్వవాగేశ్వరుని అనుగ్రహం కావాలి. నిర్మలమైన మనస్సు కావాలి. ఆర్ద్రమైన హృదయం కావాలి. అనన్యమైన భక్తిప్రపత్తులు కావాలి. అమోఘమైన మేధాశక్తికి, అనంతమైన శ్రుతివిభూతికి కూడా అందని అందాల రాశి అందచందాలలో ఈ దివ్యనామ సహస్రంలో, ప్రత్యక్షరంలో, ప్రతిస్వరంలో ప్రతి అచ్చులో, ప్రతి హల్లులో, ప్రతి పొల్లులో వెల్లివిరిసి ఉంది.

ఇందులోని కొన్ని నామాలు మాటిమాటికి వస్తాయి. అది పునరుక్తి అని భావించకూడదు. ఒకేనామం వేరు వేరు సందర్భాల్లో వేరు వేరు అర్థాలను స్ఫురింపచేస్తుంది. ఉదాహరణకు శ్రీమాన్ అనే నామం నాలుగు సార్లు వస్తుంది. కేశవ నామం మూడుసార్లు వస్తుంది. ఈశ్వరనామం ఒకచోట ఈశగా, మరోచోట ఈశానగా కనిపిస్తుంది. ఆయా సందర్భాలనుబట్టి ఆయా నామాలకున్న ప్రాశస్త్యం వుంటుంది. వసు శబ్దం ఎన్నిసార్లో పలురూపాల్లో కనిపిస్తుంది. భీష్ముడు వసూత్తముడు, శ్రీకృష్ణుని అనుమతితో ఆయన తుదకు వసువుల్లో లీనమైపోతాడు. అదే భీష్మ నిర్యాణం, వనమతిలోని సారమంతా సహస్రనామాల్లో వుంది.

అయితే ఈ సారాన్ని సమగ్రంగా పరిశీలించి భావించి సేవిస్తేనే సహస్రనామ ఫలితం మనకు లభిస్తుందని భావించటం భావ్యం కాదు. కేవలం నామ సంస్మరణమే చాలు, ఎక్కడికక్కడికే తృప్తి. స్మరణ వల్ల స్మరణ సౌఖ్యం లభిస్తుంది. మననవల్ల మనస్సు నిర్మలమవుతుంది. అవగాహన వల్ల ఆత్మ వికసిస్తుంది. ఎంత నిశితంగా నామసహస్రాన్ని సేవిస్తే అంతటి ఆత్మానుభూతి లభిస్తుంది. భగవంతుని అంశ భక్తుని అంగాంగంలో ప్రవేశిస్తుంది. క్రమంగా భక్తుడే భగవంతుడవుతాడు. భగవంతునివలె భక్తుడు కూడా పరాంగుడవుతాడు, స్వంగుడవుతాడు, మంచి అవయవాలు కలవాడవుతాడు. కొన్నాళ్ళకు స్వాంగత్యం లభిస్తుంది. తన స్వంత అవయవాలను పొందుతాడు. తుదకు అయోనిజమైన వాక్కును పొంది ఉదారధీశాలియై స్వాస్యత్వాన్ని (అస్యలపై అంటే నాలుకపై స్వాధీనతను) పొందుతాడు. "జితం సర్వం జితేరసే" అన్నట్టు రసనను జయిస్తే ప్రపంచాన్ని జయించినట్టే.

జయకావ్యమైన భారత సంహితకు మకుటాయమానమైన ఈ నామసహస్రం ఆత్మ విజయాన్ని సాధించే వాగ్విభూతిని ప్రసాదిస్తుంది. ఆ విభూతి అలవడిననాడు ప్రపంచంలోని ప్రతి అణువులో పరమాత్మ స్వరూపము గోచరిస్తుంది. ఓంకారం నుంచి వాక్ప్రపంచమంతా వెలువడింది. ఆ ఓంకారం యొక్క ఉనికి -సహస్రనామాల్లో చిక్కుతుంది. అదే సకల

శాస్త్రాలకు, జ్ఞానానికి, ప్రజ్ఞానానికి, సంజ్ఞానానికి, ఆజ్ఞానానికి పట్టుకొమ్మ. అజ్ఞానాన్ని నిర్మూలించేందుకు అది ఏకైకమైన ఆలంబనం. అది అవగాహనమైన నాటు చెట్లలో, గుట్టల్లో, నీళ్ళల్లో, నిప్పులో, మట్టిలో, మింటిలో, తేజస్సులో, తపస్సులో, అర్థంలో, అనర్థంలో, ప్రాణంలో, ప్రణవంలో, యోగంలో, భోగంలో, ఆత్మలో, అనాత్మలో అంతటా సర్వాంతర్యామి అయిన పరమాత్ముడు గోచరిస్తాడు. అదే సహస్రనామం మనకు ప్రసాదించగల దివ్యదృష్టి. ఈ దృష్టిలోనే పార్థుడు పరమార్థ స్వరూపాన్ని చూడగలిగాడు.

ఈ దివ్యదృష్టితో చూచినప్పుడు ప్రపంచమంతా పరమాత్మ స్వరూపంగానే కనిపిస్తుంది. స ఽసర్వనామ సహిత విశ్వరూపః అన్న పరమార్థం బోధపడుతుంది. ఊడలతో నీడలను పెంచే మఱ్ఱిచెట్టులోనూ, ఆకాశంలోని ఆ లోకాన్ని అవలోకించి పులకరించే అత్తి చెట్టులోను ఆకుల కలకలంలో కలలుకనే రావిచెట్టులోను అంతరిక్షంలో ఆధారంలేని మహావృక్షంలా నెలకొన్న ఆదిదేవుడే కనిపిస్తాడు. ఆవులో, ఎద్దులో, కోతిలో, సింహంలో, పందిలో, పాములో, నీటిలో నిప్పులో అన్నింటా ఆరూపమే గోచరిస్తుంది. మత్స్యకూర్మ వరాహాది దశరూపాలు విశ్వాత్మతాల్చిన విరాడ్రూపంలో ఇమిడి ఉన్నట్టు భాసిస్తాయి. కనుక సహస్రనామం త్రిమూర్తుల్లో ఒకటైన విష్ణువు యొక్క నామసహస్రంగా భావించటం అంత భావ్యం కాదు. త్రిమూర్తులకతీతమైన ఒకానొక మహద్భూతం దీనిలో కీర్తించబడింది. అందులో బ్రహ్మ, విష్ణువు, శంకరుడు, పురందరుడు, గణేశ్వరుడు, ఆదిత్యుడు, శ్రీదేవి, భూదేవి, భూర్భువస్సువాది సప్తలోకాలు, సప్త ద్వీపాలు ఇమిడి ఉన్నాయి. భూతభవ్యభవన్నాథుని నామసహస్రంలో మూడు కాలాలకు సంబంధించిన ముకుంద సౌందర్యం ముచ్చటగా ముడిపడి ఉంది. ఆ ముడి విడివడిన నాడు పొడి పొడి మాటల్లో అడుగడుగునా మడుగులను వెలయించగల నడుగుపోగు కనిపిస్తుంది. భారతకాలం నాటికి భవిష్యత్కల్పనలైన సిద్ధార్థ వర్ధమాన గురుర్గురుతమోధామాది నామాలు భవిష్యద్ద్రష్టమైన భీష్మాచార్యుడినోట అప్రయత్నంగా వెలువడుతాయి. ఈశాన మహామూర్త్యాది నామాల్లో సూచ్యాసూచ్యంగా అనేక మతాలతత్త్వసారం గోచరిస్తుంది. అందువల్లనే 'ఋషీణాం' పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి' నిజమనిపిస్తుంది. మహర్షులమాటలకు అర్థాలు వాటంతట అవి ఏర్పడుతాయి. సకలమత సమన్వయంతోపాటు శివకేశవ సామరస్యం సహస్రనామాల్లో అడుగడుగునా ధ్వనిస్తుంది. సహస్రనామ సంకీర్తన చేసిన తర్వాత భీష్ముడు ధర్మనందుడికి ఒక ధ్యానశ్లోకం చెపుతాడు. దానిలో శివకేశవుల అభేదం చక్కగా కనిపిస్తుంది. ఆ శ్లోకంలో చివరి రెండు పంక్తులు:

'సహస్ర నామాయ నమశ్శివాయ;
సహస్ర రూపాయ జనార్దనాయ.'

ఇలా సర్వాత్మకంగా సర్వాంతర్యామిగా సర్వదా సర్వశర్వ సమన్వయాన్ని సాధించిన శాంతనవుడు నామసహస్రంలో నిరూపించింది విశ్వాత్మ స్వరూపం. అది అందరికీ ఆరాధ్యం. కులమతజాతి లింగవయోభేదాలకు అందులో తావులేదు. అది విశ్వరూపం.

ఆ విశ్వరూపమే సహస్రనామంలో విశ్వాత్మగా, సర్వాత్మగా, సర్వభూతాత్మగా, వివిక్తాత్మగా, ప్రత్యగాత్మగా అనేకాత్మకంగా, ఏకాత్మకంగా అక్షయరూపాన్ని పొందింది. ఈ అక్షర భారతిని ఉపాసించగలిగినవాడు ధన్యుడు.

# వాల్మీకి సృష్టి - దృష్టి

భక్తకవి పోతనామాత్యుడు వ్రాసిన భాగవతం లాగా ఆదికవి వాల్మీకి రచించిన రామాయణం తెలిసి పలికిన కావ్యం. మామూలుగా పలికింది వాక్యమయితే తెలిసి పలికింది కావ్యమవుతుంది. అలా తెలిసి పలికిన పలుకులు కలకాలం నిలబడగల పసిడి పలుకులు అవుతాయి. కాని తెలిసి పలకటం అనుకున్నంత సులువయిన పని కాదని తెలుసుకున్న పోతన తాను విన్నదీ కన్నదీ తెలియవచ్చినంత వరకు తెలియ పరిచేందుకు ప్రయత్నిస్తానని వినయంగా మనవి చేసుకున్నాడు. ఆ పనినే అనన్య సామాన్య మయిన ఆర్ష దృష్టితో ఆదికవి వాల్మీకి సాధించాడు.

నిశితంగా పరిశీలించి చూస్తే విబుధ వరుల వల్ల విన్నంత కన్నంత తెలియవచ్చినంత తేటపరతునన్న వాక్యం వాల్మీకిని దృష్టిలో పెట్టుకునే పోతన్న అన్నాడేమో, అనిపిస్తుంది. వినటం, కనటం, తెలియవచ్చినంత తేటపరచటం వాల్మీకి రామాయణంలోని అవతారికలో అదేవరుసలో సంభవించటం గమనించ దగిన విషయం. సకల గుణాభిరాముడయిన ఆదర్శ మానవుని గుణ గణాలను నారదమహర్షి నోట వినటంతో రామాయణం ఆరంభమవుతుంది. ఆ తర్వాత ఒకనాడు సుప్రభాత శుభోదయ సమయంలో తమసా నదీ తీరంలో ఉదయ పదయాత్ర చేసే సమయంలో వాల్మీకి రస దృష్టికి ప్రసన్న పుణ్య జల ప్రవాహంలో ప్రసన్న రాఘవుడు గోచరిస్తాడు. మంచి మనిషిలో మంచి తనాన్ని పెంచే మంచి మనసులా మెల్లగా ఉల్లాసంగా సహజంగా సరళంగా తరళంగా తళతళలాడే తరంగాలతో ప్రవహించే నదిని చూడగానే కవి హృదయం ఆనందంతో నినదిస్తుంది. తనతో సంచరిస్తున్న భరద్వాజుని సంబోధించి ఆదికవి అంటారు.

అకర్దమ మిదం తోయం భరద్వాజ నిశామయ
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనోయథా

పంక మెరుగని నదీ జలం బొంకు తెలియని సత్పురుషుడి మనస్సులా ఎంత నిర్మలంగా ప్రసన్నంగా రమణీయంగా ప్రవహిస్తున్నదో చూచి చూచి వాల్మీకి మనస్సు పరవశిస్తుంది. పరమ రమణీయమైన భావజగత్తులో లీనమై పరవసిస్తుంది. నిజంగా మనిషి మనస్సు ఇంత నిర్మలంగా ఉంటే ఎంత బాగుంటుందని కవి హృదయం కమ్మని కలలు కంటుంది. ఇంతకు ముందే వీనుల విందుగా వినిపించిన నారద వాక్యంలో ఇలాంటి సన్మానం ధ్వనించింది. ఆ

మాటలు విన్న చెవులు ఈ నైర్మల్యాన్ని కన్న కళ్ళతో కలసి మెలసి కలలు కంటున్నాయి - ఏవేవో తియ్యని తలపులు, ఏవేవో కమ్మని ఊహలు. ఇంతలో ఇంతటి కమ్మని కలను కలవరపరచే మరో దృశ్యం కనిపిస్తుంది.

నదీ తీరంలో ఒక అందమైన చెట్టు. ఆ చెట్టు కొమ్మల్లో రెమ్మల చాటున తియ్యని అనురాగ రసాన్ని ఆస్వాదిస్తున్న రెండు పిట్టలు. ఒక వైపు కవి దృష్టి. మరోవైపు బోయవాడి మారణ దృష్టి. పిట్టల జంటను చూచి సహించలేని బోయవాడు నిర్దాక్షిణ్యంగా ఆ జంటలోని మగపిట్టను తన బాణంతో నేల గూల్చివేస్తాడు. ఆడపిట్ట ఆక్రందనతో కిందికి దిగి ఒకవైపు బోయవాణ్ణి, మరోవైపు కారుణ్యరసాన్ని వర్షిస్తున్న కవి హృదయాన్ని చూస్తుంది. ఇతరుల ఆనందాన్ని చూచి సహించలేక అకారణంగా మారణకాండకు ఉద్యుక్తుడయిన కిరాతుణ్ణి చూడగానే కవి హృదయం కరిగిపోతుంది. తమసా నదీ ప్రవాహంలో ప్రతి బింబించిన సన్మనుష్యత్వం ఒక్క క్షణం కవి మనస్సులో మెదలుతుంది. మరు క్షణంలోనే ఆ దృశ్యానికి పూర్తిగా విరుద్ధమైన యీ దారుణ దృశ్యం చూచి కవి విలపిస్తాడు. విలాపం కావ్యాలాపంగా మారి కరుణా కలితమయిన కవి రసన అమానుషమయిన హింసా కాంక్షను నిరసిస్తూ పలుకుతుంది.

మా నిషాద ప్రతిష్ఠాంత్వం అగమ శ్శాశ్వతీఃసమాః
యత్ క్రౌంచమిధునా దేకం అవధీః కామ మోహితమ్.

సకల చరాచర సృష్టికి బీజప్రాయమైన కామ్య కామాన్ని ధర్మ బుద్ధితో సేవిస్తున్న జంటను వేరు చేసిన క్రూరుడు మానవుడుకాడు. జీవులను జీవించనివ్వని జీవికి జీవించే అధికారం లేదు. ఒక వేళ జీవించినా అతని జీవితం పనికిమాలిన జీవితం. పేరు ప్రతిష్ఠలు లేని నిర్వీర్య జీవితం. అసలది జీవితమే కాదు. అతడు మానవుడే కాదు. ఇలా ఏవేవో భావాలు ఆది కవిని ఆర్తితో ఆర్ద్ర హృదయుణ్ణి చేస్తాయి. నారదుడు చెప్పిన రామకథ, వర్ణించిన రామతత్త్వం, కీర్తించిన రామనామం వాల్మీకి హృదయంలో నాటుకొనిపోయింది. ఆ మూలాధారాన్ని అభిషేకిస్తున్నది ఈ ఆర్ద్రత. మానవ జీవితంలో మంచికి ఎంత ప్రాధాన్యం ఉందో మానవ జీవితాన్ని మధురాతి మధురంగా భావించి సేవిస్తున్న భావయోగికి అర్ధమయింది. మంచి కానిది చూడకపోతే మంచికి గల విలువ మహనీయునికి తెలిసేది కాదు. ఏది మంచిది, ఏది కాదు. ఏది వెలుగు, ఏది నీడ, ఏది విధి, ఏది విధానం, ఏది సత్తు, ఏది అసత్తు, ఏది నిత్యం, ఏది అనిత్యం అని విచారించగల వివేకాన్ని ఈ రెండు దృశ్యాలూ ద్రష్టకు ప్రసాదించాయి. ఇప్పుడు జీవితం రసజీవికి సమగ్రంగా బోధపడింది. జీవితం రసమయం. అందులో శృంగారానికి ఎంత ప్రాధాన్యముందో, కరుణకు కూడా అంతటి ప్రాముఖ్యమే ఉంది. వీర రసం ఎంత ముఖ్యమో, శాంతరసం కూడా అంత

అవసరం. నవరస భరితమయిన మానవ జీవితాన్ని మాటల్లో మలిచి చెప్పాలని రస శిల్పికి అనిపించింది. అదే సృష్టి బీజం. దీనికి ఆధారం దృష్టి. సమగ్రమయిన దృష్టి. మంచి చెడ్డలను సమరస భావంతో సానుభూతితో శుద్ధ సాత్విక దృక్పథంతో పరికించి పరిశీలించి పరికీర్తించగల సమదృష్టి, ఋషి దృష్టి.

ఈ దృష్టి లభించగానే ద్రష్ట నోట సృష్టి వెలువడుతుంది. క్రౌంచ వియోగం చూడగానే కవి హృదయంలోని కరుణ కావ్య రూపాన్ని పొందటం చూచి కవికే ఆశ్చర్యం కలుగుతుంది. ఆ క్షణంలో వాల్మీకి నోట వెలువడిన మాటలు మామూలు మాటలు కావు. అవి తెలిసి పలికిన పలుకులు. నారద వాక్యం విన్న తర్వాత, తమసా నదీ జలంలో సన్మనుష్యతనూ నిషాదుని నిష్ఠురకృత్యాన్నీ అమానుషత్వం దర్శించడంతో దృష్టి సృష్టిగా మారుతుంది. శ్రుతి కృతిగా ప్రభవిస్తుంది. విన్నది విన్నట్టు, చూచింది చూచినట్టు, తెలియవచ్చింది తెలియ వచ్చినంతవరకు తేట పరచటం ఆరంభమవుతుంది. అదే రామాయణ శుభోదయం. నారద వాక్యంలో గుణజ్ఞత, తమసాతీరంలో రసజ్ఞత, క్రౌంచకాండలో కృతజ్ఞత– రామాయణ రచనకు ఆధారత్రయిని అందిస్తాయి. దానితో రామ–అయనం ఆరంభమవుతుంది.

ప్రపంచంలోని ప్రతి జీవిలో ఈ మూడు లక్షణాలూ బీజరూపంలో ఉంటాయి. సంస్కారాన్ని బట్టి, సాధనను బట్టి అవి కొందరిలో పరిపక్వ దశకు వచ్చి ఫలిస్తాయి. మరి కొందరిలో అవి కృశించి కృశించి నశిస్తాయి. రామాయణంలోని వివిధ పాత్రలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ సత్యం స్పష్టమవుతుంది. రామాయణం ఒక కథ మాత్రమే కాదు. అది అయనం. అయనం అంటే గమనం. జీవితం వివిధ రంగాల్లో విభిన్న దశల్లో, వేరువేరు సంసర్గ సాహచర్యాలలో ఎలా అయనిస్తుందో, పయనిస్తుందో రామాయణ కథ చెబుతుంది. రామాయణం కేవలం రాముడి అయనం కాదు. సీతారాముల అయనం. రామ శబ్దం పుంలింగమయితే రామా శబ్దం స్త్రీ లింగమవుతుంది. సీతా దేవిని గురించి చెప్పవలసి వచ్చినప్పుడు వాల్మీకి రామా శబ్దాన్ని చాలా తరచుగా వాడడం గమనించదగ్గ విషయం. అందువల్ల రామాయణం సీతారాముల సమన్వయ గమనం. జంట అయనం. అది ఆదర్శప్రాయమయిన అయనం.

సీతారాముల అయనంతో పాటు అనేక విధాల అయనాలు కూడా రామాయణంలో కనిపిస్తాయి. మానవ జీవితంలో స్త్రీ పురుషుల అయనం, గమనం, ప్రవర్తన ఎలా ఉండాలో సీతారాముల అయనం చెబుతుంది. కాని మామూలుగా మానవమాత్రులు ఎలా ఉంటారో, మిగిలిన పాత్రల అయనంలో వ్యక్తమవుతుంది. అన్నదమ్ముల్లోనే అనేక విధాల వ్యక్తులు కనిపిస్తారు. రామలక్ష్మణులు, భరతశత్రుఘ్నులు, వాలి సుగ్రీవులు, రావణ కుంభకర్ణులు, రావణ విభీషణులు చివరికి వాళ్ళ వేరు వేరు జీవిత విధానాన్ని నిరూపిస్తారు. దశరథుడి

ముగ్గురు రాణులు కౌసల్య, సుమిత్ర, కైకేయి వేరు వేరు మార్గాలను అనుసరిస్తూనే దశరథ సాహ్యాన్ని అనుభవిస్తారు. కౌసల్య మాతృమూర్తి, సుమిత్ర సుభాషిణి, కైక సౌభాగ్య మద గర్విత. వాక్య కోవిదుడయిన వాల్మీకి ఈ ముగ్గురినీ హ్రీ,శ్రీ, కీర్తి అని మంత్ర పూరిత పదాలతో వర్ణిస్తారు. అలాగే హనుమంతుడు సీతారాములకు తప్ప మరెవ్వరికీ సంపూర్ణంగా బోధపడని మహావీరుడు. వాక్కునూ, దృష్టిని తన నయనాలలో సంతరింపజేసుకున్న సమీరజుడు. సీతారాములకు ఆత్మీయుడయి రామాయణ మహామాలలో రత్న స్థానాన్ని అలంకరిస్తాడు.

సామాన్య పాత్రగా పరిగణింపబడే గుహుడు కూడా వాల్మీకి దృష్టికి గహన గోచరుడిగా కనిపిస్తాడు. అసురాంగనలలో కలిసిపోయిన త్రిజట సీతాదేవికి అంతరంగిణి అవుతుంది. సీతాన్వేషణ సందర్భంలో హనుమదాదులకు అపారమయిన ఆత్మీయతను, ఆతిధ్యాన్నీ అందించి ఆనందపరచిన స్వయం ప్రభ వాల్మీకి చేసిన అపూర్వ సృష్టి.

ఇలా రామాయణంలోని ప్రతి సృష్టిలో ప్రాచేతసుని ఆర్షదృష్టి కనిపిస్తుంది. మానవ జీవితం ఎంత మహనీయమో, మధురమో, జటిలమో, ఆరాధ్యమో, ఆస్వాద్యమో కూలంకషంగా తెలుసుకోవాలంటే వాల్మీకి రామాయణం ఆమూలాగ్రం పరిశీలించాలి. వెలుగు నీడల మధ్య నున్న భేదాన్ని గమనించలేని గుడ్డి ప్రపంచానికి దృష్టిని ప్రసాదిస్తుంది వాల్మీకి సృష్టి. దృష్టి మనకు కనిపించదు. సృష్టిని కనిపించేట్టు చేస్తుంది. కాని సృష్టి కనిపిస్తుంది. కనిపించని దృష్టిని కనిపింపచేస్తుంది. ఈ రెండింటి సమన్వయమే రామాయణం. అదే ప్రాణికోటికి సహజంగా లభించిన ప్రాణాయనం. రామాయణం సృష్టి. ప్రాణాయనం దృష్టి. కాబట్టి ప్రతి జీవికీ, ప్రాణికీ రామాయణం జీవిత పరాయణం.

★ ★ ★

# కవిత్రయం - మహాభారతం

ఆంధ్ర మహాభారతం తెలుగు సారస్వతానికి శ్రీకారం చుట్టి పద్యనైవేద్యంతో ప్రసన్న భారతికి ప్రశస్తి పాఠం పలికిన ప్రణవనాదం కావటం తెలుగువాళ్ళు చేసుకున్న అదృష్టం. శ్రీదేవిని నిత్యం తన వక్ష స్థలంలో కూర్చుకుని కూర్చున్న శ్రీ మహావిష్ణువు, మంజుల వాగ్విలాసంతో విశ్వతోముఖమైన తన ముఖాన్ని సుముఖం చేసుకుని సృష్టికార్యాన్ని సాగిస్తున్న చతుర్ముఖుడూ, చల్లని మంచుకొండను తన ఉత్సంగంతో ఉల్లాస పరచే గిరికన్యకను అర్ధాంగీకరించుకున్న శ్రీ కంధరుడూ మూడువేదాలూ మూడుమూర్తులుగా ఆవిర్భవించినట్టు ఆదికవి నన్నయగా, కవిబ్రహ్మ తిక్కనగా, ప్రబంధ పరమేశ్వరుడు పార్వతీపతిగా తెలుగునాట ఉదయించడం ఈ నేల చేసుకున్న నోముల పంట. వెయ్యి సంవత్సరాల క్రితం ఈ మహోదయానికి నాంది పలికిన నన్నయభట్టు విశ్వనాథ అన్నట్టు ఋషి వంటి కవి. రెండవ వాల్మీకి. కనుకనే ఆ కవి మనీషి స్మరించిన పురుషత్రయం ఆంధ్ర మహాభారతాన్ని భారత భారతికి సమర్పించి అర్చించిన కవిత్రయంగా మనకు సాక్షాత్కరించారు.

వాల్మీకి వేదాన్ని కావ్యంగా రూపొందిస్తే నన్నయ ఇతిహాసాన్ని సంహితగా సంస్కరించి రచించాడు. అది పౌరాణిక నైతిక సృష్టి. ఇది కావ్య కళాఖండం. నవ మానవ చైతన్య వికాసానికి కావలసిన వివేక సూర్యోదయం. నన్నయ సాధించిన యీ కావ్యదీక్షకు రాజరాజ నరేంద్రుడు నిమిత్తుడైనాడు. నారాయణభట్టు చేదోడువాదోడుగా ఉండి నన్నయ హస్తాన్ని ప్రశస్తం చేశాడు. ఎలాగయితేనేం భారతీయతను పరిభాషించి ప్రవచించిన జయభారతి మహాభారతం - తెలుగు సారస్వతంలో అవతరించింది.

ఈ పని నన్నయ తన జీవితకాలంలో తానే సాధించగలనని అనుకొని ఉండవచ్చు. కాని అనుకున్నవన్నీ అనుకున్నట్టు కొనసాగటం అందరికీ అన్నివేళలా సాధ్యం కాదు. మహర్షిలాంటి మహాకవికే సాధ్యం కాలేదు. ఆది, సభా పర్వాలు ముగించి అరణ్యపర్వంలో నాలుగో ఆశ్వాసంలో ప్రవేశించేసరికి నన్నయ్యకు నారాయణమూర్తి దగ్గరి నుంచి పిలుపు వచ్చింది. శారద రాత్రులు జ్జ్వల లసత్తర తారక హార పంక్తులతో చారుతర వైభవాన్ని ప్రపంచానికి పంచిపెడుతున్న సమయంలో వెన్నెల వెదజల్లే కర్పూర పరాగపాండురుచి పూరాలతో పరిపూర్తిని పొందిన నన్నయ జీవితం నవ్య నవనీత సమానమయిన నిండుతనాన్ని అందుకొంది.

దాదాపు రెండు శతాబ్దాల తర్వాత కవిబ్రహ్మ తిక్కన కలం పట్టి మిగిలిన పదిహేను పర్వాలను ఏకధాటిగా సాగించాడు. శ్రీయన గౌరినాబరగు చెల్వకు చిత్తము పల్లవించెట్టి పరతత్త్వాన్ని ధ్యానించి విరాట పర్వంతో ఆరంభించి స్వర్గారోహణం దాకా తన కావ్యయాత్రను సాగించి కార్యసాధకుడయినాడు– కవిబ్రహ్మ తిక్కన. కాని అరణ్య పర్వం శారద రాత్రులలోనే ఆగిపోయింది. ఆ రాత్రులకు సుప్రభాతం పలికేందుకు ప్రబంధ పరమేశ్వరుడు ఎర్రాప్రగడ ఉదయించాడు. ఒకవైపు వాగనుశాసనుడు, మరోవైపు కవిబ్రహ్మ – ఇద్దరిమధ్య సంధాయకత్వం వహించవలసిన కావ్యభారాన్ని ఎర్రాప్రగడ సమర్ధంగా నిర్వహించాడు. స్ఫురదరుణాంశురాగ రుచిని వెదజల్లే పగలు వచ్చింది. హంససారస మధువ్రత నిస్వనాలను తెచ్చింది. పాండునందనులకు మహాసరస్వతీ నిమజ్జన సౌభాగ్యాన్ని ఇచ్చింది. ఇలా మూడు మూర్తుల లాంటి ముగ్గురు మహాకవులు మూడు శతాబ్దాలపాటు కృషిచేస్తే కవిత్రయ మహాభారతం కావ్య జగత్తులో అవతరించింది.

నన్నయ కేవలం కవి కాదు, వాగనుశాసనుడు. తన వాక్కును తానే శాసించుకొని తన తరువాత తెలుగు వెలుగును వెలయింపజేసే పదవిధిని, కళానిధిని, కావ్యపద్ధతిని రూపొందించవలసిన అక్షర బాధ్యతను గుర్తించిన గుణజ్ఞుడు నన్నయ. ఆయన చేపట్టిన భారత సంహితా రచన కూడా అలాంటిదే. వేదవ్యాసుడు సంస్కృతంలో సమకూర్చిన ఆర్ష విద్యాసర్వస్వం మహాభారత సంహిత. దూరంగా ఉన్న రెండు తత్త్వాలను దగ్గర చేసేది సంహిత. 'పరః సన్నికర్షః సంహితా' అని పాణిని ప్రవచించిన యీ సంహితా తత్త్వాన్ని నన్నయ తన కావ్యసృష్టిలో అవతరింపజేసుకుని ఆరాధించాడు. దీనికి తాను ఏర్పరచుకున్న పథకాన్ని కావ్యరచనకు ముందుసూత్రప్రాయంగా వివరిస్తూ నన్నయ అంటాడు:

సారమతిన్ కవీంద్రులు ప్రసన్న కథాకలి(వి)తార్థయుక్తిలో
నారసి మేలునాన్–ఇతరులక్షర రమ్యతనాదరింప నా
నా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్

బుద్ధిమంతులయిన కవీంద్రులకు కావ్యానందాన్ని కలుగజేసే కమనీయ కావ్యరచన చేయాలని నన్నయ సంకల్పం. కవీంద్రులతోపాటు సహృదయులయిన సామాన్య పాఠకులకు కూడా ఆత్మానందాన్ని అందజేసేందుకు నన్నయ అక్షర రమ్యతనుకూడా పోషించాలన్న తథ్యాన్ని గుర్తించాడు. అందుకనే లోలోపల ఊహించుకొని ఉల్లసించేందుకు ప్రసన్న కథా కలితార్థయుక్తి లేక కవితార్థయుక్తి ఎంత అవసరమో వినగానే మళ్ళీ మళ్ళీ వినాలనిపించే పదసంపద కూడా కావ్యానికి అంత అవసరమే. ఈ రెండింటికి నిండుతనాన్ని కల్పించేది సూక్తి వైభవం. ఎంత మంచి మాటలలో ఎంత కళాశిల్పంతో చెప్పినా చెప్పదలచింది

గొప్పవిషయం కాకుంటే ఆ రచన కలకాలం నిలబడలేదు. కాలాన్ని నిలబెట్టలేదు. అందుకే నానా రుచిరార్థసూక్తికి నన్నయ్య ప్రాధాన్యం ఇచ్చాడు. ప్రసన్న కథా సంవిధానం, అక్షర రామణీయకత, సూక్తి నిక్షేపం – ఈ మూడు గుణాలనూ ఆధారం చేసుకుని ఆదికవి నన్నయ్య ఆంధ్ర మహాభారతాన్ని ఆరంభించాడు.

కథ మూలంలోదే అయినా కథా కథనం కవిలోని కవితాశక్తి మీద ఆధారపడి వుంటుంది. ఆ శక్తి యుక్తి యుక్తంగా ఉండాలి. ప్రసన్నంగా ఉండాలి. కవిత్వంలా కనిపించాలి. వింటే వీనులకు విందుగా ఉండాలి. 'వింటే భారతం వినాలి, తింటే గారెలు తినాలి' – అని ఓదన ప్రియులకు కూడా అనిపించాలి. ఇందుకై నన్నయ తనదైన భాషా సౌష్ఠవాన్ని కూర్చుకున్నాడు. సంస్కృతమూలంలోని సర్గ సరళిని ఆశ్వాస పద్ధతిగా మార్చుకున్నారు. ఒక్కొక్క పర్వం ఒక్కొక్క ప్రబంధకావ్యంగా సర్వసమగ్రంగా స్వయం పోషకంగా ఉండేట్టు కథాశిల్పం కూర్చుకున్నాడు. మూలంలో లేనిది చెప్పలేదు. మూలాన్ని నిర్మూలంచేయలేదు. చేతనయినంతవరకు ఉన్న పదార్థాన్ని నిర్మలంగా శబ్దీకరించేందుకు ప్రయత్నించాడు. అన్నమాట మళ్ళీ అనాలంటే ఎలా అంటే బాగుంటుంది అని ఆలోచించి అనువాదసాధనకు అనువేద గరిమను తెచ్చిన అనువాద శిఖామణి నన్నయ.

ఉదాహరణకు ప్రతీపుదు గంగాతీరంలో తపస్సు చేసుకుంటూ ఉంటే గంగ కాంతారూపంలో తపస్వి ఒడిలో వచ్చి కూర్చుంటుంది. దీనిని వ్యాసుడు ఇలా వర్ణించాడు.

తస్యరూప గుణోపేతా గంగా శ్రీరివరూపిణీ
ఉత్తీర్య సలిలాత్తస్యాల్లోభనీయతమాకృతిః
అధీయానస్య రాజర్షేర్దివ్య రూపామనస్వినీ
దక్షిణం శాలసంకాశం ఊరుంభేజే శుభాననా

దీనికి నన్నయ తెలుగు :

గంగ నిజాంగ దీప్తులెసగఁ జనుదెంచి లతాంగి సంతతో
త్తుంగ పయోధర ద్వితయతోయ రుహాయత చారునేత్ర, ది
వ్యాంగనయై ప్రతీప వసుధాధిపు శాల విశాల దక్షిణో
త్సంగమునందు మన్మథ వశంబుననుండె కరంబులీలతోన్.

కావ్యానువాదం ఎలా ఉండాలో గమనించేందుకు ఈ ఉదాహరణ చాలు. ఇదే ఒరవడిలో ఈనాటివరకు తెలుగు అనువాదాలు, అనుసరణలు, అనురచనలు సాగుతూ ఉన్నాయి. నన్నయ భారతంలో శకుంతలా వృత్తాంతం ద్రౌపదీ వస్త్రాపహరణం చెప్పుకోదగిన ఘట్టాలు. ఈ రెంటిలో నన్నయ కవితార్థయుక్తి బాగా కనిపిస్తుంది. వ్యాసుడు నిరూపించిన

శకుంతలను కాళిదాసు చాలావరకు మార్చి మరో శకుంతలను మనకు అందించాడు. కాని నన్నయ మాత్రం వ్యాసుడు కూర్చిన శకుంతలనే తన సంహితలో సంతరించుకున్నాడు. కాళిదాసు శకుంతల ప్రణయమూర్తి. అఖండ పుణ్యపరిపాకంవల్ల ఆవిర్భవించిన అనఘ సౌందర్యరాశి. వ్యాసుడు వ్యావహరించిన శకుంతల వాత్సల్యమూర్తి. తన దాంపత్యం కంటే తన అపత్యం యొక్క – బిడ్డ యొక్క – అభ్యుదయాన్ని ఎక్కువగా అభిలషించే మాతృమూర్తి. అందువల్లనే నన్నయ్య శకుంతల దుష్యంతుణ్ణి పుత్రగాత్ర పరిష్వంగ సుఖంబుచేకొని చూరగొన్న తర్వాత తన ప్రణయ ప్రసంగాన్ని గుర్తు తెచ్చుకొమ్మంటుంది. అందానికి పరమావధి ఆనందం. అది ప్రణయానందం కావచ్చు. తనయానందం కావచ్చు. మహర్షి దృష్టిలో ప్రణయ సౌభాగ్యం కంటే పుత్ర వాత్సల్యం మిన్న. ఈ పరమార్థాన్ని నన్నయ అర్థయుక్తి ఎంత సమర్థవంతంగానో ప్రవహించింది ఈ ఉపాఖ్యానంలో.

ద్రౌపదీ వస్త్రాపహరణం భారతీయ సంస్కృతికి కాలుష్యాన్ని తెచ్చిన పరమ దారుణ సంఘటన. దీనిని వ్యాస మహాకవి ఎంత నిశితంగా విమర్శించి నిరూపించాడో నన్నయ కూడా అంత నేర్పుతో చిత్రించాడు. భీష్మ ప్రతిజ్ఞలాంటి భీమ వాక్యం నన్నయ కలంలో పదాఘాతంలా అశనిపాతంలా వినిపిస్తుంది.

కురువృద్ధుల్ కురువృద్ధ బాంధవులనే కుల్ సూచుచుండన్ మిదో
ద్ధురుడై ద్రౌపదినిట్లు సేసిన ఖలున్ దుశ్శాసనున్ లోక భీ
కరలీలన్ వధియించి తద్విపుల వక్షఃశైల రక్తౌఘ ని
ర్ఝర మూర్వీపతి చూచుచుండ అని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

ఈనాడు ఉగ్రవాదులు, ఆతంకవాదులు, నరభక్షకులు చేసే నృశంస కృత్యాలకు ఈ భీమవాక్యం రామబాణంలా ఉపయోగపడాలి. ఆనృశంస్యం నెలకొనాలి. అంటే మనిషి మనిషిలా వ్యవహరించాలి. మనిషికి మనిషి తోడుగా ఉండాలి. కాని కీడు తేరాదు. ఇది భారత సంహిత ఘోషించే పరమార్థ భారతి.

ఈ భారతీయతను నన్నయ కంటే మిన్నగా వ్యాఖ్యానించాలని ప్రయత్నించాడు కవి బ్రహ్మ తిక్కన. పదిహేను పర్వాల భారత భాగంలో తిక్కనకు శాంతి, అశాంతి, అహంకారం, ఆధ్యాత్మిక చింతన, నిర్వేదం, నైరాశ్యం, వైరాగ్యం, వేదాంతం, విజ్ఞానం, వివేకం లాంటి మానవ లక్షణాలను సలక్షణంగా, లాక్షణికంగా కేవలం వాచ్యంగా కాకుండా కావ్యపరంగా చిత్రించే అవకాశం లభించింది. ఈ గురుతర బాధ్యతను ఉభయకవి మిత్రుడు, సోమయాజి, హరిహరనాథ పరాయణుడు అయిన తిక్కన చక్కగా నిర్వహించాడు.

యుద్ధ వర్ణనలో ఒక్క పద్యం చాలు:

క్షితియున్ పర్వత కోటియున్ వడకె అగ్ని చ్ఛాయలయ్యెన్ దిశల్
చతురంభోనిధులున్ కలంగె భయలోలంబయ్యె దేవ వ్రజంబు
అతి సంక్షోభమునొందె ఒక్కమొగి సైన్య ద్వంద్వమున్, ద్రోణుడు
ద్ధతి బ్రహ్మాస్త్రము మౌర్వితో నియత మంత్రస్ఫూర్తి సంధించినన్

నిజానికి ఇది బ్రహ్మాస్త్రం లాంటి పద్యం. ఇలాంటి పద్యాలు మంత్రవేత్త మంత్రి పుంగవుడు అయిన తిక్కన కలం నుంచి కోకొల్లలు వెలిశాయి.

ఎఱ్ఱన నిగర్వి. నిసర్గ కవితామూర్తి. అందుకనే రామకథ అతని కవితకు కరతలామలక మయింది. మచ్చుకు చిత్రకూటంలో రామానుజుడు చూచిన భరతాగ్రజుణ్ణి భారతీయ నేత్రాలతో పరిశీలిస్తే చాలు.

కనియెన్ కోమల నీల మేఘ సుభగా కారున్ జటావల్కలా
జినధారున్ సిత భూతిభూషితుని రాజీవాక్షు, కల్యాణకీ
ర్తను, కాకుత్స్థకుల ప్రదీపకుని సీతాలక్ష్మణోపేతు సన్
మునిలోకార్చితు సత్కృపాభరణు రామున్ రాజచూడామణిన్.

ఎఱ్ఱన హృదయం ఈ పద్యంలో రామకథా చూడామణిని దర్శించి ఉంటుంది. అదే ఎఱ్ఱన రామాయణ దర్శనం. తిక్కన హరిహరాయణ దర్శనం. అదే నన్నయ నవనీత మూర్తి సందర్శనం. అదే భారత భారతికి కవిత్రయం భారతి నివేదించుకున్న మహాభారత నిరాజనం.

# పరమ భాగవత శిఖామణి బమ్మెర పోతన

(పోతన భాగవత పంచశతాబ్ది ఉత్సవాల ప్రత్యేకవ్యాసం)

భారతీయ సంస్కృతికి రామాయణం శరీరం. మహాభారతం మనస్సు. భాగవతం ఆత్మ. ఈ మూడింటి సమ్మిళిత సమగ్ర స్వరూపమే భారత భారతి. ఈ భారతిని మనసార మనస్సరస్సులో సాక్షాత్కరించుకొని తరించేందుకు పరితపించిన వాఙ్మయ తపస్వి బమ్మెర పోతన. శరీరం స్థూలం. అందరికీ కనిపిస్తుంది. అంగసౌష్ఠవం అందరినీ ఆకర్షిస్తుంది. అందమని అందరూ ఆరాధించి ఆనందించేది యీ శారీరక సౌందర్యమే. ఇలాంటి సర్వాంగ సౌష్ఠవం, స్థూల సౌందర్యం రామాయణంలో కనిపిస్తుంది. కనుకనే అది సర్వజనమనోరంజకమైన కావ్యంగా కలకాలం నిలబడ గలిగింది, నిలబడుతుంది. కొండలు నిలబడ గలిగినంతవరకు, నదులు ప్రవహించగలిగినంత వరకు రామాయణం అన్ని లోకాలలో ప్రచరించగలదని బ్రహ్మ తీర్పు. కాని స్థూలంగా కనిపించే శరీరంలోనే మనస్సుఉంది. ఆత్మ కూడా వుంది. అవే భారత భాగవతాలు. రామాయణ పరమార్థమే మహాభారతంలో మనోహరమైన మానస సరోవరంగా పరిమళించింది, అదే భాగవతంలో ఆత్మానంద లహరిగా పరిఢవిల్లింది. అందువల్ల భాగవత పరమార్థాన్ని గ్రహించటం అంత సులభమైన పని కాదు. ఈ విషయం బమ్మెర వారికి బాగా తెలుసు.

"భాగవతము తెలిసి పలుకుట కష్టంబు శూలికైన తమ్మిచూలి కయిన
విబుధవరులవలన విన్నంత కన్నంత తెలియ వచ్చినంత తేట పరతు"

అని సవినయముగా మనవి చేసుకున్న పోతన భాగవతసారాన్ని సరళంగా సారగర్భితంగా వివరించాడు. అష్టాదశ పురాణాలు, మహాభారతం లాంటి బృహదితిహాసం రచించిన వేదవ్యాసుడు, మనశ్శాంతి కోసం భాగవతం ప్రబంధించుకున్నాడు. వ్యాసునికేకాక సామాన్య మానవులకు కూడా జీవితంలో కావలసిన శాంతి సౌఖ్యాలను ఐహికంగా ఆముష్మికంగా కూడా ప్రసాదించగలిగిన నిగమాగమ నిక్షేపం శ్రీమద్భాగవతం. అలాంటి గ్రంథాన్ని మరో భాషలో పరిభాష చెడకుండా పలకడం అందరికీ సాధ్యంకాదు. పరమేశ్వరుడు, పరబ్రహ్మ కూడా భాగవత తత్త్వాన్ని తెలిసి పలకలేరట. మరి పోతన కదియెలా సాధ్యమయిందంటే తెలిసిన వారివల్ల తెలుసుకునే అవకాశం లభించడం, అలా తెలియవచ్చిన తత్త్వాన్ని అందరికీ

తెలిసేట్టు తెలియపరచగలిగే సామర్థ్యం రామభద్రుడు ప్రసాదించటం సహకరించాయని సహజ పాండిత్య, తపోనిధి పోతన అంటాడు. "విన్నంత కన్నంత" అనే మాటల్లో వేద నాదం, వైజ్ఞానిక దృక్పథం ధ్వనిస్తాయి. వినబడేది శ్రుతి. దానినే వేదమంటారు. వేద నాదంలో లీనమయిన జీవి తనలోని ప్రణవ కాంతిని చూడగలుగుతాడు. అదే ఆత్మ సాక్షాత్కారం. శ్రుతి సమ్మతమైన విజ్ఞాన వివేకాల వల్ల ఇలాంటి ఆత్మ దర్శనం లభిస్తుంది. ఆత్మ తత్త్వాన్ని ఆర్ష దృష్టితో అవగాహనం చేసుకొని అందరికీ అర్థమయ్యే పద్ధతిలో వివరించగలిగిన శక్తి పరమ భాగవత శిరోమణి అయిన పోతనామాత్యునికి రామభద్రుడే ప్రసాదించాడట. తన నోట పలికిన భాగవతాన్ని ఆత్మారాముడయిన రామభద్రుడే పలికించాడట. ఇంతటి వినయం, నిర్లిప్తత సహజంగా సమకూర్చుకున్న సాత్త్వికుడు కాబట్టే పోతన కవిత ప్రజల హృదయాలలో అప్రయత్నంగా ప్రవేశించింది.

నన్నయ్య, తిక్కన, నాచన సోమన, శ్రీనాథుడు, పెద్దన లాంటి కవులు తెలుగులో ఉత్కృష్టమైన కావ్య రచన చేశారు. కాని పోతన పద్యాలు తెలుగునాట ప్రతి వ్యక్తి నోట నాటుకొనిపోయాయి. మందార మకరంద మాధుర్యాన్ని మరిపించే మధురాతి మధురములయిన పద్యాలు తెలుగు దేశంలోని – జలవాయువుల్లో కలిసిపోయాయి. ఉత్తరదేశంలోని తులసీ రామాయణంలాగా, తెలుగువారికి పోతన భాగవతం పారాయణ గ్రంథమయింది. పండితులకూ, పామరులకూ సరిసమానంగా సంతుష్టిని చేకూర్చగలిగిన సహజ సరళశైలి పోతన సొత్తు. సంస్కృతం, తెలుగు అనే భేదం ఆయనకు లేదు. ఎప్పుడు ఎలాంటి పదజాలం అవసరమయితే అప్పుడది ఆయన కలంలో తనంతట తాను వచ్చి చేరుతుంది. ఒక్కొక్కప్పుడు వైకుంఠపురంలోని "మందార వనాంతరామృత సరః ప్రాంతేందుకాంతోపలోత్పల పర్యంకం"లో వినోద విహారాలు చేసే లక్ష్మీనారాయణులను సాక్షాత్కరించుకుంటాడు. మరొకప్పుడు హరిభక్తిపుంభావమైన ప్రహ్లాదమూర్తిలో ప్రవేశించి "ఒక్కచోట నిలచి ఊరకుండి" పోతాడు. పోతపోసిన భక్తి పోతన. భక్తిగల చోటికి భాష తనంతట తాను పరుగెత్తుకొని వస్తుంది.

పోతన భాషలో అనుప్రాస అనాయాసంగా కనిపిస్తుంది. "భాసుర నిగమపదోపన్యాసుడు సుతపోవిలాసు డనుపమ యోగాభ్యాసుడు రవిభాసుడు దూర్వాసుడ"ని మహామునిని మహానందంలో వర్ణిస్తాడు కవి. ఇలాంటి వర్ణనలు అప్రయత్నంగా పోతన నోట వెలువడుతాయి. మహాకవుల వాక్కు అర్థాన్ని అర్థించదు. అర్థమే వాక్కును అనుసరిస్తుంది. దీనికి చక్కని ఉదాహరణ గజేంద్ర మోక్షంలో ఎవరికీ ఏమీ చెప్పకుండా ఉన్నట్టుండి బయలుదేరిన భర్తను చూచి నివ్వెరపోయి నిలబడిపోయిన లక్ష్మీదేవి మనస్థితిని వర్ణించే కందపద్యం.

అడిగెదనని కడువడి జను
అడిగిన తన మగడు నుడువడని నడయుడుగున్
వెడ వెడ జడముడి తడబడ
అడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్.

ఇలాంటి పద్యం మరో భాషలో అరుదు. అలంకారానికి అలంకారం. చమత్కారానికి చమత్కారం. అర్థ సామర్థ్యానికి పరమావధి. ధ్వనికి ధ్వని, శిల్పానికి శిల్పం. అన్ని విధాలా ఈ పద్యానికి ఇదే సాటి, కాని దీనికి బీజం కాళిదాసు రచించిన కుమార సంభవంలోని "శైలాధిరాజ తనయా న యయౌన తస్థౌ" అనే పంక్తిలో కనిపిస్తుంది. ఇంతవరకు తనతో సంభాషిస్తున్న బ్రహ్మచారి పరమేశ్వరుడే అని తెలుసుకున్న పార్వతి సిగ్గుతో వెనుకంజ వేస్తున్నది, ప్రేమతో ముందంజ వేస్తున్నది. పర్యావసానం ఎక్కడ ఉన్న పార్వతి అక్కడనే నిలబడి పోవడం. ఈభావాన్ని పురస్కరించుకొని పోతన వ్రాసిన యీ పద్యాన్ని మరొకరు అనుకరించలేరు. అనువదించలేరు. అనుకరణలకూ, అనువాదాలకూ సాధ్యంకాని యిలాంటి నిసర్గ పద సంపద వల్లనే ఏ భాషకయినా విశిష్టత లభిస్తుంది. ఇలాంటి పద సంపదతో తెలుగు భాషను సంపన్నం చేసిన పోతన తెలుగుల నోములపంట.

పోతన భాషలో సంస్కృతాంధ్ర సామరస్యం ఎంత సహజంగా సమకూరిందో, అలాగే ఆ మహాకవి వ్యక్తిత్వంలో శివకేశవ సామరస్యం, రామకృష్ణ సమన్వయం, భక్తివిజ్ఞాన సంగమం స్పష్టంగా కనిపిస్తాయి. శైవ కుటుంబంలో పుట్టి రామభక్తిని అలవరచుకొని కృష్ణ లీలలను కీర్తించిన పోతనామాత్యుని జీవితమే సామరస్యానికి ఆలవాలం. అసలు భాగవతంలోని ఇతివృత్తమే సమన్వయాత్మకమైనది. అది కేవలం నంద నందనుని ఆనంద లీలలను వర్ణించే పురాణం కాదు. "మహానందాంగనా డింభకు"ని రూపవైవిధ్యాన్ని నిరూపించే భక్తిరసాయనం. శ్రీ కైవల్యపద ప్రాప్తి ఈ భక్తికి పరమావధి. ఈ విషయం పోతన ఆరంభంలోనే సూచించాడు. భగవత్సంబంధమయిన తత్త్వాన్ని భక్తుల చరిత్రల ద్వారా ప్రబోధించే ప్రశస్త శాస్త్రం భాగవతం. పశుప్రాయమైన గజరాజు నుంచి పసితనంలోనే పరమార్థాన్ని గ్రహించిన ప్రహ్లాదుని వరకు వేరువేరు దశల్లో భక్తిని నిరూపించే భక్తచింతామణి భాగవతం. ఒకవైపు జ్ఞానం, మరోవైపు వైరాగ్యం మధ్యనున్న భక్తిని బలపరుస్తూ ఉంటే భాగవత మహాపురాణం భక్తిజ్ఞాన వైరాగ్యాలను ప్రతి పదంలో ప్రతిపాదిస్తూ కల్పతరువులా కోరిన వారికి కోరిన స్థాయిని హాయిని చేకూర్చుతుంది. భాగవతంలోని భగవత్తత్త్వం చదువరుల సంస్కారాన్ని బట్టి ఒకచోట సగుణంగా మరొకచోట నిర్గుణంగా కూడా గోచరిస్తుంది.

ఉదాహరణకు –

**చేతులారంగ శివుని పూజింపడేని**
**నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువడేని**
**దయయు సత్యంబులోనుగా తలపడేని**
**కలుగ నేటికి తల్లుల కడుపు చేటు**

అన్న పద్యంలో పోతనామాత్యుడు ఒకవైపు శివకేశవుల ఆరాధనను సమర్థిస్తూనే మరోవైపు అంతరంగంలో దయామయుడై నెలకొని ఉన్న శివ స్వరూపాన్ని, సత్య స్వరూపుడై సాక్షాత్కరించే శ్రీహరిని సూచ్యాసూచ్యంగా చూపించేందుకు ప్రయత్నించాడు. శివకేశవులు ఏ కైలాసంలోనో, వైకుంఠంలోనో లేరు. మన అంతఃకరణంలోనే దయ, సత్యం అనే సద్గుణాలరూపంలో ఉన్నారు. దయకలిగిన హృదయం శివాలయం. సత్యాన్ని సాధించే సాత్వికమైన మనస్సు శ్రీనివాస నివాసం.

తులసీదాసు కూడా మన అంతరంగంలోని శ్రద్ధా విశ్వాసాలే భవానీ శంకరులంటాడు. ప్రతిపదంలోని శబ్దార్థాలే పార్వతీ పరమేశ్వరులని కాళిదాస కళాదృష్టి. ఈ కోవకు చెందిన మహాకవులందరూ ప్రతిజీవిలో పరమాత్మను దర్శించి ఆ దృష్టిని తమ సృష్టిలో ప్రదర్శించారు. ఇలాంటి ద్రష్టల్లో పోతన ఒకడు కావటం, ఆయన తెలుగువాడు కావడం తెలుగువారి అదృష్టం.

పోతన భాగవతం వ్రాసే నాటికి సూరదాసు పుట్టలేదు. సూరదాసును సూరదాసుగా తీర్చిదిద్దిన మహాప్రభు వల్లభాచార్యులవారు పోతనకు సమకాలికులు. తర్వాతనే చైతన్య మహాప్రభువులాంటి మహనీయులు ఆవిర్భవించి భారత భారతిని భక్తి పీయూషంతో అభిషేకించారు. ఈ భక్తిరస ప్రవాహానికి నాంది పలికిన భాగవతోత్తములలో ముందుగా కాకపోయినా ముఖ్యంగా చెప్పుకోదగిన పరమ భాగవత శిఖామణి బమ్మెరపోతన.

సూర పంచశతి జరిగిన తర్వాతనయినా, అంతకు ముందువాడయిన పోతనామాత్యుని పంచశతిని జరుపుకోవాలనే సత్సంకల్పం తెలుగువాళ్లకు ఏర్పడడం ఆనందకరమైన విషయం. పోతన కేవలం తెలుగులకు చెందినవాడే కాదు. యావద్ భారతదేశానికే కాదు, సమస్త భాగవత జగత్తుకే పోతన ఒక వెలుగు. భక్తుల హృదయంలో భక్తి జీవించి ఉన్నంతవరకు విశ్వసాహిత్యంలో పోతన పలుకు నెలకొని ఉంటుంది.

**జయంతి తే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః**
**యేషాం న కీర్తికాయస్య జరామరణజం భయం.**

# కల్పవృక్షే కథా శిల్పే విశ్వనాథో విశిష్యతే

"వేద వేద్యే పరేపుంసి జాతే దశరథాత్మ జే
వేదః ప్రాచేత సాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"

వేద వేద్యుడయిన పరాత్పరుడు దశరథనందనుడయి లోకములను తరింపచేయగా ఆ పురుషోత్తముని వృత్తాంతాన్ని రామాయణ రూపంలో నిబంధించిన ప్రాచేతసుడు వేదాన్నే లోకానికి అందించాడట. రామకథా కోవిదులకు ఈ కల్పన ఎంతో రమణీయంగా ఉంటుంది. కాని రామతత్త్వ జిజ్ఞాసువులకు ఇది మననీయమైన మంత్రంగానే తోస్తుంది. వేదవేద్యుడు రామచంద్రుడై అవతరించిన విషయం ఊహకందనిది కాకపోవచ్చు. కాని రామాయణంలో వేదం ఎలా పలికిందో తెలుసుకుని ఈ సాంకేతిక భాషను అవగాహనం చేసికొనేందుకు కొంత సంస్కారం, సామర్థ్యం, సాధన అవసరం. ఈ మూడింటిని సమకూర్చుకొని ఆదికవి వాక్కును వేద దృష్టితో సమన్వయించుకొని రామకథను వర్ణించగలిగిన కళాతపస్సంపన్నులు మన భారతీయ సాహిత్యంలో ఎందరో లేరు. వారిలో కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ ఒకరు. తెలుగు రామాయణాల్లో బహుశః ఇలాంటి కళాదృష్టి విశ్వనాథైక సాధితమని చెప్పవచ్చు. రామాయణ కల్పవృక్షంలో కళావేద మనదగిన ఈ వివిక్త భావ వైభవం ఆమూలాగ్రం సమగ్ర కళాదృష్టితో గమనించ గలిగిన వారికి గోచరిస్తుంది.

ఎంతటి రసవంతమైన సమాహిత మనఃస్థితిలో వాల్మీకి శోకం శ్లోకత్వాన్ని పొందిందో కాని నాటి నుండి నేటివరకు ఈ కథావస్తువు ఏదో ఒక రూపంలో మన భాషలన్నింటిలో వ్యాపించి పండిత పామరులకందరికీ పరమానంద మధువుని పంచి పెడుతూనే ఉంది. ఇప్పటికి దాదాపు ఆరు శతాబ్దాల క్రితమే 'రంగనాథ రామాయణం'లో జన సామాన్యానికి అందుబాటులో ఉండేలాగా ఈ వృత్తాంతం వర్ణింపబడింది. ఆ తరువాత వాల్మీకిని సాధ్యమైనంత యథాతథంగా కావ్యరూపంలో వెలుగులకందించిన 'భాస్కర రామాయణం' ఆంధ్ర భారతిని అలంకరించింది. 'అధ్యాత్మ రామాయణం' జనసామాన్యంలో చాలా ప్రచారం పొందింది. స్త్రీ సమాజంలో మొల్ల రామాయణం ఒక ప్రత్యేకమైన స్థానాన్ని ఏర్పరచుకుంది. పాపరాజుగారి 'ఉత్తర రామాయణం', తిక్కనగారి 'నిర్వచనోత్తర రామాయణం', కూచిమంచి తిమ్మకవి గారి 'అచ్చ తెనుగు రామాయణం', అయ్యలరాజు రామభద్రుడు రచించిన

'రామాభ్యుదయం', పింగళి సూరనార్యుడు వ్రాసిన 'రాఘవ పాండవీయం' ఒకవిధంగా పండితుల వరకే పరిమితమయినప్పటికి, తెలుగునుడికి ఎనలేని సొగసులు చేకూర్చాయి. ఇటీవల పుట్టపర్తి నారాయణాచార్య వంటి మేధావులు గేయరూపంలో రామాయణం వ్రాసేందుకు ప్రయత్నించారు.

ఇలా ఆరుశతాబ్దాల నుండి తెలుగులో ఇన్ని రామాయణాలుండగా విశ్వనాథవారు మరో రామాయణం ఎందుకు వ్రాశారు? వ్రాసి ఆయన సాధించిన మహత్కార్యమేమిటి? అనే ప్రశ్న ఎవరికయినా సహజంగానే ఉదయిస్తుంది. ఈ రోజుల్లో మళ్ళీ రామాయణం వ్రాయడం ఎందుకు అనే అధునాతనులు కూడా ఉన్నారు. ఈ ప్రశ్న కవి తన కావ్య పీఠికలో 'మరలనిదేల రామాయణం బన్నచో' అని తనంతట తానే లేవదీసి దానికి సమాధానం కూడా చెప్పుకున్నారు. ఎవరి ఆకలి వారిది, ఎవరి సంసారం వారిది, ఎవరి జీవితం వారిది, ఎవరి అనుభూతి వారిది, అలాగే నా రాముడు వేరు, నా రామాయణం నాది అన్నట్టుగా కవి సమర్థిస్తారు. కాని ఈ చేదర్థక సమర్ధన కంటె కవి తన కావ్యానికి పెట్టిన పేరు కవి దృష్టిని సువిస్పష్టంగా స్పష్టీకరిస్తుంది.

భారతదేశ భాషల్లో రామాయణానికి ఇంత రసస్ఫోరకమైన పేరు పెట్టిన మరో కవి గోస్వామి తులసిదాసు. వాల్మీకి మహాపర్వతంలాంటి మహనీయుడు. ఆ కొండ కోనలలో నుండి రామసాగరం వైపు ప్రవహించింది రామాయణ మహానది. ఆ ప్రవాహాన్ని అంతా అవగాహనం చేసుకోలేని తన పరిసర సమాజాన్ని గుర్తించి వారికి కావలసినంత రస సంపదను కావలసిన రీతిలో సేకరించి "రామచరిత మానసాన్ని తీర్చి దిద్ది" "సంసార పతంగ ఘోర కిరణాలకు" గురి అయిన వారికి శాంతిని చేకూర్చాడు తులసి. అలాంటి స్పృహణీయకల్పన మళ్ళీ మనకు కల్పవృక్షంలో కనిపిస్తుంది.

"రామాయణ" శబ్దంలోని స్వారస్యాన్ని సమగ్రంగా సర్వతోముఖంగా సర్వ సంకల్ప సాధకంగా సాక్షాత్కరించుకుంది సత్యనారాయణగారి "సకలోహ వైభవసనాథ"మైన "నాథకథ". కాగా విశ్వనాథవారి రఘునాథకథ కల్పవృక్షంగా రూపొందింది. కల్పవృక్షం మనకు కనిపించేది కాదు. ఊహకందని అనుభూతిని మనోహరంగా రుచిచూపగల శక్తి ఆ కల్పతరువులో ఉంది. భావ జగత్తునకు సంబంధించిన విశ్వకల్పనలను క్రియా ప్రపంచంలో చరించే మానవులకు అర్థమయ్యేటట్టు వివరిస్తుంది విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్షం.

విశ్వనాథవారికి సహజంగా అలవడిన యీ విలక్షణ కథాశిల్పం కల్పవృక్షంలోని ప్రతిభాగంలో కనిపిస్తుంది. కల్పవృక్షంలోని ఆరుకాండలు అయిదయిదు ఖండాలుగా

విభజింపబడ్డాయి. అందులో మొదటికాండ అయిన బాలకాండలో మొట్టమొదటిది 'ఇష్టి' ఖండం. పుత్రకాముడైన దశరథుడు అశ్వమేధం చేయడం ఈ ఖండంలోని కథాభాగం. దశరథుడు చేసింది పుత్రకామేష్టి కాదు. అది కేవలం ఇష్టి. ఇష్టసిద్ధికి తోడ్పడే కార్యసాధన. ఒకవిధంగా మానవ జీవితమే ఒక ఇష్టి. ఒక యాగం. 'ఇష్టి' శబ్దానికి ఇటుక అనే అర్థం కూడా ఉంది. ఇటుకలు భవన నిర్మాణానికి పునాది అయినట్టుగానే ఇష్టి (యజ్ఞం) జీవితానికి పునాది. రామాయణ కల్పవృక్షానికి ఇష్టి ఖండం పునాది. సర్వఫలప్రదాయిని ఇష్టి. రామాయణ సర్వస్వాన్ని ప్రసాదించేది కల్పవృక్షం. ఈ నామకరణంలోనే ఇంత నిగూఢమైన అర్థం గోచరించినప్పుడు కథా శిల్పాన్ని పరిశీలిస్తూ పోతే ఇలాంటి కల్పవృక్షాలు ఎన్నో కనిపిస్తాయి.

వాల్మీకి రామశరీర సౌష్ఠవాన్ని వర్ణిస్తూ 'సమస్సమ విభక్తాంగః' అంటాడు. అంటే ఏ అవయవం ఎంత పరిమాణంలో ఎలా ఉండాలో అలా అన్ని అవయవాలు నియమిత పరిమాణంలో ఉన్నాయని అర్థం. ఇలాంటి సౌష్ఠవమే కథా సంవిధానంలో కూడా ఉండాలి. రామాయణం అంటే ఒక్క రాముడి కథే కాదు. ప్రధాన కథా వస్తువుకు అనుషంగికంగా అనేక కథలు వస్తాయి. విశ్వామిత్రుని కథ, అహల్యకథ, మంధర కథ, అనసూయకథ, మారీచుని కథ, శూర్పణక కథ, వాలి కథ – ఇలాంటివెన్నో కథలు ప్రధాన కథతో ముడిపడి ఉంటాయి. వీటినన్నిటిని తగిన ప్రాధాన్యంతో ముఖ్యకథా వస్తువుతో సంపృక్తం చేయడంలో కవి శిల్ప దృష్టి విశదమవుతుంది. ఏ కథ ఎప్పుడు ఎలా చెపితే కావ్య పరమార్థం రమణీయంగా రససిద్ధికి తోడ్పడుతుందో కవికి తెలిసి ఉండాలి. వేదవేద్యుడైన రాముడు దశరథుని ఇంటిలో జన్మించగానే వేదం కావ్యంగా మారుతుంది. అప్పటినుండే కవి నిర్మాణ మార్మికత బయటపడుతుంది.

విశ్వనాథ రామాయణంలోని బాలకాండ చాలా విషయాల్లో ప్రత్యేకత సాధించుకుంది. ముఖ్యంగా రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల బాల్యాన్ని వర్ణించడంలో విశ్వనాథవారు 'అచ్చతెనుగు' రామాయణం వ్రాస్తున్నట్లు అనిపిస్తుంది. లేక లేక వార్ధక్యంలో కలిగిన సంతానాన్ని అల్లారుముద్దుగా తల్లిదండ్రులు పెంచడం, పిల్లలనెత్తుకుని ఆడించడం, పాలుతాగే పిల్లలు చేసే అల్లరి, తండ్రి ఒడిలో కూర్చుని రథం మీద రాముడు నగరంలో విహరిస్తూ ఉంటే పౌరులు అంతకుముందు ఎప్పుడూ చూడనట్టు, అప్పుడే చూచినట్టు, అసలు చూడనే చూడనట్టు అనేక భావ భంగిమలతో తిలకించి పులకరించడం, ఇవన్నీ చదువుతూ ఉంటే రాముడు పరంధాముడు కాక మన కడుపున పుట్టిన కన్నతండ్రిలా కనిపిస్తాడు. విలువిద్య నభ్యసించడంలో కైక అతనికి చాలా సహకరిస్తుంది. అంతేకాదు, రాముడికి వివాహమయిన

తర్వాత కూడా సీతారాముల దాంపత్య జీవితాన్ని ఆనందకరం చేయడంలోనే భావి జీవితానికి బీజారోపణ చెయ్యడం జరుగుతుంది. ప్రణయ జీవితంలో పరవశించే సీతారాముల మనో వినోదాలను ఆధ్యాత్మికంగా చిత్రించడం జరిగింది. విశ్వనాథ సృష్టించిన రాముడు పరమేశ్వరుడు. సీత పరమేశ్వరి. పార్వతీ పరమేశ్వరుల ప్రణయ లీలలను వర్ణించిన కవి కుల గురువుతో పోటీపడి కవిసామ్రాట్టు సీతారాముల చేతోమోదాన్ని సుస్నిగ్ధ మధుర గంభీర భావాలతో వర్ణిస్తూ ఉంటే పఠితల మానసిక చక్షువులకు 'అంతఃపుర వీధికాంతర మహాసౌధాంతరాంతస్థ రుద్రాణీమూర్తి' 'పూర్వ సుప్త సుకృతాకారంబు' రూపొందినట్లు 'నేత్ర ద్వంద్వ సంప్రీతిగా' సాక్షాత్కరిస్తుంది.

అహల్య కథలో కూడా కవిసమ్రాట్కథాశిల్పం అనల్ప తలాన్ని సమకూర్చుకుంది. సామాన్య దృష్టికి అహల్య జారవనిత. పతి శాపం చేత ప్రస్తరీభూతయై రామపాదాంకిత అయినప్పుడు మరల స్త్రీ రూపాన్ని పొందుతుంది. కాని విశ్వనాథ సృష్టించిన అహల్య 'ఒకానొక అద్భుత ప్రక్రియ నైశ్చల్యాన్ని పొందిన శిలాసామాన్య' మవుతుంది. ఆ శిలాతపస్విని రాముని అడుగు జాడలు గమనించగానే కోల్పోయిన చైతన్యాన్ని మరల పొందుతుంది. ఆమెలోని చైతన్యోదయం చక్కని సీసంలో సున్నితంగా వర్ణించబడింది.

ప్రభు మేనిపై గాలి పైవచ్చినంతనే
 పాషాణ మొకటికి స్పర్శ వచ్చె
ప్రభుకాలి సవ్వడి ప్రాంతమైనంతనే
 శిలకొక్కదానికిఁ జెవులు గలిగె
ప్రభుమేని నెత్తావి పరిమళించిన తోన
 యశ్మంబు ఘ్రాణేంద్రియంబుఁజెందె
ప్రభు నీలరత్న తోరణమంజులాంగంబు
 గనవచ్చి ఱాతికిఁ గనులు కలిగె
ఆ ప్రభుండువచ్చి యాతిథ్యమును స్వీక
రించినంతనుపల హృదయవీథి
నుపనిషద్వితానమొలికి శ్రీరామ భ
ద్రాభిరామ మూర్తియగుచుఁ దోచె.

శబ్ద స్పర్శ రూపరస గంధములు క్రమక్రమంగా సంక్రమించడం, అందులోని పరమార్థం, ఆ వరుసలోని వైచిత్రి- ఇవన్నీ కవి నోట ఒక ఉపనిషత్తును వెలయింపచేశాయి. ఇందులో రసప్రసక్తి సహృదయ సంవేద్యము. వేద సమ్మితమైన వాక్కు కవినోట కావ్యరూపాన్ని ఎలా పొందిందో అర్థం చేసుకొనేందుకు ఈ ఒక్క పద్యం చాలు. ఇలాంటివి కల్పవృక్షంలో కోకొల్లలు.

కథా శిల్పంలోనే కాక రూపకల్పనలో కూడా కల్పవృక్షం అనర్ఘమైన రచనగా తోస్తుంది. పరశురాముని రూపకల్పన గమనించదగినది.

"ఫాలంబందున బ్రాహ్మతేజము దృశాబద్ధోగ్ర రక్తచ్ఛటా
భీలక్షత్ర నితాంత భీకరతయున్ బెల్లై పదన్యాస రే
ఖాలీలా పరిధూత సద్ధరణి భృద్గంభీర పక్షద్వయో
ద్వేలోద్దామ విదీర్ణ చక్రమణ సందేహోస్పదా క్రాంతిగా.

పరశురాముని ముఖాకృతి కంటె అతడు సమీపిస్తున్నప్పుడు వాకిటనే వినిపించిన "నిష్ఠావర్ష దుదార మేఘపటలీ నిర్గచ్ఛ దుద్యోదిత స్ఫీష్ఠీరమ్మద మాలికాయుగ పదుజ్జృంభన్మహో ఘోర బంహిష్ఠ స్ఫూర్జథుషండ మండల రవాహన క్రియా ప్రౌఢి ద్రాఘిష్ఠ"మయిన ధ్వని కవి కల్పనకు ప్రగాఢ నిదర్శనం.

కవి కథాశిల్ప చాతురికి సుందరకాండ మరో నిదర్శనం. సుందరకాండలో హనుమంతుని లంకాయాత్ర వర్ణ్య విషయం. హనుమంతుడు సంధ్యవేళలో లంకలో ప్రవేశిస్తాడు. అర్ధరాత్రి వరకు సీత కొరకు లంకంతా గాలిస్తాడు. ప్రభాతవేళకు అశోకవనంలో సీతను సందర్శిస్తాడు. పగలంతా లంకలో చేయవలసిన అలజడి చేస్తాడు. మళ్ళీ సాయంత్రానికి తిరుగు ప్రయాణం సాగిస్తాడు. ఇలా ఒకనాటి సంధ్య నుండి మరునాటి సంధ్యలోగా సుందరకాండలోని మనోహర వృత్తాంతం ముగిసిపోతుంది. ఈ కాలపరిమితిలో కాలాతీతమైన కవి దృష్టికి ఒక గహన మధురోష గోచరిస్తుంది. పూర్వరాత్ర, పరరాత్ర, ఉషః, దివా, సంధ్యా ఖండాల్లో మొత్తం కాండను విభజించడం జరుగుతుంది. పూర్వాహ్ణం, అపరాహ్ణం అనే భేదం అందరికీ తెలిసినదే. కాని పూర్వరాత్రం, పరరాత్రం అనేది విశ్వనాథ పరికల్పితం, ఏ వేళకు సరిపోయిన ఘటనలు ఆ వేళ జరగడం, అంతా ఒక దినమానంలో ముగియడం ఇవన్నీ చూస్తే ఇదేదో 'ఆహ్నిక" వృత్తాంతంగా తోస్తుంది.

ఇలాగే కల్పవృక్షంలోని ప్రతి సన్నివేశాన్ని కూడా సరస హృదయంతో పరిశీలిస్తే అందులో వేదకావ్య సమ్మిశ్రితమైన విలక్షణ కథాశిల్పం గోచరిస్తుంది. మచ్చుకు కొన్ని ఉదాహరణలు మాత్రమే ఇవ్వడం సాధ్యమవుతుంది.

నిజానికి సీతారాముల వృత్తాంతమే వేద కావ్యాలను మేళవించగల రసవత్తరమైన కథ. సూర్యకుల దీపకుడు రాముడు. భూదేవికి ముద్దుల బిడ్డ సీత. భూమ్యాకాశముల సారభూతమైన తత్వ సంయోగమే రామాయణ పరమార్థం. రామశబ్దం 'రామ్' ధాతువు నుండి పుట్టినది. స్థితికి, శాంతికి, నిలకడకు ప్రతీకం. 'అయనము' అనుపదము 'ఇ' (వెళ్ళుట, కదలుట' అను ధాతువు నుండి పుట్టినది. – గతికి, చలనానికి, చేతస్సుకు ప్రతీకము కాగా రామాయణం స్థితిగతుల అవినాభావాన్ని నిరూపించి 'తదేజతి, తన్నైజతి' అనే ఉపనిషద్వాక్యాన్ని స్ఫురింపచేసే రమణీయ రసకల్పన. ఈ కల్పనలోని పరమ రహస్యం గమనించిన ద్రష్ట కనుకనే విశ్వనాథవారు రామాయణాన్ని కల్పవృక్షంగా భావించగలిగారు. కనుకనే –

కల్పవృక్షే కథా శిల్పే
విశ్వనాథో విశిష్యతే.

# నవ కవయిత గురజాడ

తనువు తానని భ్రమించక తన తోటి వారిలో తన్ను దాను చూచుకోగలగటం ఒక తపస్సు. అలాంటి తపస్సంపన్నత కలవాడే కవి, మనీషి. మనీషి ఐన కవి దృష్టికి మట్టి కూడా మనిషిలా కనిపిస్తుంది. అతని సృష్టిలో తోకచుక్క కూడా వేగుచుక్కలా వెలుగుతుంది. అతని నోట వెలువడే మాటలు కలకాలం నిలబడగలిగే మంత్రాలుగా మారుతాయి. ఈ తపస్స్వాధ్యాయ నిరతుల కోవకు చెందిన మహా మనస్వి శ్రీ గురజాడ వేంకట అప్పారావు. ఆయన్ని మహాకవి అనే కంటే 'కవయిత' అంటే బాగుంటుందని తోస్తుంది.

అసలు ప్రపంచమంతా ఒక మహాకావ్యం. దీనిని రచించిన విరించి మంచిని పెంచిన మహాకవి. ఈ మహాకవి ప్రకటించే మహావాక్య సరణిని అనుసరించి చరించే ప్రతి చైతన్యమూర్తి కూడా కవి పదవికి అర్హుడే. అయితే ఇందులో కొంతమంది చూచింది చూపిస్తారు. విన్నది వినిపిస్తారు. వ్రాసిందీ, వ్రాయందీ వ్రాయిస్తారు. అలాంటి వారినే కవయితలు అనాలని అనిపిస్తుంది. కవి కర్త అయితే కవయిత కారకుడవుతాడు. కాని దీనికి దృష్టి, సృష్టి, పుష్టి కావాలి. ఈ మూడు గుణాలూ గురజాడ వారి వ్యక్తిత్వంలో పుష్కలంగా కనిపిస్తాయి. గతాన్ని నిశితంగా పరిశీలించడంలో ఆయన దృష్టి, వర్తమానాన్ని సమర్థంగా నిర్వచించడంలో ఆయన సృష్టి, అనాగతానికి అభిలషిత ఫలితాన్ని అందించటమే తన ఆదర్శంగా భావించి ఆనందించటంలో ఆయన పుష్టి – మనకు స్పష్టంగా గోచరిస్తాయి. పదిమంది వెళ్ళే దారిలో వెళ్ళుతూనే వాళ్ళకు సరి క్రొత్త బాటను చూపించి క్రొత్త పాతల మేలు కలయికను కూర్చిన మహామనస్వి కావటం వల్లనే ఆయన్ని నవ కవితకు కవయితగా భావించటం భావ్యమనిపిస్తుంది. నిజానికి ఆయన రచయితలను రచించిన మహా రచయిత.

అప్పారావుగారి పేరు వినగానే మనకు మూడు మాటలు స్ఫురిస్తాయి. దేశం – ప్రేమ – మంచి. ఇవి మూడూ ఆయన తన జాతికి ప్రసాదించిన మంత్రత్రయి. వీటినే దేశమును ప్రేమించుమన్నా, మంచి అన్నది పెంచుమన్నా, అనే ముత్యాల సరంలో ఆయన కూర్చి ఇచ్చారు. దేశమంటే ఆయనకు కనిపించేది ఒట్టి మట్టి కాదు. ఆ మట్టిలో పుట్టి, మట్టితో పెరిగి, మట్టి పట్టినా మనఃకాంతంగా భాసించే మనుష్యులే హిరణ్యతేజస్సుతో ఆయనకు కనిపిస్తారు. 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' అన్న వారి నిర్వచన సూత్రానికి 'మనుషులంటే మనసులోయ్' అన్నది సరియైన వార్తికం అవుతుంది. ఈ

మనుష్యుల మనస్సులు ఎలా ఉండాలో కూడా ఆయన నిరూపించారు. 'ఒట్టిమాటలు కట్టి పెట్టి గట్టి మేల్తలపెట్టే' దిట్టలే దేశానికి పనికొస్తారని ఆయన గట్టిగా నొక్కి చెప్తారు. తిండి ఉంటేనే కండ, కండ కలవాడే మనిషి – అని ఆయన నిర్మొహమాటంగా అనేస్తారు. నిజమే మరి. ఈసురోమని మనుషులుంటే దేశమెలా బాగుపడుతుంది? 'న్యాయమాత్మా బలహీనేన లభ్యః' అన్న వేద వాక్కును గురజాడ వారు సూటిగా చెప్పారు. వేద నిహితమైన సందేశాన్ని అందంగా ఆస్వాద్యంగా అధునాతన మానవజాతికి అందించటమే నవ కవయిత ఆశయం. కనుకనే, ఆకులందున అణగి మణిగీ కవిత కోయిల పలకవలెనోయ్' అంటాడు. మాట మంచి తెలిసిన మానవ కవి. ఇక్కడ ఆకులంటే పక్షులు కొరుక్కుతినే మామూలు ఆకులు కావు. కవి కోకిలలు ఏరి కోరి ఆరగించే ప్రశస్త వేద పర్ణాలు. సామాన్య మానవుడి కంటే ఆరాకులు, పది పన్నాలు ఎక్కువ చదువుకున్న భావుకుడు కావడం వల్లనే కవి గురజాడ ఇలా చెప్పగలిగాడు. కవి చెప్పినంత మాత్రాన లాభం లేదు. అది విని అర్థం చేసుకునేందుకు అర్హులు కూడా ఉండాలి. పలుకులను విని 'దేశమందభిమానములు మొలకెత్తవలెనని' కవి కాంక్షిస్తాడు.

కవి కాంక్షించిన సమాజంలో జాతి మత వివక్ష ఉండదు. జాతి ఒకటే. అది మానవజాతి. మతం ఒక్కటే, అది మానవత్వం. భాషలు వేరయినా పరిభాష అందరికీ ఒకటే, అదే ప్రేమ. ప్రేమ సూత్రంతో మానవుల మనస్సుమనాలను కూర్చి ముత్యాల మనోహర సరాలతో ఆంధ్రజాతిని అలరించిన కవి గురజాడ గొప్ప వాఙ్మయ తపోధనుడు. ఈ ప్రేమను కవి గొప్ప పెన్నిధిగా భావిస్తాడు. అది కొరుక్కు తినేది కాదట. నేర్చుకుంటే నేర్పు రాదట. శాస్త్రాలు కూడా ఈ విషయంలో మౌనం వహించాయట. కవుల కృప వల్లనే ఈ ప్రేమ రహస్యం తెలుస్తుందట. స్త్రీ పురుషుల జీవితాన్ని తరింపచేసేది ప్రేమ ఒక్కటే అని కవి నమ్మకం.

మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుఖముకు రాజమార్గము

అది ఎలా పెంపొందుతుందో కవి భావన వివరిస్తుంది.

ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును
ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును

ఈ రెండు వాక్యాలు ప్రేమ సమీకరణాల్లా వినిపిస్తాయి. నిజానికి 'ధర్మో రక్షతి రక్షితః' అన్న సనాతన సూక్తిని అధునాతన పదజాలంలో అందించాడు కవి ఈ పంక్తుల్లో. కవి ప్రేమకు ఆధారం శరీరంకాదు, మనస్సు కూడా కాదు. హృదయం దానికి ఆలవాలం.

హృదయంలో ఉదయించి, హృదయంలో పెరిగి సమస్త మానవజాతికి జాతి కుసుమాలను అందించి వాటి పరిమళాన్ని నలుదిక్కుల వెదజల్లే పరమ పావన మనోభావన కవి కోరిన ప్రేమ. అది వయసుతో మరలిపోయే మరులు కాదు. మాయమర్మం లేని నేస్తాన్ని కవి తన జీవిత సమస్తంగా భావిస్తాడు. ఇలాంటి ప్రేమనే మహాకవి భవభూతి ప్రశంసిస్తూ అంటాడు.

అద్వైతం సుఖ దుఃఖయో రనుగుణం
సర్వాస్వవస్థాసు యత్
విశ్రామో హృదయస్య యత్ర జరసా
యస్మిన్నహార్యో రసః

ప్రేమకు రెండు అనేది తెలియనే తెలియదట. రెండు కలిసి ఒకటి కావటమే ప్రేమ పరమార్థమట. కష్టసుఖములలో అది సమానంగా పెరుగుతుందట. హృదయం విశ్రాంతి తీసుకునేందు కది ప్రశాంతి నిలయమట. అది వయసుతో తరగదట. భవభూతి అడుగు జాడల్లో గురజాడ ఎలా తొంగి చూస్తున్నాడో సహృదయులు గమనించగలరు.

ప్రేమ నిండిన మనస్సుతో కవి తన మాటల మూటను కాసుల మూటగా కవితా కన్య కర్పిస్తాడు. ఆత్మ తత్త్వం ఆత్మ శక్తితో ఆత్మనే చేరుకుంటుందని కదా ఉపనిషత్ సిద్ధాంతం! అలాగే కవయిత తన కవితను కవితా సతికే అర్పించి కృతకృత్యుడవుతాడు.

మహాత్ముడు బోధించిన ప్రేమనే ఆయనకు దాదాపు సమకాలీనుడైన గురజాడ మనకు మరోవిధంగా చూపించాడు. 'లవణరాజు కల' అనే ఖండికలో హరిజన పక్షపాతి అయిన కవి హృదయం చండాల బాలికలో నిండు మనసును తిలకిస్తుంది. పుట్టుకతో మాల అయినా మలిన వృత్తులను మాని వేసి నిర్మలమైన పల్లెజీవితం గడిపే ఒక అందమైన పిల్లపై అందాలలో తులతూగే మహారాజుకు మనసవుతుంది. కాని వాళ్ళ సహజమైన ప్రేమను సంకుచితమైన సంఘం అంగీకరించదు. కలలో చూచిన అందాన్ని ఇలలో సాక్షాత్కరించుకొని కూడా దానితో అనుబంధం ఏర్పరచుకొని ఆనందించేందుకు వీలులేని లవణరాజు తనకు నచ్చిన సతితో పాటు చితిలో పడి బ్రతుకు లక్ష్యాన్ని చేరుకుంటాడు.

కలుగు భవములు కూడ నీతో
కలసి గడపుము ముక్తి చెందెద
కలదె నీ ప్రణయాతిరేకము
కన్న సద్గతియున్"

అనుకుంటూ ప్రేయసీ ప్రియులు పరమ హంసధ్వనితో ప్రణయ గీతిని ముగిస్తారు. ఇదంతాకల. కాని లవణరాజు కల కూడా నిజమవుతుంది. మహారాజు నిజంగా మాలపిల్లనే

పెండ్లి చేసుకుంటాడు. దీనితో మహాత్ముడు కన్న కల కూడా గురజాడ వారి ఋషివాక్కులో నిజ రూపం తాలుస్తుంది. నిద్ర లేచిన రాజు 'పటు విషాద సమాకులేక్షణుడై' తన అనుచరులతో అంటాడట.

"పుస్తకంబులోని మాటలు విస్తరించుచు అనుభవమ్ముల
తత్వ మెరుగక శుకములగుదురు వొట్టి శాస్త్రజ్ఞుల్"

'విషాద సమాకులేక్షణ' శబ్దం తేట తెలుగుకు పాటుపడే గురజాడ వారి నోట వెలువడటం కొంత వింతగా తోస్తుంది. అసలు సమాసమంటేనే ఆయనకి గిట్టదు. చివర 'వొట్టి శాస్త్రజ్ఞుల్' అనే కంటే 'శుష్క శాస్త్రజ్ఞు' లంటే ఎంతో చక్కగా ఉండేది. కాని సర్వసామాన్యంగా అందరికీ అర్థం కావాలన్న ఆశయానికి కట్టుబడ్డవాడు కాబట్టి 'వొట్టి' మాటకే వోటిచ్చాడు. మరి అలాంటి కవికి ఇలాంటి సమాసం ఎలా రుచించింది అనేది ఆలోచించవలసిన విషయం. నిజానికి ఈ మూడు మాటల్లో భగవద్గీతలోని విషాద యోగం. ఆదికవి రామాయణంలోని నిషాద గాథ, అసలు జీవిత యాత్రలో అడుగడుగున జడిపించే విషాద రేఖలూ, ఈ మూడూ ముసురుకుని వినిపిస్తాయి. ఏక కాలంలో ఇన్ని విషయాలు చెప్పాల్సివచ్చే సరికి కవికి సమాస ప్రయాస తప్పింది కాదు.

ఒక్కొక్కసారి కవి మనస్సు ప్రబంధ కాలం నాటి పుష్ప లావికల మీదికి పోతుంది. పూదండల నమ్ముకొనే పూబోడితో సరసంగా ఒక రసికుడంటాడు

"నీ దండ చిక్కు వడెనే
నా దండను చిక్కటన్న నగరే ప్రాజ్ఞుల్
నీ దండ నుంచుకొనుమా
వాదుడుగు మటందు రచటి వనితల్ విటులున్

ఈ కందంలో వనితలూ, విటులూ ఒకరిని మించి మరొకరు వాగ్విదగ్ధతను చూపిస్తారు. దండనూ, అండనూ మెలివేసి మలచిన యమక ప్రాసల్లో ప్రాచీన కవితా ధోరణిపై కవికి గల మమకారం కనిపిస్తుంది. 'ప్రీతి కలదేని జాతులు చూతురే? మా జాతులెల్ల చోద్యము లనరే?' అన్న పంక్తుల్లో కవి దాదాపు నాలుగు శతాబ్దాలు వెనక్కిపోయి కూడా కనీసం ఒక శతాబ్దం ముందు మాట చెప్ప గలిగాడు.

నీలగిరి పాటల్లో కవికి ప్రకృతి మీద ఉన్న సహజానురాగం గోచరిస్తుంది. 'ఊటి చోద్య మేమి చెపుదు' నని సాటి లేని ఊటిని మాటల్లో మూట గట్టి చూపిస్తాడు – కాసుల మొనగాడు, మన గురజాడ.

గురజాడ కూర్చిన ప్రేమలో త్యాగం ప్రధాన లక్ష్యంగా కనిపిస్తుంది. 'కన్యక' అనే ఖండికలో విషయలాలసుడయిన రాజు దృష్టి ఒక సామాన్య వైశ్య కన్యపై పడుతుంది. నడివీధిలో పద మదాంధుడైన ప్రభువు పరిణయ పరాధీన అయిన కుల కన్యను కలుష నయనాలతో చూస్తాడు. ఆమెను తాత్కాలికంగా స్వాధీనం చేసుకోవాలని చూస్తాడు. ధర్మపరాయణ అయిన కన్య అతన్ని దేవి ఆలయానికి తీసుకొని వెళ్ళి అక్కడ చితిలో ప్రవేశిస్తూ తన మీద నిజంగా ప్రేమ ఉంటే తనతో పాటు ఆ చితిలో పడి లయం కమ్మని అతనితో సవాలు చేస్తుంది. అప్పుడు పట్టణమేలే రాజు గర్వం కరిగిపోతుంది. కోట పేటలు కూలి కుక్కలకు, నక్కలకు ఆట పట్టై పోతాయి. కాని మానవతి అయిన కన్య మంట కలిసిన చోట ఆకాశాన్ని అంటే ఆలయం లేస్తుంది.

ఇలాంటి త్యాగపూరితమైన అనురాగాన్నే 'డామన్ పితియస్' అనే ఖండిక కూడా వివరిస్తుంది. డామన్, పితియస్ అనే ఇద్దరు యవన మిత్రులు ఒకరి క్షేమం కొరకు మరొకరు ప్రాణాలను సైతం అర్పించేందుకు సిద్ధమవుతారు. మరణ దండన పొందిన దమన్ ప్రాణాలు వదిలే ముందు భార్యా, బిడ్డలను చూద్దామనుకుంటాడు. కాని దీనికి ప్రాణానికి ప్రాణం ఒడ్డే ఆప్త మిత్రుడు కావాలి. అందుకు పితియస్ సిద్ధపడతాడు. నెలలోగా డామన్ తిరిగి రావాలి. లేకుంటే పితియన్ దక్కడు. ఇలాంటి క్లిష్ట పరిస్థితిలో డామన్ మాట దక్కించుకుంటాడు. ఇద్దరు మిత్రుల అపూర్వ త్యాగానికి రాజు ముగ్ధుడై మరణ దండన కొట్టి వేస్తాడు. ఈ కథ అందరికీ తెలిసిందే. కాని కవి దాన్ని తన మాటల్లో చెపుతుంటే అదో సొంపుగా ఉంటుంది. అసలు కథ చెప్పటమే ఒక నేర్పు. ఆ కథను హృద్యమైన భాషలో పద్యరూపంలో కూర్చటం అందరికీ సాధ్యమయిన పని కాదు. వ్యాస వాల్మీకులు సాధించి నిరూపించిన బాట యిది. ఆ ఋషుల అడుగుజాడల్లో గురజాడ ఈ నైపుణ్యాన్ని పరిపూర్ణంగా అలవరచుకొన్నారు. 'పుత్తడి బొమ్మ పూర్ణమ్మ కథ'లో ఈ నేర్పు కళా ప్రపూర్ణతను పొందింది.

తెలుగుదేశం, తెలుగు భాష, తెలుగు జాతి నిలకడగా ఉన్నన్నాళ్ళు పుత్తడి బొమ్మలా పూర్ణమ్మ నిలిచిపోతుంది. గురజాడ వారి మాటనూ, మనసునూ, మంచినీ రంగరించుకొని బంగారు కాంతితో పొంగి పొరలే మంగళ గీతి ఇది. 'ఏయే వేళల పూసే పువ్వుల ఆయా వేళల అందించి, ఏయే ఋతువుల పండే పండ్లను ఆయా ఋతువుల అందించి బంగరు దుర్గను భక్తితొ కొలిచే 'పుత్తడి బొమ్మ పూర్ణమ్మ' తెలుగువారి నోముల పంట. అన్నపూర్ణకు ఆలయమైన ఆర్ష భూమిలో పేదరికానికి బలి అయిన పూర్ణమ్మ కరుణ గాథ బండ హృదయాలను కూడా కరిగిస్తుంది. ఆమె కన్నుల్లో కళకళలాడే కాంతులు కలువలను చేరుకున్నాయి. ఆమె మేని పచ్చదనం మేలిమిలో మిళితమై పోయింది. ఆమె నడకల్లోని ఒయ్యారం రాయంచల అడుగు మడుగుల్లో ఒదిగిపోయింది. ఆమె దుర్గలో చేరి దుర్గగా

మారిపోయింది. తనతో పాటు తన కవయితను కూడా మృత్యుంజయుణ్ణి చేసింది.

కథ చెప్పినా, కవిత వ్రాసినా గురజాడ రచనల్లో ముఖ్యంగా నాటకీయ సజీవత తొణికిసలాడుతుంది. 'సుభద్ర' అనే ఖండికలో ఈ లక్షణం విలక్షణంగా కనిపిస్తుంది. కృష్ణుడు తన ప్రాణ మిత్రుడైన అర్జునుడికి తన చెల్లెలు సుభద్రను జత కూర్చటంలో చూపిన లాఘవం, చాతుర్యం ఈ కమనీయ కళాఖండంలో ఎంతో చక్కగా చిత్రించటం జరిగింది. రచన, పద్యరూపంలో ప్రబంధ ధోరణిలో సాగినప్పటికీ సంభాషణలు, సంఘటనలు, సన్నివేశాలు – అన్నీ నాటక లక్షణాలకు అనుగుణంగా కనిపిస్తాయి. సర్గ విభజన కూడా అంక విభజనలాగానే స్ఫురిస్తుంది. గురజాడ వారిలో ఒదిగి ఉన్న ఈ నాటక రచనా పాటవం 'కన్యాశుల్కం'లో పూర్తిగా వికసించింది. గురజాడ వారి కీర్తి పతాకను తెలుగు నాట కలకాలం నెలకొల్ప గలిగిన పటిష్ఠమైన రచన 'కన్యాశుల్కం'. సంస్కృతంలో మృచ్ఛకటికకు ఉన్న స్థానం తెలుగులో ఈ ఒక్క నాటకానికే లభించింది.

అప్పారావుగారు ఎక్కువగా వ్రాయలేదు. కవిత మరీ స్వల్పం. కాని పరిమితిలో కొంచెమయినా, పరిణితిలో అనల్పమైనది వారి కావ్యసాధన. ముత్యాల సరం అనే ఛందస్సు వారి నూతన సృష్టి కాక పోయినా, దానికి ఆ పేరు పెట్టి కొత్త కొత్త పోకళ్ళలో దాన్ని మలచటం గురజాడ వారి ఛందస్సాధనకు ప్రబల నిదర్శనం. రగడ జాతిలో ఈ ఛందస్సు అంతకు ముందు వాడుకలో ఉంది. కాని కొద్ది మార్పులతో దాన్ని సరి కొత్త ఛందస్సుగా తీర్చిదిద్దిన వాడు గురజాడ. హిందీ లాంటి భారతీయ భాషల్లో కూడా దీనికి ప్రచారం ఉంది. కాని ముత్యాల సరాల పోకడ అతి విలక్షణంగా ఉంటుంది. పంక్తి చివర తెగిపోకుండా అవిచ్ఛిన్నంగా కొనసాగే తెనుగు పదాల జాలు కూడా ఈ నిసర్గ శోభకు బాగా సహకరించింది.

అసలు ఛందస్సు వల్ల సాధించవలసిన పరమార్థమేమిటి? కవిత్వానికి ఛందస్సు ఎంత వరకు అవసరం? ఏ భావానికి ఏ కాలానికి ఎలాంటి ఛందస్సు సరిపోతుంది? అనే విషయాలను కూలంకషంగా పరిశీలించినప్పుడు గురజాడ వారి ముత్యాలసరాలలోని ఛందస్సాధన బాగా బోధపడుతుంది. అది ప్రత్యేకమైన పరిశోధనకు అనువైన విషయం. ప్రస్తుతం ముత్యాలసరాలతో తెలుగుతల్లిని అలంకరించి అలరించిన గురజాడ వారి ఆర్ష దృష్టిని, రస సృష్టిని అభినందించ గలిగితే చాలు.

గురజాడ వారి సృష్టి కంటే వారి దృష్టి గొప్పది. వారు వ్రాసినదంతా తీరికగా కూర్చుంటే ఒక గంటలో చదివి ముగించవచ్చు. ముఖ్యంగా కవిత్వం ఆయన చాలా కొద్దిగా వ్రాశారు. కానీ ఆ కొద్దిలోనే ఆయన యుగయుగాలకు సరిపోయే చైతన్యాన్ని కుదించి మనకందించారు. తన యుగానికి, తన జాతికి, తాను తరించి తన తోటివారిని కూడా తరింపచేసేందుకు

కావలసినంత వాక్సంపదను ఆయన మనకు ప్రసాదించారు. సముద్రంలో ఎంత నీరున్నా మనకు దాహం తీర్చలేని అనంతజలరాశి వల్ల మనకు ప్రయోజనంలేదు. అమృతం ఒక చుక్క చాలట – జన్మ జన్మాంతరాల దాహం తీర్చుకునేందుకు. అలాంటి అమృత బిందువులు కాని, వాటిని తాగిన అమరులు కాని మనకు మృగ్యులు. కాని గురజాడ వారి వచనామృతం మాత్రం మనకు లభించింది. అది మన అదృష్టం.

# వ్యాస సారస్యమెరిగిన వాగ్వివేకి డా॥ బూర్గుల రామకృష్ణరావు గారు

పాండిత్యం, వినయం, సౌశీల్యం, సౌహార్ద్రం, కార్యదక్షత, కావ్యకౌశలం, పదవి, ప్రతిష్ఠ– ఇన్ని గుణాలు ఒక వ్యక్తిలో ఉండటం చాలా అరుదు. అలాంటి వ్యక్తులు శతాబ్దంలో ఒకరు కనిపిస్తే గొప్ప. ఈ శతాబ్దంలో తెలుగుసీమలో వెలసిన అలాంటి మహనీయులలో మననీయులు డా. బూర్గుల రామకృష్ణరావుగారు ఉన్నత పదవులను అలంకరిస్తూనే మహోన్నత సాహిత్యసేవతో ఆంధ్ర భారతిని ఆరాధించటం తెలుగు నేల శతాబ్దాలుగా వస్తున్న సత్సంప్రదాయం. భువన విజయం నాటి నుంచి ఈ సంప్రదాయం ఎంతటి మేధనో పండించింది. ఎంతటి తేజస్సునో వెలయించింది. డా॥ రామకృష్ణరావుగారు ఈ కోవకు చెందిన వాఙ్మయ తపోనిధులు.

వ్రాయటం అనేది ఒక గుణం అని భావించి సేవించిన గుణగ్రహణ పారీణులు రామకృష్ణరావుగారు ఒకమారు అన్నారు. "నాకు కూడా వ్రాసే గుణం ఉండి వ్రాస్తూ ఉండేవాడిని" అని. ఈ చిన్నవాక్యంలో వామనమూర్తిగా కనిపిస్తూనే తన త్రివిక్రమ రూపాన్ని వెలయించిన బూర్గులవారి పురుషోత్తమత్వం స్ఫురిస్తుంది. వారి వినయ విధేయతలు కూడా ఈ వాక్యంలో వినిపిస్తాయి. మాతృభాష తెలుగులోనే కాక హిందీ, ఉర్దూ, పారసీ, సంస్కృతం, మలయాళం, మరాఠీ, కన్నడం, ఆంగ్ల భాషల్లో కేవలం అభినివేశం ఏర్పరచుకోవటమే కాక, ఆయా భాషా పీయూష జీవి బూర్గుల రామకృష్ణరావు. ఆదిశంకరుల సౌందర్య లహరితో పాటు ఉమర్‌ఖయ్యాం రూబాయీలను కూడా తెలుగు ఛందస్సులో అవతరింపజేసిన అనువాదవేది రామకృష్ణరావుగారు, స్వంతంగా శ్రీనివాస షట్కం, భగవతీ స్తుతి, మరుత్ సందేశం లాంటి రచనలను హృద్యంగా రచించారు. మంచి కావ్యకర్త, మంచి వ్యాసకర్తగా కూడా రాణించటం అరుదు. అలాంటి అరుదయిన పనులను సాధించిన కీర్తి రామకృష్ణరావుగారికి దక్కింది. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురించిన 'సారస్వత వ్యాస ముక్తావళి' ఈ సత్యాన్ని అక్షరాలా ప్రత్యక్షం చేస్తుంది.

ఇందులోని 14 వ్యాసాలు మన శతాబ్దంలో దాదాపు ఒక వ్యాసార్థాన్ని మనకు పరిచయం చేస్తాయి. రచనా రసజ్ఞులు శ్రీ రామలింగంగారు అన్నట్టు – 'ఈ సంకలనంలో తెలుగు, పారసీ, ఉర్దూ, సంస్కృత, మలయాళ సాహిత్యాల గుబాళింపులు ఉన్నాయి. తాత్త్వికచింతన ఉంది. చరిత్ర పరిచయం ఉంది. భాషా సంబంధమైన చర్చ ఉంది. సాహిత్యాల తులనాత్మక పరిశీలనం కొంత ఉంది. ఉత్తమ కవిత్వాన్ని గూర్చిన ప్రస్తావన ఉంది. అన్నిటికన్న ముఖ్యంగా ఒక బహు భాషావేత్త పలు భాషా సాహిత్యాలను గూర్చిన ప్రగాఢ పరిచయంతో చేసిన సమాలోచన ఉంది." ఇందులోని ప్రతి వ్యాసంలో గోచరించే వ్యాప్తి వైవిధ్యాలతో పాటు ముఖ్యంగా చెప్పుకోదగిన విశేషం రచయిత అలవరచుకొన్న సమన్వయ దృక్పథం. పలు భాషలతో పరిచయం ఏర్పరచుకొన్న రచయితకు ఒకే భాషలోని పలురీతుల మధ్య సమన్వయ భావం ఏర్పడటం సహజం. ఈ విషయం ఈ సంకలనంలోని మొదటి రెండు వ్యాసాలు చదవగానే స్పష్టమవుతుంది.

'నవీన వాఙ్మయం– ఎంకి పాటలు' – ఈ సంకలనంలోని మొదటి వ్యాసం. ప్రాచ్య విద్యా పారంగతులయిన వ్యాసకర్తకు సరికొత్త సరస వాఙ్మయం అంటే ఎంత అభిమానమో ఈ వ్యాసం చాటి చెపుతుంది. సామాన్య ప్రజలకు కూడా సారస్యాన్ని అందించగల ఈ పాటలలో సార్వజనీనత, సత్యానుకరణం, స్వతంత్రత లాంటి సారస్వత గుణ సంపదను సాక్షాత్కరించిన సారస్వత రసవేత్త రామకృష్ణరావు గారు. ఎంకిపాటలలోని సరస శబ్ద కల్పనం, భావ సౌకుమార్యం, ధ్వని ప్రాధాన్యం లాంటి గుణాలను కొనియాడిన రచయిత, తన రెండవ వ్యాసంలో అప్పకవి జన్మస్థానాన్ని గురించి పరిశోధనాత్మకమైన సామగ్రిని సేకరించి చక్కగా విశదీకరిస్తారు. ఈ రెండు వ్యాసాలు వ్రాసింది ఒకరేనా అని అనుమానం కలుగుతుంది. మరి రామకృష్ణరావుగారి రసదృష్టి అలాంటిది! వారు ప్రాచీనులలో ప్రాచీనులు, నవీనులకు నవీనులు. ప్రాచీన వాఙ్మయం పట్ల వారికి ఎంత గౌరవమో, నవీన రచనా ప్రక్రియలపై వారికి అంతకుమించిన అభిమానం. అంతేకాదు, సంస్కృతం, ప్రాకృతంలాంటి ప్రాచ్య భాషలపై వారికున్న మమకారం పారసీ, ఉర్దూ లాంటి భాషా సాహిత్యాలు కూడా సరిసమానంగా పంచుకున్నాయి. ఇలాంటి సమగ్ర సారస్వత వ్యక్తిత్వం ఈ శతాబ్దంలో ఎందరిలోనో కనిపించదు. ఆ కొందరిలో బూర్గులవారు ముఖ్యులు.

'కేరళీయ ముఖ్య సంస్కృత సందేశ కావ్యములు' అనే శీర్షిక క్రింద వారు వ్రాసిన వ్యాసం రామకృష్ణరావుగారి సాహితీ సంస్కృతికి ప్రబల నిదర్శనం. కేరళీయులు కాళిదాస వాగ్విలాసాన్ని ఎంతగా సొంతం చేసుకున్నారో, మేఘ సందేశంలోని శ్లోకాలు ఆత్మపద సంపదతో పాటు మలయానిల పరిశీలితులయిన కేరళకవుల వాక్కులోకి ఎలా

చొచ్చుకుపోయాయో ఈ వ్యాసం సవిస్తరంగా, సోదాహరణంగా నిరూపిస్తుంది. 'అనుకరణం ఉత్తమమయిన అభినందనం' అన్నవాదాన్ని ఈ అనువాదాలు, అనునాదాలు బలపరుస్తాయని వ్యాసకర్త పాఠకులను నమ్మిస్తారు.

'ఉమర్ ఖయ్యాంలో ఈశ్వర తత్త్వం' అందరూ సాక్షాత్కరించుకోలేరు. దానికి ప్రేమలోని పరమార్థం గ్రహించే భావసిద్ధికావాలి. ఈ వ్యాసంలో రామకృష్ణరావుగారు ఉదహరించిన పద్యాలు, అనువాదాలు ఎంతో హృద్యంగా నినదిస్తాయి. ఈ వ్యాసం చదవగానే దీని తరువాతి వ్యాసం శ్రీ రాధాకృష్ణుని భారత దర్శనం చదువుతుంటే బూర్గుల వారు వేదాంతిలా సాక్షాత్కరిస్తారు. సూఫీ నర్మద్ సారస్వత సేవను గురించి వ్యాసకర్త వ్యక్తపరచిన భావాలను, ఆ భావభంగిమను పరిశీలించి చూస్తే వారి సాహిత్య దర్శనంలోని సారస్యం స్పష్టంగా గోచరిస్తుంది.

ఈ సంకలనంలోని వ్యాసాలు 1947 ముందు వ్రాసినవి. అయినా ఈనాడు కూడా అవి సందర్భశుద్ధితో చదువుకొని ఆనందించదగినవి. ముఖ్యంగా భారతీయ సాహిత్యంలోని భారతీయతను అవగాహన చేసుకొని ఆనందించేందుకు ఈ వ్యాస సంకలనం బాగా ఉపకరిస్తుంది. సాహిత్య రంగంలో ప్రవేశం ఉన్న ప్రతి జిజ్ఞాసువూ తప్పనిసరిగా చదివి తీరవలసిన వ్యాసమంజరి ఇది. అన్ని భారతీయ భాషల్లో అనువదించదగిన వ్యాసాలు ఇందులో చాలా ఉన్నాయి. వ్యాసరచన ఎలా ఉండాలో ఈ సంకలనం చదివితే తెలుస్తుంది.

ఇంతటి అమూల్యమైన పాఠ్యం పాఠకులకు అందించిన వ్యాసకర్త కుమారుడు బూర్గుల రంగనాథరావుగారు అభినందనీయులు. తండ్రి ఋణంతో పాటు కావ్య ఋణం కూడా తీర్చుకుంటున్న ధన్యజీవులు రంగనాథరావుగారు.

# ఆలూరి ఆగమంలో బైరాగి గీతికలు

మానస యజన వాటిక పయి మాటి మాటికి ముసురుతూ మురిసిపోయే సందేహాల దేహచ్ఛాయలాగా, సహజాసుర మాయలాగా ఆధునిక తెలుగు సాహిత్యంలోకి ఆలూరి బైరాగి ఆగమనం ఒక విశిష్టమైన ఆగమాన్ని సృష్టించింది. దానిని ఆలూరి ఆగమం అనటంలో బహుశా అతిశయోక్తి లేదేమో! నిఖిల జగత్తుకు నిండుతనాన్ని చేకూర్చే నీరవ సంగీతం నిగమం అయితే అందులో నుంచి ఆవిర్భవించే సప్త స్వరాలు, పంచాశద్వర్ణ మాలికలు ఎక్కడ వినిపిస్తే అక్కడ ఆగమం కనిపిస్తుంది. వినగల చెవులకు వినిపించేది నిగమం. విన్నా వినకపోయినా వినిపించేది ఆగమం.

ఆలూరి కవితలో ఇలాంటి ఆగమ లక్షణాలు అడుగడుగునా కనిపిస్తాయి. అందుకే అతని కవిత ఒక ఆగమం అయింది. 'ఆగమగీతి' కవితా సంకలనంలో మొట్టమొదటి కవితలోనే యీ ఆగమం కనిపిస్తుంది. చిదగ్ని కుండం నుంచి ఆవిర్భవించే పరాశక్తిలాగా బ్రహ్మాండ కటాహంలో సలసల మరుగుతున్న నూతన జీవన పాకం నుంచి కవికాంక్షించిన అపరాజేయ మానవేయుడు హిమాచలంవంటి దీక్షతో, నయాగరా లాంటి కరుణతో, శరదాకాశం లాంటి సారళ్యంతో, గంగాజలం లాంటి తారళ్యంతో, నిప్పులాంటి నైర్మల్యంతో, పిల్లల వంటి తెల్లని మనస్సుతో కమ్మని కలలాగ కనుచూపు మేరలో కనిపిస్తాడు. ప్రపంచంలోని విషసారాన్ని ఆరగించి, నిత్యం శూలాగ్రం మీద నిశ్చింతగా శయనించే అనల సంభవుడు, ఆత్మధవుడు, నవమానవుడు 'వస్తున్నా దొస్తున్నా దరుదెంచక తప్పదతడు' అని కవికంఠం ఘంటాపథంగా ఘోషిస్తుంది. బైరాగి గీతికలో ఆత్మీయంగా అప్యాయంగా వినిపించేయీ – ఆగమ సంగీతం వింటుంటే ఒకవైపు 'వినిపించెనో లేదో వినుడతని పదరవము. విచ్చేసె విచ్చేసె విచ్చేసె నా సామి' అని వినవలసిన నిస్వనాలను వినలేని వీనులకు విందుగా విలక్షణమయిన ఆగమగీతిని వినిపించే రవీంద్రుని 'గీతాంజలి' గుర్తుకు వస్తుంది, మరోవైపు వాక్కును మనస్సులో, మనస్సును వాక్కులో లయింపజేసి అవాఙ్మానస గోచరమయిన ఆత్మ ఆవిర్భవించటం సర్వాత్మనా భావించి అనుభవించవలసిందని ఆదేశించే ఆర్షవాణి వినిపిస్తుంది. ఆలూరి ఆగమం ఉపనిషన్మహాషర్షుల ఉపదేశానికీ, రవిలాంటి కవి పుంగవులు ప్రసరింపజేసిన సందేశానికీ దేశకాల పరిస్థితులననుసరించి యీ దేశంలో ఈకాలంలో ఆత్మగతిని అనునయించి నినదించే ఆర్తగీతి.

మనిషికి మమతలోని మాధుర్యం అందించవలసిన ప్రేమ తామరాకుమీది నీటి బిందువులాగా జారిపోయే ఈ రోజుల్లో, మనిషిలోని ఆస్థ మధ్యాహ్నపు మంచులా కరిగిపోయే యీ క్షణాల్లో, క్షయతో బాధపడే ఆశలు నెత్తురు కక్కి బక్క చిక్కిన యీ పాడు సమయంలో కుళ్ళిపోయిన ఆత్మ కూటి కోసం గుళ్ళల్లోని గుండ్లకు మ్రొక్కే యీ దర్దనాలలో కుష్ఠుగోరిని కౌగిలించుకొని ఆరిపోతున్న ఆర్తహృదయాలలో ఆరతి వెలిగించగలిగిన వివేకి ఎవరని కవి తనను తాను ప్రశ్నించుకొని తనకు తానే సమాధానం చెప్పుకుంటాడు. ఆ ప్రయోజకుడి కోసమే యుగయుగాల నుంచి యీ ధరణి వేచి వున్నదని వ్యోమమార్గంలో తోకచుక్కలను వెలిగించుకొని కాలాన్ని గాలించి చూచే రసద్రష్ట గమనిస్తాడు.

తన కవిత్వ తత్వాన్ని 'నేతి నేతి" తీరులో వివరిస్తూ జీవన సభా భవన ప్రాంగణాల ఆకు కట్టిన తోరణాలూ, దూరంగా కడలి హోరులా వినిపించే ఖర సంతతి చేసే కరతాళ ధ్వనులు, పూలమాలలు, సత్కారాలు, సన్మానాలు, జరీ అంచుల శాలువాలు, చందన తాంబూలాలు – 'ఇవన్నీ నావికావు, నేను మీ కవిని కాదు' అని లోకంలోని శోకంలో నా కాన్ని దర్శించగల కవిగాని కవి అంటాడు. సుషమా విషమ వారధిలో దీవిని వెదుక్కునే నావికుడిలాగ కవిత కోసం చెవి కోసుకునే శ్రోతలకు 'మీరు వెదకే కవి ఇక్కడ లేదు, అసలు అతడు ఇతడు కాదు' అని నిర్మోహమాటంగా చెప్తాడు. తరతరాల దుర్భర తర జీవిత బాధావధిని భగ్గున వెలిగించే జ్వాలాక్షణాలతో తన గీతం తాను వ్రాసుకునే అరచిత కవితా రచయిత, ప్రపంచాన్ని అసంపూర్ణంగా సంకీర్ణంగా, విశీర్ణంగా, వికృతంగా రచించిన వృద్ధ విరించి కంటే తానే మిన్న అని ఒక్కొక్కప్పుడు తన తత్వాన్ని అర్థం చేసుకున్న తాత్విక కవి తనలో తాను మురిసిపోతాడు. అసలు ఆలూరి అనుకున్నట్టు ఆయన వ్రాసిన కవితల కన్నా వ్రాయదలచి వ్రాయనివే అందమయిన రచనలు కావచ్చుననిపిస్తుంది. నిజానికి కవిత వ్రాసేది కాదు, చెప్పేది.

బైరాగి కవిత తొలిసారి చదవగానే అందులో ఒకవిధమైన నైరాశ్యం, ఆక్రోశం, ఆరాటం, ఆక్రందనం కనిపిస్తుంది. అప్పుడప్పుడు కవి పలాయన వాదిగా కూడా కనిపిస్తాడు. కాని ఈ పలాయనం జీవితం నుంచి కాదు, జలగల విశ్వాసం నుంచి, రాబందుల ఆశ్వాసం నుంచి, తోడేళ్ళ జాలి నుంచి, మొసళ్ళ కన్నీళ్ళ నుంచి, నక్క వినయాల నుంచి, కొంగ జపాల నుంచి. వీటన్నిటి నుంచి పారిపోవాలనే కవి ప్రయత్నిస్తాడు. తన శ్రోతలను ప్రేరేపిస్తాడు. కాని ఎక్కడికి పోదామనేది సమస్య. ఎక్కడికయినా సరే, పేరుకొన్న నెత్తుటితో నల్లబడిన బ్రహ్మాండపు కోట దాటి అదృష్టం గీసిన గిరి దాటి పోదామని తోటి మానవుణ్ణి తొందర చేస్తాడు పాటను మరిపించే బాటసారి.

బైరాగి గీతాల్లో వైరాగ్యమే కాని అనురాగం కనిపించదనీ, ఆక్రోశమే కాని ఆహ్లాదం మృగ్యమనీ సామాన్యపాఠకులకు అనిపించక తప్పదు. ఉన్నట్టుండి మల్లెపూల మీద మమకారం పెంచుకున్న కవి మధుర భావాలకు మధురాక్షరాలు కూర్చిన 'మల్లెపూల' మధురగాథ వింటుంటే ఆశ్చర్యం వేస్తుంది. మట్టిలోంచి పుట్టుకొచ్చిన మల్లెపూలు, మనుషుల్లా మాట్లాడే మల్లెపూలు, మన హృదయాలలో మరుగుపడిన కథలను విప్పి చెప్తాయట. ఒంటరితనాన్ని ఒంటరి చేసేందుకు మల్లెపూలను మించిన మరో సాధనం లేదట. బల్ల మీద మల్లెదండ బాగానే వుంది గాని పక్కనే పొగ గక్కే సిగరెట్టుముక్క కొంచెం రసాభాసంగా కనిపిస్తుంది. కాని సత్యాన్నీ - స్వప్నాన్నీ, పరాన్నీ - అపరాన్నీ, భావాన్నీ - ఊహనూ, సౌకుమార్యాన్నీ - శక్తినీ, మోహాన్నీ - ముక్తినీ, చావునూ - బ్రతుకునూ మేళవింపజేసే మల్లెపూలు నిష్క్రియ చైతన్యంలో అన్ని క్రియలనూ లీనం చేస్తాయి.

మల్లెపూలలో ఇంత మాధుర్యాన్నీ మమకారాన్నీ దర్శించే ద్రష్ట హోటల్లో బల్లదగ్గర చిల్లరకోసం తొండమొక్కటే తక్కువగా వినాయకుడిలాగా కూర్చున్న యజమాని, వాకిట్లో అడుక్కునే బిచ్చగాళ్ళను కసురుతుంటే సహించలేడు. "అదృష్టపు లంజకొడుక"ని అతన్ని అసహ్యించుకుంటాడు. అలాగే అమాత్యుని అకాల మరణానికి దేశమంతా సందేశాలతో సంతాపాలతో, ప్రదర్శనాలతో సతమతమవుతుంటే కవికి అతగాడావిష్కరించిన ఎలుక కన్నాలు మాత్రమే కనిపిస్తాయి. ఆయన పడుచు కార్యదర్శిని సంతాపం కూడా కవి చెవులకు మాత్రమే సోకుతుంది. కొడుకు చదువు, మేనల్లుడి ఉద్యోగం, బంధుమిత్ర ప్రముఖులకు లైసెన్సులు, పర్మిట్లు, ఎందుకో తలపు కొచ్చే సుందరవదనార విందాలు, కార్యదర్శినీ వక్షోజకందుక క్రీడలోని ఆనందాలు - అన్నింటినీ మరచిపోయిన చటుక్కున చనిపోయిన అమాత్యుని సమాధి పురుగుల పురిటి గదిగా కనిపిస్తుంది కవికి. అమాత్యుడు కూడా శీతల సమాధిలో నిద్రపట్టక పొరలుతూ దొరలుతూ ఎదురు తిరిగి ప్రశ్నించిన జీవితానికి సమాధానం దొరక్క ఆవేదన పడుతూ ఉంటాడు. అతను మూలుగుతూ ఉంటే అతని ఆత్మ నసుగుతూ ఉంది. ఇలాంటి జీవితం నుంచే కవి కోరే పలాయనం. ఇలాంటి కుళ్ళును కడిగివేయాలనే కవి ఆరాటం.

కవి మనస్సులో ప్రపంచం పట్ల ఎంత ఆక్రోశం ఉన్నా కవికి అధైర్యం అనేది లేదు. అంతులేని ఆశావాదంతో అతను కొండలు పిండి కొట్టేస్తానంటాడు. చితికిన టొమాటో లాంటి సూర్యుణ్ణి, ఆరిన అప్పడం లాంటి చంద్రుణ్ణి అకాశపు ఎంగిలిపళ్ళెంలోంచి నెట్టేస్తానంటాడు. తనదయిన బాహుబంధనంలోకి ఈ విశాల బ్రహ్మాండాన్ని చాపలా చుట్టి వేస్తానంటాడు. నిస్సహాయ మానవేయుని నొసటి వ్రాలు ఒక్క కలంపోటుతో కొట్టేస్తానంటాడు. జీవిత సభా భవన ద్వారం నుంచి అన్యాయాన్ని, అక్రమాన్ని మెడబట్టి గెంటేస్తానంటాడు.

ఇంకా ఎన్నో ఎన్నెన్నో చేసేస్తానంటాడు. కాస్త నమ్మకం దొరికితే ఎంతటి దుస్సాధ్యమయిన పనినయినా సాధించగలనంటాడు.

ఈ నమ్మకమే బైరాగి గీతికకు పునాది. ఈ విశ్వాసమే అతని కవితకు ఊపిరిపోసి ఉచ్ఛ్వాస నిశ్వాసాలను కల్పిస్తుంది. ఈ విశ్వాస్వాన్ని పురస్కరించుకొనే అతను 'నాకు చావులేదని' ధీమాగా చెప్తాడు. తనకే కాదు, ఏ మానవుడికి కూడా మృత్యువనేది లేదని కవి నమ్మకం. ప్రాణదాత, పుణ్యధాత్రి, కనక గర్భ ప్రసవించిన ప్రతి మానవుడూ మృత్యుంజయుడే. వేదనాగ్ని సంభవుడయిన ప్రతి మానవుడూ భవుడే. నిద్రలో నిత్యం మృత్యువును పలకరించుకొని ప్రతిదినం నిత్య పునర్నవాన్ని పొందే జీవితాన్ని అనుభవించే మానవుడికి చావు లేదని కవి సిద్ధాంతం. కనుకనే బ్రహ్మాండపు పురిటిగదిలో కెవ్వుమనే పసి ఏడుపు వినిపించేంతవరకు, ప్రణయమహావాహినులు ప్రియసాగర పరిణయానికి పరుగులిడినంత వరకు 'తనకు చావు లేదని' తపస్విలాగా మనస్వి పలుకుతుంటే మృత్యుదేవత సన్నిధిలో 'జీవిష్యా మే యావదీశిష్యసిత్వం' అని చిరునవ్వు సందులో చిరంతన సత్యాన్ని పలికిన నచికేతుడు గుర్తుకు వస్తాడు. ప్రతి మానవుడూ మృత్యుంజయుడయినప్పుడు అమరవాణిని వెలయించిన ఆలూరి కూడా మృత్యుంజయుడే అని భావించడంలో అతిశయోక్తి లేదు.

ఆలూరి కవితలో అక్కడక్కడా తెలుగు చెవులకు కొంత వింతగా తోచే పదాలు, సమాసాలు కనిపిస్తాయని ఒక పర్యాయం బెజవాడ గోపాలరెడ్డి గారు అన్నారు. ఈమాట వారు ఢిల్లీలో సభాముఖంలో నన్ను చూచి అనటం వల్ల దానికి నేను సమాధానం చెప్పుకోవలసి వచ్చింది. ఆలూరి తెలుగులో కేవలం తెలుగే కాదు, హిందీ, బెంగాలీ, ఇంగ్లీషు, తమిళం – ఇంకా ఎన్నెన్నో భాషలు తొంగి చూస్తూ ఉంటాయి. అనేక భాషలతో సన్నిహితమయిన పరిచయం ఉండటమే కాక హిందీలో హిందీ కవుల మన్ననలు పొందగలిగిన కలకాలం నిలవగల కవిత కూడా చెప్పిన ఉభయ కవి మిత్రుడు బైరాగి. కాని ఇలాంటి సవ్యసాచులకు ఒక ఇబ్బంది కూడా ఉంది. తెలుగువారికి హిందీవాడయి, హిందీయులకు 'అహిందీ' వాడయిపోయే ప్రమాదం కూడా లేకపోలేదు. లేకుంటే ఆలూరి హిందీలో వ్రాసిన 'పలాయన్' అనే కవితా సంకలనానికే జాతీయ స్థాయిలో ఏనాడో గుర్తింపు రావలసింది. హిందీ రంగంలో ప్రవేశించకపోతే ఇలాంటి 'ఆగమ గీతికలు' అనేకంగా తెలుగు రంగాన్ని అలంకరించేవి. కాని అనేక భాషలలో ఏకకంఠంతో పలుకుతున్న భారత భారతిని భారతీయ భావనతో సేవించే భావ సమైక్య సమారాధకులు కూడా చాలా అవసరం. అలాంటి ధన్యజీవులలో ఆలూరి బైరాగి ఒకరు.

# ఆధునిక హిందీ సాహిత్యవికాసము

'ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచు పోలిక' వేరువేరుగా చూస్తే వేరు వేరుగా కనిపించే మన భారతీయ భాషల్లో అంతర్లీనంగా నిరంతరం సమాంతరంగా సంచరించే సారస్వత జీవధార స్పష్టంగా గోచరిస్తుంది. భాషలు వేరయినా భావం ఒకటే అనిపిస్తుంది. దాదాపు వెయ్యి సంవత్సరాల క్రితం తెలుగునాట భారత సంహిత అవతరించిన సమయంలోనే హిందీలో చంద్‌బర్‌దాయీ లాంటి కవుల నోట 'రాసో' కావ్యమాధురి వెలువడింది. ఇక్కడ వీరశైవ వాఙ్మయం, అక్కడ వీరగాథాలహరి దాదాపు ఒకే సమయంలో ప్రసరించాయి. ఆ తర్వాత రామభద్రుడు పలికించిన భాగవతం పోతన నోట పలికిన సమయంలోనే సరయూతీరంలో తులసీ తరువు గుబాళించింది. యమునా తీరంలో సూరదాసు తన చిన్ని కన్నయ్యతో కాలక్షేపం చేశాడు. తెలుగు వెలుగు దక్షిణ దేశంలో శృంగారవాటికలో విహరించిన సమయంలోనే బిహారీ కవి రాధాకృష్ణుల మధుర భావ భంగిమలను ఏడువందల పద్యాల్లో హృద్యంగా వివరించి తరించాడు. అలాగే గత శతాబ్దం చివరి భాగంలో గోదావరి వీరేశలింగాన్ని ప్రసవిస్తే, భాగీరథి భారతేందు హరిశ్చంద్రను వెలయించింది. ఇలా నాటి నుంచి నేటివరకు హిందీ సాహిత్యం తెలుగు సారస్వతంలాగానే చిత్ర విచిత్రమైన పద సంపదను సాక్షాత్కరించుకుంటూ సారస్వత జీవులకు సంజీవనిని ప్రసాదిస్తూ వస్తున్నది.

ఆధునిక హిందీ సాహిత్యం ఒక విధంగా ఈ శతాబ్దంతోనే ఆరంభమయిందని చెప్పాలి. ఈనాడు మనం హిందీ పేరిట వ్యవహరించే 'ఖడీబోలీ' అనే భాషలో కావ్యరచన ఈ శతాబ్దం తొలి సంజలోనే ఆరంభమయింది. ఈ భాషలో గద్య పద్యరచనకు నాంది పలికి నారు పోసింది 'సరస్వతి' అనే మాసపత్రిక. 1903లో మహావీర్ ప్రసాద్ ద్వివేదీ ఈ పత్రికను చేపట్టారు. తాను స్వయంగా ఎక్కువ వ్రాయకపోయినా, ఇతరుల చేత చక్కని రచనలు రూపొందింపచేసిన ద్వివేదీ ఆధునిక హిందీ సాహిత్యానికి ఆధార పురుషుడు. హిందీలో మొదటి జాతీయకవిగా ప్రఖ్యాతి వహించిన మైథిలీశరణ్‌గుప్త కావ్యసంతతిలో వాడే. అంతకుముందు వ్రజభాషలో, అవధీలో కావ్యరచన జరిగేది. కాని పదిమంది మాట్లాడుకునే ఖడీబోలీలో – అంటే ఆధునిక హిందీలో – కావ్యరచన లేకపోవడం చాలా కొరతగా వుండేది. ఈ కొరతను ద్వివేదీ ప్రోత్సాహంతో అనేక కవులు తీర్చారు. వీరిలో ప్రముఖులు మైథిలీశరణ్ గుప్త.

గుప్త గారి 'సాకేత్' హిందీలో దాదాపు మొదటి ఆధునిక కావ్యం అనవచ్చు. అంతకుముందు అయోధ్యాసింహ్ ఉపాధ్యాయ్ వ్రాసిన 'ప్రియప్రవాస్' సామాన్యంగా ప్రథమ ఖడీబోలీ కావ్యంగా పరిగణింపబడుతుంది. మొత్తంమీద ఈ రెండు కావ్యాలూ ఆధునిక సాహిత్యంలో 'సిరి' 'చుక్క'లాంటివని చెప్పుకోవచ్చు. మరో చమత్కారం ఏమంటే, ప్రియప్రవాస్ కృష్ణ కావ్యం, సాకేత్ రామకావ్యం. అనుకోకుండా ఆధునిక హిందీ కావ్యరచన రామకృష్ణ కథాగానంతో ఆరంభించటం ఆనందించవలసిన విషయం. ఈ రెండు కావ్యాల ఛాయల్లో ఎన్నో కావ్యాలు ఆ రోజుల్లో వెలిశాయి. కాని అవి చాలా వరకు ప్రతిధ్వనులు.

ఈ ధ్వనులకూ, ఛాయలకూ అతీతంగా, ఏకాంతంగా, ప్రశాంతంగా, స్వంతంగా మరో మహాధ్వని 1914 ప్రాంతంలో కాశీలో వినవచ్చింది. విశ్వేశ్వరుని సన్నిధిలో జయశంకర్ ప్రసాద్ అనే మహాకవి యీ మహాస్వనం వినిపించాడు. ద్వివేదీ యుగం ముగిసింది. ప్రసాద్ యుగం అవతరించింది. జయశంకరుడు అణువణువునా కావ్యామృతాన్ని నింపుకున్న మృత్యుంజయుడు. తులసీరామాయణం తర్వాత హిందీ సాహిత్యంలో కలకాలం నిలబడగల కావ్యం 'కామాయని' ఈ కవి కంఠం నుండే వెలువడింది. రామకథ పలికినా, కామసుధ చిలికినా యుగద్రష్టలు యుగసృష్టినే చేస్తారు. అలాంటి యుగదృష్టినీ, యుగసృష్టినీ విప్పిచెప్పే కావ్యం కామాయని. స్త్రీ పురుషుల సహజ సాత్త్విక సంసార వాసనలను పురస్కరించుకొని ఆవేదన నుండి ఆనందం వరకు పయనించే మానవ మనోవీచికలకు ఈ కావ్యశిల్పం చక్కని రసతల్పం సమకూర్చింది. కావ్యరంగంలోనే కాక కథారంగంలో, నాటకరంగంలో కూడా తనకు తానే సాటి అనిపించుకున్న జయశంకర వాగ్విభూతి ఆధునిక హిందీ కవితకు ఒక అనుభూతిని ప్రసాదించింది.

ఈ కవితోనే హిందీలో ఛాయావాదం కూడా అవతరించింది. తెలుగులో భావ కవిత్వంలాగా, హిందీలో ఛాయావాదం దాదాపు మూడు దశాబ్దాల పాటు మంచి మంచి కావ్యాలను వెలయించింది. మొట్టమొదట ప్రసాద్ వ్రాసిన ఛాయావాద రచనలు చదివి కొందరు ముఖం చిట్లించుకున్నారు. కొందరు హర్షించారు. కొందరు తీవ్రంగా విమర్శించారు. మరి కొందరు మహాకవి అడుగుజాడల్లో నడిచారు. సుప్రసిద్ధ కవులు సుమిత్రానందన్ పంత్, సూర్యకాంత్ త్రిపాఠీ నిరాలా, మహాదేవీ వర్మ ఈ వాదానికి అనువాదకులే. కాని ఈ నలుగురిలో ఎవరి నాదం వారిది. ప్రసాద్ బ్రహ్మర్షి, పంత్ శబ్దర్షి, నిరాలా నిరంజన రాజయోగి. మహాదేవి మహర్షిలాంటి మహిషి. ఎవరిదారి వారిది. ఎవరి తీరు వారిది. కాని నలుగురూ నాలుగు స్తంభాలుగా నిలిచి హిందీకి ఒక నవీన కావ్యమండపం సమకూర్చారు. భారతీయ జ్ఞానపీఠ్ బహుమతి పొందిన మొదటి హిందీ కవి సుమిత్రానందన్ పంత్. చిదంబర

అనే కావ్య సంకలనానికి ఈ బహుమతి లభించింది. ఇటీవల లోకాయతన్ అనే మహాకావ్యం కూడా ఈయన వ్రాశారు.

ఈ ఛాయావాద కవుల్లోనే అక్కడక్కడ రహస్య వాదచ్ఛాయలు కూడా కనిపించడం వల్ల వీరినే రహస్యవాద కవులని కూడా వ్యవహరించటం జరిగింది. కాని కబీరు తరువాత కావ్య సమ్మతమైన రహస్యవాదం తిరిగి కామాయనిలోనే కనిపిస్తుంది. ఇంతలో స్వాతంత్ర్య సంగ్రామం తీవ్రరూపం ధరించింది. ఈ ఛాయలతో, రహస్యాలతో జాతి ముందుకు సాగలేదని అభ్యుదయ దృక్పథంగల కవి పుంగవులు గమనించారు. రామధారీసింహ్ దినకర్, మాఖన్‌లాల్ చతుర్వేదీ, బాలకృష్ణశర్మా నవీన్‌లాంటి కవులు దేశభక్తిని కావ్యవస్తువుగా స్వీకరించి పోషించారు. దీనితో ప్రగతివాదం ఆరంభమయింది. దినకర్ రచించిన కురుక్షేత్ర మహాకావ్యం ఈ యుగం సాధించిన ప్రగతి గీత. ఒకవైపు హిమాగ్ర శిఖరం నుండి సమర శంఖారావం పూరిస్తూనే మరోవైపు ఊర్వశి రూపలావణ్యాన్ని కావ్యరూపంలో చూచుకోగలిగిన దిట్ట దినకర్. అది ఆనాటి యుగధర్మం.

కాని ప్రగతి వాదం కూడా ప్రజలకు తృప్తిని కలిగించలేకపోయింది. స్వరాజ్యం లభించింది. కాని సురాజ్యం రాలేదు. ఏకనాదంగా పలికే కవితావాదాలతో ప్రయోజనం లేదని అజ్ఞేయ అనే కవి ఆధ్వర్యంలో యువకవులు కొత్త ప్రయోగాన్ని ప్రారంభించారు. ఇదే తర్వాత ప్రయోగ వాదంగా ప్రసిద్ధి పొందింది. తార్ సప్తక్ అనే పేరిట మూడు కవితా సంకలనాలు ఈ ధోరణిలో వచ్చాయి. పాశ్చాత్య దేశాల్లో ప్రచారంలో వున్న కవితా ధోరణులు వీరి కవితల్లో కనిపిస్తాయి. అంతకుముందు శాస్త్రీయమైన కవిత వ్రాసే కవులు కూడా ఈ నవ కవితను అభిమానంతో చూచారు. భవానీ ప్రసాద్ మిశ్ర, ప్రభాకర్ మాచ్వే, గిరిజా కుమార్ మాధుర్ లాంటి కవులు ఈ నయీ కవితకు ప్రశస్తమైన మార్గం చూపించారు. దిగంబర కవిత్వం కూడా 'అకవిత' అనే పేరిట ప్రచారంలోకి వచ్చింది. దినకర్ లాంటి పెద్దలు కూడా చివర చివర 'హారే కో హరి రామ్' లాంటి రచనల్లో అకవితను స్పృశించారు. కాని యీ నాడు ధర్మవీర్ భారతి, నాగార్జున్, సర్వేశ్వర్ దయాల్ సక్సేనా, రఘువీర్ సహాయ్ లాంటి కవులు యుగధర్మాన్ని ప్రతిబింబింపచేసే కవిత వ్రాస్తున్నారు. ఛందస్సును స్వచ్ఛందంగా వాడుకుంటూ, సామాన్యులు మాట్లాడుకొనే వాడుక భాషలో కవిత్వం వ్రాయటం వల్ల ఈనాడు ప్రజలకు కవిత్వంలో ప్రవేశం లభించింది. కవిత్వం కథగా మారుతున్నది. కథ కవితకు దగ్గరగా వస్తున్నది.

హిందీ కథానిక కూడా ఈ శతాబ్దంలో ఆరంభమయింది. 1915లో చంద్రధర్‌శర్మా గులేరీ వ్రాసిన ఉస్‌నే కహా థా అనే కథ నాటికీ నేటికీ హిందీ కథా సాహిత్యంలో

నాటుకుపోయింది. దాదాపు అదే సమయంలో ప్రేమచంద్ కథారంగంలో ప్రవేశించటం జరిగింది. ఆనాటి సంఘంలో వేరు వేరు వర్గాలకు మధ్య ఉన్న వైషమ్యాలను, సమస్యలను కండ్లకు కట్టినట్లు చిత్రించటమే కాక మరపురాని పాత్రలను సృష్టించిన యీ యుగద్రష్టను ఉపన్యాస్ సమ్రాట్ (నవలా చక్రవర్తి) యని కీర్తించటంలో ఆశ్చర్యంలేదు. జయశంకర్ ప్రసాద్ కూడా ప్రేమచంద్ సమకాలికుడే. ఇద్దరూ కాశీ నివాసులే. ఒకే చోట ఒకే కాలంలో ఒకే సారస్వత ప్రక్రియను ఇద్దరు ప్రముఖ రచయితలు వేరువేరుగా నిరూపించటం సారస్వత పరిశోధకులకు చక్కగా ఉపకరించే విషయం. ఇద్దరూ కథలు వ్రాశారు. ఒకరు సంఘ జీవితాన్ని సంస్కరిస్తే మరొకరు సాంస్కృతిక చైతన్యాన్ని సంఘానికి ప్రసాదించారు.

ప్రేమచందుకు వారసుడు జైనేంద్రకుమార్. జైనేంద్ర ముఖ్యంగా మనస్తత్త్వవేత్త. దాదాపు వందకథలు, అనేక నవలలు వ్రాసిన జైనేంద్ర ఈనాటి కథా రచయితలకు ఋషిలాంటివాడు. త్యాగం, సంయమం, అహింస – వీరి రచనల్లో ప్రాణవాయువులా కనిపిస్తాయి. దీనికి భిన్నంగా రచనలు సాగించిన యశ్‌పాల్ కథల్లో బాధితుల పట్ల తీవ్రమైన సహానుభూతి కనిపిస్తుంది. 'దుఃఖ్ కా అధికార్' అనే కథలో దిగులు పడేందుకు కూడా అధికారం లేని దీనుల దైన్యాన్ని రచయిత హృదయవిదారకంగా వర్ణిస్తాడు. అజ్ఞేయకథల్లో ఆశానిరాశలు ఆలోచనాలోచనాలతో దాగుడుమూతలాడుతున్నట్టు తోస్తుంది.

స్వాతంత్ర్యం తర్వాత నయీ కవిత లాగానే నయీ కహానీ, సమాంతర కహానీ, ఆంచలిక్ కహానీ లాంటి నవీన ప్రక్రియలు రూపొందాయి. రాంగేయ్ రాఘవ్, ఫణీశ్వర్‌నాథ్ రేణు, భీష్మ సాహానీ, ఉషా ప్రియంవద, మన్నూ భండారీ, రాజేంద్ర యాదవ్ ఈనాటి కథా రచయితల్లో చెప్పుకోదగ్గవారు.

సామాన్యంగా కథారంగంలో కృషిచేసిన వారే నవలల్ని కూడా చేపట్టారు. ప్రేమచందుకు ముందు హిందీలో చెప్పుకోదగ్గ నవలలు లేవు. 1915 నుండి దాదాపు ఇరవై సంవత్సరాల పాటు ప్రేమచంద్ యుగం సాగింది. సామాన్య జనజీవితంతో ఇంతటి సన్నిహితసంబంధం సాధించగల మరో రచయిత హిందీలోనే కాదు, మరో భారతీయ భాషలో కూడా అరుదే. ప్రేమచంద్ తర్వాత జైనేంద్ర చెప్పుకోదగిన నవలా రచయిత. 'త్యాగపత్ర' నుండి 'సుఖదా' వరకు జ్ఞానేంద్ర నవలా సాహిత్యం మనిషిలోని మనీషిని పలు వన్నెలతో చిత్రిస్తుంది. వృందావన్‌లాల్ వర్మా చారిత్రిక నవలలు వ్రాయటంలో ప్రఖ్యాతి వహించారు. సంఘంలోని కల్మషాన్ని కడిగేందుకు యశ్‌పాల్ లాంటి రచయితలు పూనుకున్నారు. యశ్‌పాల్ రచనలు సంఘానికి ప్రాధాన్యం ఇస్తే, జైనేంద్ర రచనలు వ్యక్తికీ, వ్యక్తి మనస్తత్వానికి ప్రాధాన్యత ఇస్తాయి. అమృత్‌లాల్ నాగర్ ఈ రెంటిని సమీకరిస్తూ చక్కని నవలలు వ్రాశారు. 'బూంద్

ఔర్ సముద్ర' అనే నవల దీనికి నిదర్శనం. బిందువులాంటి వ్యక్తిని సింధువు లాంటి సమాజంతో జతపరచి నవ నాగరికతలో నలిగిపోతున్న నరజీవిత యథార్థాన్ని యథాతథంగా చిత్రిస్తుంది ఈ నవల. ఇలాగే నాగార్జున్, విష్ణు ప్రభాకర్ లాంటి మేధావులు సంఘ సంస్కరణకు సహకరించే చక్కని నవలలు వ్రాశారు. ఇటీవల వచ్చిన హిందీ నవలల్లో చెప్పుకొనదగ్గది - భగవతీచరణ్‌వర్మ వ్రాసిన 'భూలేబిసరేచిత్ర' ఇందులో మూడు తరాల కథ ఎన్నో మలుపులతో, మెలకువతో చెప్పబడింది. ఫణీశ్వర్‌నాథ్‌రేణు వ్రాసిన 'మైలా అంచల్' మలినాంచలం కూడా ప్రసిద్ధికెక్కిన నవల. మక్కువముక్కోణాలను చిత్రించే మామూలు నవలలు కూడా ఈమధ్య చాలా వచ్చాయి. కాని అవి కాలక్షేపానికి మాత్రమే పనికి వస్తున్నాయి. నవయుగ రాగాన్ని వినిపించగలిగిన నవలారాజం కోసం హిందీ సాహిత్యం బహుశా ఇంకా ఎదురుచూస్తూనే ఉంది.

నవలల్లాగ నాటక సాహిత్యం కూడా దాదాపు ఒక శతాబ్దం నుంచి వికసిస్తూ వస్తున్నది. భారతేందు హరిశ్చంద్రతో ప్రారంభించిన నాటక సాహిత్యం జయశంకర్ ప్రసాద్ ప్రోత్సాహంతో చారిత్రక ప్రాశస్త్యాన్ని పొంది, లక్ష్మీనారాయణ్ మిశ్ర లాంటి లాక్షణికుల చేతుల్లో చిన్న చిన్న చిక్కులను విడదీసుకుని, రామకుమార్ వర్మ, వృందావన్‌లాల్ వర్మ, ఉదయశంకర్ భట్ లాంటి ఉద్భటుల రచనాశిల్పంలో క్రొంగ్రొత్త పోకడలను రుచిచూచి, జగదీశ్‌చంద్ర మాథుర్‌తో కలిసి కోణార్కను దర్శించి, మోహన్‌రాకేశ్‌తో చేరి ఆషాఢ రస వాసరాల వాసనలను పీల్చుకుని, చంద్రగుప్త విద్యాలంకార్, నరేశ్ మెహతా లాంటి అధునాతనుల ఆదరాభిమానాలను పొందుతూ వుంది. నాటక సాహిత్యానికి సంబంధించిన నవీన ప్రక్రియలు కూడా హిందీలో బాగా వృద్ధి పొందుతూ వున్నాయి.

వ్యాసరచన, సమీక్ష, పరిశోధన – ఈ మూడు రంగాల్లో కూడా హిందీ సారస్వతం పురోగమిస్తూనే వుంది. ఆచార్య రామచంద్ర శుక్లతో ప్రారంభమయిన సమీక్షా పద్ధతి హజారీప్రసాద్ ద్వివేదీ, నామ్‌వర్‌సింహ్, వినయమోహన్‌శర్మ మొదలయిన విమర్శకుల చేతుల్లో పరిపూర్ణమైన పరిణతి పొందిందనే చెప్పవచ్చు. ద్వివేదీ వ్రాసిన బాణభట్‌కీ ఆత్మకథా ఆధునిక హిందీ గద్యానికి అమూల్యమైన అలంకారం.

ఇలా దాదాపు వంద సంవత్సరాల నుంచి ఆధునిక హిందీ సాహిత్యం శాఖోపశాఖలుగా విస్తరించి భారత భారతికి ప్రశస్తమైన వాగ్విలాసాన్ని సమకూర్చుతూ వుంది. కాని హిందీ అన్ని భారతీయ భాషలవలె కేవలం ఒక ప్రాంతీయ భాష కాదు. అఖిల భారత జాతీయతను ప్రతిబింబింపచేయవలసిన బాధ్యత మన రాజ్యాంగం ఈ భాషకు అప్పగించింది. వేరు వేరు భాషల్లో, సారస్వతాల్లో ప్రతిబింబించే జాతి మానసాన్ని సమీకరించి, సమగ్రమైన సామాజిక సంస్కృతిని సాధించగల సారస్వతం హిందీలో ఇక ముందు రావాలి. ఇది సామాన్య మైన

పని కాదు. ఈ బాధ్యత పూర్తిగా హిందీ రచయితలు గుర్తించాలి. వారికి అందరి సహకారం లభించాలి. హిందీ సాహిత్యం ఇక ముందు ఒక ప్రాంతానికి పరిమితమై ఉండకూడదు. దేశం నలుమూలల నుండి యీ జాతీయ భారతి వికసించాలి. తన మాతృభాషతో పాటు తన జాతికి ప్రతీకమైన జాతి భారతిని కూడా సర్వభాషా సరస్వతిగా భావించి సేవించే సౌహార్దం, సామర్థ్యం భరత సంతతికి చేకూరాలి. ఇలా వర్ధిల్లుతున్న అభినవ భారతిని అభిమానించి ఆనందించే ఔదార్యం, ఆప్యాయం హిందీ భాషీయులు అలవరచుకోవాలి. నిజానికి హిందీని ఒక భాషగా భావించటం భావ్యం కాదు. రంగు రంగుల ఇంద్ర ధనస్సులో అన్ని వన్నెలు కలిసి సర్వ వర్ణ సమన్వయాన్ని సాధించినట్టుగా వేరు వేరు వాక్కులలోఒకే భావాన్ని భాసింపజేసే భావ భారతిగా ఈ భాషను మలుచుకోవాలి. అలా రూపొందిన భావ భారతి అన్ని విధాల సార్థకమైన భావి భారతి అనిపించు కోగలుగుతుంది. అదే భారత భారతి సాధించవలసిన భారతీయత.

# జాతీయకవి - దినకర్

కవి శబ్దానికి గల వాగర్థ ప్రతిపత్తిని పూర్తిగా అవగాహనం చేసికొన్నప్పుడు అలాంటి ప్రతిపత్తిని పొందిన కవులను మళ్ళీ పరిభాషించి ఒకరిని జాతీయ కవి అనీ, మరొకరిని మహాకవి అనీ ఇంకొకరిని ఇంకోరకం కవి అనీ చెప్పడం అంత భాష్యంగా తోచదు. కాని కవులలో రెండు తెగలు మాత్రం స్పష్టంగా గోచరిస్తాయి. ఆత్మానుభూతినే ఆధారం చేసికొని ఆత్మనిరతినే తమ కావ్యానికి చరమ పరిణతిగా భావించి సాధించే వారు కొందరు, వీరి సాధన అంతర్ముఖంగా ఉంటుంది. వీరిది వ్యక్తి నిష్ఠమైన కవిత. మరికొందరు ఆత్మానుభూతిని విస్తరించుకొని సమస్త సృష్టిలో సాధ్యమైనంత వరకు సర్వాత్మకమైన ఆనందాన్ని అందుకొని అందించేందుకు ప్రయత్నించే బహిర్ముఖ కళా పరాయణులు. వీరి కవిత ముఖ్యంగా జాతి నిష్ఠంగా ఉంటుంది. ఈ ఉత్తరశ్రేణికి చెందిన ఈనాటి ఉత్తమ భారతీయ కవుల్లో శ్రీ రామధారీసింహ్ దినకర్ ఒకరు.

శ్రీ దినకర్ హిందీ సాహిత్యానికి జెందిన కవి అయినప్పటికీ సమగ్ర భారతీయ జాతి మానసాన్ని తన కావ్యంలో ప్రతిఫలింప చేసి రస నిర్భర భారతీయతతో భారత భారతిని ప్రత్యక్షీకరించుకోవడం వల్ల ఆయన జాతికంతటికీ ప్రతినిధి కవి అయినాడు. “దినకర్” ఈయన పెట్టుకున్న కావ్యనామం. ఇప్పటికి రమారమి అరవై సంవత్సరాల క్రితం బిహారులోని ముంగేర్ జిల్లాలోని సిమారియా అనే గ్రామంలో ఈ మనస్వి ఉదయించారు. మహాలయ పక్షంలో మాసశివ రాత్రినాడు కన్యాగత మార్తాండ తేజస్సుతో ఉదయించడం వల్లనే కాబోలు మహేశ్వరుని తాండవ వర్ణనతో తన కావ్య సాధనను ఆరంభించి ఊర్వశివంటి అపూర్వ లావణ్యరాశిని సృష్టించి ఇప్పటికీ ‘దినకర్’ అనే అన్వర్థ నామంతో ప్రాణవంతమైన రచనలు సాగిస్తున్నాడు. దినకర్ తొలిరచన 1924-25 లోనే “ఛాత్ర సహోదర్” అనే పత్రికలో కనిపించినప్పటికీ కవిత వ్రాసితీరాలి అనే పట్టుదల ఆయనలో 1930 తర్వాతగాని ఏర్పడలేదు. 1933 లో శివతాండవాన్ని వర్ణిస్తూ ఆయన చేసిన రచన తెలుగు వారికి పుట్టపర్తివారి శివతాండవాన్ని వెంటనే స్ఫురింపచేస్తుంది. దినకరుడు సాక్షాత్కరించుకొన్న శివతాండవం మచ్చుకు ఇలా ఉంటుంది.

“నాచో అగ్నిఖండ్ భర్ స్వర్ మేఁ
ఫూంక్ ఫూంక్ జ్వాలా అంబర్ మేఁ

అనిల కోష్, ద్రుమజల థల్ మేఁ
అభయ విశ్వకే ఉర్ అంతర్ ఁ
గిరే విభవ్ కా దర్ప్ చూర్ణ్ హో
లగే ఆగ్ ఇస్ ఆడంబర్ మేఁ
వైభవ్ కే ఉచ్చాభిమాన్ మేఁ
అహంకార్ కే ఉచ్చ శిఖర్ మేఁ."

కంఠంలో అగ్నినీ, గగనంలో జ్వాలలనూ, సృష్టిలో అనిల రాశినీ సమకూర్చుకొని నిర్భయంగా వైభవ పటాటోపాన్ని ధ్వంసం చేసేందుకు శివతాండవాన్ని కవి మార్తాండుడు కాంక్షించాడు. ఇలాగే ద్విధాగ్రస్త నర శార్దూలాన్ని బలవంతంగా పలుకరించుకుంటూ మరోకవిత వ్రాస్తాడు. ఇలాంటివి దాదాపు 30 రచనలతో దినకర్ ప్రథమ కావ్య సంకలనం "రేణుక" అనే పేరుతో 1935లో వెలువడింది. ఈ సంకలనంలో రమణీయ భావాలకు ఆలవాలమైన కవి హృదయం నిర్వీర్యమైపోతున్న జాతిని ప్రబోధించడమా లేక ఏకాంతంగా మనోహర భావలహరిలో ఓలలాడడమా అనే సందిగ్ధ మనోదశ కనిపిస్తుంది. కనుకనే దీనిలో 'తాండవ్' 'హిమాలయ్' 'కస్మైదేవాయ' లాంటి ఉదాత్త రచనలతోపాటు 'గీతవాసిని' 'జీవన్ సంగీత్' 'రాజారాణి', 'నిర్ఝరిణి' లాంటి లలిత శృంగార రచనలు కూడా చేరాయి. ఈ సందిగ్ధావస్థ దీని తరువాత మూడు సంవత్సరాలకు వెలువడిన 'హుంకార్' అనే మరో సంకలనంలో సమసి పోతుంది. స్వాతంత్ర్యలాలస, సాంఘిక సామరస్యం, శాంతి సాధన లాంటి జాతీయ భావాలు ఈ సంకలనంలో కావ్యరూపాన్ని పొందాయి. 'రేణుక'లో శాంతి కాముడయిన ధర్మరాజును స్వర్గానికి వెళ్ళ నిమ్మని హిమాలయాన్ని ఆదేశించిన కవి 'హుంకార్'లో తాను సంకల్పించిన విప్లవాన్ని 'దిగంబరి'గా చిత్రిస్తూ మరింత ధైర్యంతో అంటాడు.

**జరా తూ బోల్, తో సారీ ధరా హమ్ ఫూంక్‌దేంగే,**
**పడా జో పంథ్ మే గిరి, కర్‌సే దో టూక్ దేంగే,**
**కహీఁకుఛ్ పూఛ్‌నే బూఢా విధాతా ఆజ్ ఆయా**
**కహేంగే-హాఁ తుమ్హారీ సృష్టికో హమ్‌నే మిటాయా.**

"నీవు సరేనంటే చాలు. ఈ ఉర్వినంతా మేము ఊదివేసేస్తాం. దారిలో కొండలు అడ్డం వచ్చినా సరే వాటిని రెండు ముక్కలు చేసేస్తాం. అదేమిటని ముసలి తాత విధాత అడిగితే 'అవును మీ సృష్టిని మేము చెరిపి వేసేశాం' అని చెప్పేస్తాం.

ఇదీ త్రింశద్వర్షీయ కవిధోరణి. ఈ భావాలే. 'సామధేని' అనే తర్వాతి సంకలనంలో వైదిక యుగం నాటి ధైర్యాన్ని సమకూర్చుకున్నాయి. యజ్ఞశాలలో అగ్నిని ప్రజ్వలింప చేసేందుకు చదివే ఋక్కులను 'సామధేని' అంటారు. తన కావ్య సంకలనానికి ఇంతటి ఉదాత్తమైన పేరు పెట్టడంలోనే కవి పొందిన భావ పరిణతి గోచరిస్తుంది. ఈ సంకలనం స్వాంతంత్ర్యానికి ముందు వెలువడింది. ఆనాటి యువకుల్లో ఉద్దామ యౌవనోల్లాసాన్ని ఉప్పొంగజేసే రచనలు సామరిక ఋక్కులవలె ఇందులో పలికాయి, మచ్చుకు:-

"సమస్త సూర్యలోక్ ఏక్ హాథ్‌మే లియే హుయే
దబాకె ఏక్ పాంవ్ చంద్రభాల్ పర్‌దియే హుయే
ఖగోల్ మే ధుంవా భిఖేర్‌తీ ప్రతప్త శ్వాస్ సే
భవిష్యకో పుకార్‌తీ హుయీ ప్రచండ హాస్ సే
ఉఛాల్ దేవలోక్‌కో మహీసే తోల్‌తీ హుయీ
మనుష్యకే ప్రతాప్ కా రహస్య ఖోల్‌తీ హుయీ
విరాట్ రూప్ విశ్వకో దిఖారహీం జవానియాం"

సమస్త సూర్య మండలాన్ని ఒక చేతిలో పెట్టుకొని, ఒంటికాలితో చంద్రతలాన్ని తొక్కిపట్టి, వేడి నిట్టూర్పులతో నభో మండలాన్ని నింపివేసి, అట్టహాసంతో అనాగతాన్ని ఆహ్వానిస్తూ, దేవలోకాన్ని భూలోకంతో సమీకరిస్తూ, మానవుని పరాక్రమాన్ని ప్రపంచానికి చాటుతూ తన విరాడ్రూపాన్ని విశ్వానికి వివరించే నవయువత యీ కవితలో మూర్తీభవిస్తుంది.

ఇలాంటి ఉద్రిక్త భావాలతో ఉగ్రమూర్తిగా రూపొందిన 'దినకర్' ఉన్నట్టుండి ఉవిద కౌగిటిలో చేరి 'రసవంతి' అనే సంకలనంలో రసరాజాన్ని ఆశ్రయించడం అందరికీ ఆశ్చర్యం కలుగజేసింది. ప్రణయ గౌరవాన్ని ప్రకటించే రసఖండికలు 'అంతర్వాసిని' 'నారి' 'పురుషప్రియ' లాంటివి-యీ సంకలనంలో చేరాయి. దీనివల్ల వీరరస వ్యంజకమైన భావాలను పోషించడంలో కవి ఎంతటి స్థాయి నందుకున్నాడో కమనీయ కామినీ హృదయాన్ని అవగాహన చేసికొని ఆత్మీయతతో చిత్రికరించడంలో కూడా కవి అంతటి సామర్థ్యం కలవాడని స్పష్టమవుతుంది. అంతులేని ఆనంద జలధిలో మునిగి సత్-చిత్-పిపాసతో వెదకగా వెదకగా సృష్టి నాభిపై మధుర రసమూర్తిగా స్త్రీమూర్తి కనిపిస్తుంది కవి దృష్టికి.

ఇలాంటి చిన్న చిన్న రచనల నుండి ఒక్కసారి ప్రబంధ రచనా స్థాయినందుకుంటాడు. 'కురుక్షేత్ర' కావ్యంలో భారత యుద్ధానంతరం భీష్మయుధిష్ఠిరులకు జరిగిన సంభాషణ యీ కావ్యానికి కథా వస్తువు. ధర్మ సంస్థాపనకు యుద్ధం అనివార్యమా, శాంతి సమరాలకు సామరస్యం చేకూర్చడం సాధ్యమా అనేది యీ కావ్యంలోని ముక్య వివక్ష. న్యాయాన్ని

నెలకొల్పి సామ్యాన్ని సాధించలేని శాంతికంటె క్రాంతి మేలని భీష్ముడు నిష్కర్ష చేస్తాడు. స్నేహ బంధురమైన ఉదాత్త సామ్య మరీచికలు భూమండలాన్ని ఎప్పుడు వెలిగిస్తాయో అని కావ్య నాయకుని ద్వారా కవి కాంక్షిస్తాడు. మననీయమైన రాజనీతి కమనీయమైన కళా వైభవంతో ఈ కావ్య రూపాన్ని ధరించింది. ఈ కావ్యంలోని భీష్మ యుధిష్ఠిరులు భారతకాలం నాటి వారుగా కాక సనాతన శాంతి కాములుగా మనకు కనిపిస్తారు. పురాతన సమస్యలతో పాటు అధునాతన రాజకీయ సాంఘిక పరిస్థితులను కూడా వారు విమర్శిస్తారు. ఈ కావ్యాన్ని కొందరు అభినవ గీత అని కూడా అభినందించారు. ఇది మహా కావ్యం అయినా కాకున్నా జాతీయ గీతగా మాత్రం జాతి హృదయంలో నిలిచిపోయింది. 'దినకర్'ను జాతీయ కవిగా రూపొందించింది యీ కురుక్షేత్ర కావ్యమే.

'కురుక్షేత్ర' కావ్యంలోనే భారత కథలోని కర్ణ పాత్ర నాధారం చేసికొని 'రశ్మిరధి' అనే ఖండకావ్యం కూడా ఈ కవి చేతిలో రూపొందింది. దీనిలో కర్ణుని ఉదాత్త పాత్ర పోషణ ఎన్నదగింది. సాంఘిక వైషమ్యాలను లెక్క చేయక నిస్వార్థమైన కార్యదీక్షలో నిమగ్నుడయిన కర్ణుని నిష్ఠకు నివ్వెరపడి "నీవు పొందిన స్థాయిని మానవు లేమిటి, దేవతలు కూడా పొందలేరు. కర్ణా!" అని అంటాడు దేవేంద్రుడు, ఈ మాటలు కర్ణుని పట్లనే కాక ఆ పాత్రను అలా తీర్చిదిద్దిన కవి విషయంలో కూడా యథార్థమేమొ అనిపిస్తుంది. కాని 'కురుక్షేత్ర' కావ్యానికి లభించిన ఖ్యాతి దీనికి రాలేదు.

ఈ రెండు కావ్యాలలో చరమ పరిణతి పొందిన కవి వీరావేశం మళ్ళీ ఒకసారి శృంగారాన్ని ఆశ్రయించింది. హిందీ సాహిత్యంలో అభినవ లావణ్యంతో ఊర్వశి అవతరించింది. కాళిదాసు రచించిన విక్రమోర్వశీయ నాటకానికి ఈ ఊర్వశి కావ్యం ఒక విధంగా అనుకృతి లాగానే కనిపిస్తుంది. అంక విభజనతో కవి దీనికి నాట్య పరిధానాన్ని తొడిగినప్పటికీ ఇది శ్రవ్యకావ్యంగానే ఎక్కువ ప్రచారం పొందింది. 'దినకర్' సృష్టించిన ఊర్వశి ఈనాటిది కాదు కాళిదాసు కాలానిది కూడా కాదు. ఆమె వేద కాలంనాటి సాత్విక జిజీవిషతో, సహజ సౌందర్య శోభతో, ప్రాకృతిక భోగలాలసతో దివిని విడచి భువికి దిగి వచ్చిన అపూర్వ సుందరి. సృష్ట్యాది నుండి మానవుల మానసోల్లాసానికి జీవం పోసి యీ రమణీయ మూర్తి మన జాతీయ కవి వాక్కును పునీతం చేస్తూ అంటుంది.

"జన జన కీ మన్‌కీ మధుర వహ్ని
ప్రత్యేక హృదయ్ కీ ఉజియాలీ
నారీకీమైఁ కల్పనా చరమ్
నర్‌కీ మన్‌మేఁ బస్‌నే వాలీ"

'ప్రతివ్యక్తి మనసులో తియ్యని మంటలా చేరి ప్రతిజీవి హృదయానికీ వెలుగును ప్రసాదించే పరమ రమణీయ రూపకల్పనను నేను,' ఈ కమనీయ భావకల్పనలో అందరికీ అందని అందాన్ని అందుకొని కొందరికయినా దాన్ని అందించాలనే ఆరాటం, ఆవేశం, ఆనందం కవి వాక్కులో కనిపిస్తాయి.

ఈ విధంగా దినకర్ కావ్యసాధన ఒక అర్ధ శతాబ్దం నుండి వీరశృంగారాల గంగా యమునల సంగమంలో విహరిస్తూ విలక్షణంగా కొనసాగింది. ఇలా శృంగార వీధుల్లో విహరిస్తూ ఉన్న కవికి చైనాతో భారతదేశం పోరాడ వలసివచ్చిందని తెలిసింది. మరుక్షణమే 'పరశురామ్ కీ ప్రతీక్షా' అనే ఉత్తేజకరమైన కవిత కవినోట పలికింది. ఆ పలుకులు ఆనాటి యువకుల రక్తనాళాల్లో ఎన్ని మెగాటన్నుల శతఘ్నులనో పేల్చినట్టు పని చేశాయి.

పద్యరచనలోనే కాక గద్యరచనలో కూడా దినకరునిది అందె వేసిన చెయ్యి. భారతీయ సంస్కృతిని చారిత్రాత్మకంగా వివరిస్తూ 'సంస్కృతికే చార్ అధ్యాయ్' అనే పేరుతో ఆయన వ్రాసిన ఉద్గ్రంథానికి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి లభించింది. ఇది కాక ఎన్నో విమర్శనాత్మక రచనలు కూడా ఆయన చేశారు.

కాని ఇటీవల 'దినకర్' మౌనం వహించినట్టు తోచింది. జాతి మానసాన్ని అలరించే మరో కావ్యం ఆయన నోట వెలువడలేదని అందరూ అనుకొంటూ ఉండగానే 'హారేకో హరి నామ్' అనే కావ్య సంకలనం ఇప్పుడిప్పుడే వెలువడింది. పరాజితునికి పరాత్పరుడే శరణ్యం అనేది కావ్యంలోని ఖండికలు తెలిపే పరమార్థం. ఈ సంకలనంలోని 'పురుషార్థ' అనే కవితలో మానవుని వివిధ మనోదశలను చిత్రిస్తూ కవి నిర్వేదం వల్ల లభించగల నిశ్రేయసాన్ని నిరూపిస్తాడు. 'ఆలోచనలను పూర్తిగా పరిహరించినందువల్ల ప్రమాదమేమీలేదు. అందువల్ల మానవుడు మరణించడు' అని కవి శపథం చేసి చెబుతాడు. శ్రుతి విప్రతిపన్నమైన బుద్ధికి సమాహిత శాంతిని చేకూర్చాలని పరితపించే పరిణత మతి యీ రచనలో కనిపిస్తుంది. భారత సంహితా పరాయణుడయిన కవి భాగవతోన్ముఖుడయినట్టుగా తోస్తుంది యీ సంకలనం చదివినప్పుడు.

ఏమి వ్రాసినా, ఎలా వ్రాసినా జాతి మానసంతో ఇంతటి తాదాత్మ్యం పొందిన కవులు మన దేశంలో ఈనాడు ఎందరోలేరు. హిందీలో మరొకరు లేరనే చెప్పవచ్చు. మంచుకొండలాంటి మనసు, ఆ కొండ నుండి జల జల జారే జాహ్నవిలాంటి వాక్కు, వాక్కుకు తగిన వర్చస్సు, వర్చస్సుకు తగిన తపస్సు అన్నిటిని మించిన చిన్మయమందహాసం కవికి తేజోవంతమైన జాతీయ పరిధానాన్ని సమకూర్చాయి. ఈ జాతిరత్నం మున్ముందు మన జాతికి ఎలాంటి శోభను చేకూర్చ గలదో రేపటి రోజులు వివరించాలి.

(ఆకాశవాణి హైదరాబాదు వారి సౌజన్యంతో)

# భారతీయ భాషా సాహిత్యాలు-భారతీయత

ప్రతిజీవిలో జీవగతమైన సంస్కారం వాక్కులో, మనస్సులో, ఆచరణలో ప్రతిబింబించినట్టే, ప్రతి జాతిలోని జాతిగతమైన చైతన్యం ఆజాతి వ్యవహరించే భాషలో, సృష్టించుకొనే సాహిత్యంలో స్పష్టంగా వ్యక్తమవుతుంది. వ్యక్తిగతమైన అభివ్యక్తి వ్యక్తికి ఒక నిర్దిష్టమైన వ్యక్తిత్వాన్ని ఎలా సమకూర్చుతుందో జాతిగతమైన సారస్వత సంపద ఆజాతికి ఒక సుస్పష్టమైన వాఙ్మయముద్ర చేకూర్చుతుంది. ఒక కుటుంబంలోని వేరు వేరు వ్యక్తుల వాగ్వైఖరి వేరు వేరుగా గోచరించినా అందరి వాక్కులోనూ ఆకుటుంబ సభ్యత్వాన్ని గుర్తింపజేసే స్వరసామరస్యం కనిపిస్తుంది. అలాగే ఒక భాషా సముదాయం కూడా ఒకేవిధమయిన వాక్సరణిని అనుసరించి దానికి అనుగుణమయిన సాహిత్యాన్ని సృష్టించుకుంటుంది. స్త్రీ పురుషుల వాక్కులో కూడా ఇలాంటి జాతిగత భేదంతో పాటు సజాతీయ సమానత గోచరిస్తుంది. స్త్రీల వాక్కు సామాన్యంగా మృదువుగా కోమలంగా సశ్రీకంగా ఉంటుంది. పురుషులవాక్కు ప్రౌఢంగా ప్రాంజలంగా ప్రగల్భంగా ఉంటుంది. నిజానికి వాక్కును పలికించేది మనస్సు. మనస్సును పురికొల్పేది బుద్ధి. బుద్ధిని సంబోధించేది ఆత్మ. ఆత్మ సూక్ష్మాతిసూక్ష్మం. వాక్కు స్థూలమయిన ఆత్మాభివ్యంజన. వాక్కు వినిపిస్తుంది. మిగిలినవి వినిపించవు, కనిపించవు కూడాను. కాని వాక్కు విన్నవాళ్ళకు దానివెనక మనస్సు ఉన్నదని అనిపిస్తుంది. బుద్ధి కొంతమందికి బోధపడుతుంది. కాని ఆత్మ అందరికీ అర్థంకాదు. ఏ కొందరో దాని ఉనికిని ఊహించగలరు. స్థూలమయిన వాక్కు వెనక సూక్ష్మ సూక్ష్మతమమయిన ఆత్మ మూలశక్తిగా నిలిచి ఉండటంవల్ల వాక్కు సార్థకమవుతుంది. శాశ్వతమవుతుంది. సారస్యాన్ని సంతరించుకొని సారస్వతమవుతుంది. విశుద్ధమైన ఆత్మచైతన్యమే వాక్కుకు వివేకాన్నీ, వికాసాన్నీ ప్రసాదిస్తుంది. దేశకాలాలకు అతీతమయిన ఆత్మ దేశకాలాలకు అనుగుణంగా అవసరాలను బట్టి, పరిసరాలను బట్టి, సంప్రదాయ సముదాయాలను బట్టీ సారస్వతమయిన అభివ్యక్తిని పొందుతుంది. దానినే మనం జాతీయ సారస్వతం లేక భారతీయ సాహిత్యం అని వ్యవహరిస్తాం.

భారత జాతికి చెందిన సాహిత్యం భారతీయ సాహిత్యం. భాషలు వేరు కావచ్చు. కాని వేరు వేరు భాషల్లో వ్యక్తమయ్యే ఆలోచనలు, ఆచారాలు, ఆశయాలు, ఆదర్శాలు దాదాపు ఒకేవిధంగా ఉంటాయి. భాషలు వేరయినా భాషాభూమిక ఒకటే. మనిషి భావజీవి. సాహిత్యం భావగీతి. మనిషి సారస్వతజీవి కాగలిగితే సాహిత్యం జీవన సంగీతమవుతుంది. మాట

పాటగా మారుతుంది. మాటను పాట చేయగల పాటవం సాహిత్యంలో ఉంటే ఆ మాటను మంత్రంగా మలచి నిలబెట్టగల ప్రాభవం తత్త్వచింతనలో ఉంది. ఈ రెంటినీ మేళవించి మంచి మంచి మాటలను పాటలుగా మంత్రాలుగా రూపొందించి వాటి ద్వారా మంచిని పెంచగల శిల్పనైపుణ్యం, శివ సౌందర్యం భారతీయ సాహిత్యంలో కనిపిస్తుంది. అదే భారతీయ సాహిత్యంలోని భారతీయత. సత్య సందర్శన తాత్త్వికుల ధ్యేయం. సౌందర్య సమీక్షణం సాహిత్య పరమావధి. ఈ రెంటిలో శివతత్త్వాన్ని సాక్షాత్కారించుకొని మాట మంచితనాన్ని మానవ కల్యాణానికి వినియోగించుకోవటం భారతీయ సాహిత్యం సాధించిన సారస్వత భావయోగం.

ఇలాంటి ప్రభాభాస్వరమయిన భారతీయ సాహిత్యానికి ప్రభాతగీతి పలికిం ప్రాచేతసుడయిన వాల్మీకి. మంచి మనిషి మనస్సులా స్వచ్ఛంగా, ప్రసన్నంగా, రమణీయంగా ప్రవహించే నదీ జలాలను చూచి ఉప్పొంగిపోయే ఉల్లాస సమయంలో కామమోహితమయిన క్రౌంచ మిథునాన్ని విడదీసి విలపింపజేసే నిషాదుని కర్కశ శరధ్వని ముని చెవులకు వజ్రపాతంలా వినిపిస్తుంది. హృదయం ద్రవించిపోతుంది. పరావాక్కులోని భావ తీవ్రత వైఖరిలో ఖరతరంగా పలుకుతుంది. శోకం శ్లోకంగా మారుతుంది. మాటలు మంత్రాలయి 'మా నిషాద' అని నిర్దయత్వాన్ని నిరసించే నిసర్గరోషావేశాన్ని ప్రసరింపజేస్తాయి. దానితో భారతీయ సాహిత్యానికి నాంది ఏర్పడుతుంది. వేదం కావ్యరూపంలో అవతరిస్తుంది. తత్త్వాలలోని సత్యాన్ని సాహిత్యం సాక్షాత్కరించుకుంటుంది. సాహిత్యంలోని సారాన్ని సత్యధర్మాలు సమీక్షించుకుంటాయి. శ్రుతికీ కృతికీ ఏకాకృతి ఏర్పడుతుంది. అదే భారతీయ సాహిత్యంలోని భారతీయతకు తొలిపలుకు, తొలిమేలు కొలుపు.

ఆదికవి వాల్మీకి నోట వెలువడిన రామాయణం భారతీయులకు జాతీయ మహాకావ్యంగా భారతీయతకు పర్యాయపదంగా సాహిత్య జగత్తులో శతాబ్దాలని సృష్టించగల శబ్దశక్తిగా, సత్యధర్మశాంతి సౌఖ్యాలని మానవజాతికి మధురాక్షర మాధుర్యంతో చాటిచెప్పగల సారస్వత శేషాహిగా ఇహపరతారకంగా కాలాన్ని మరిపించే కమనీయ రచనగా నిలిచిపోతుంది. అంతేకాదు, భారత భారతిలోని భారతీయతను దేశదేశాంతరాలలో ప్రసరింపజేసేందుకు ప్రపంచపు నలుమూలలా ప్రచరించింది.

భారతీయ భాషల్లో రామాయణ కథను అనువదించుకుని ఆస్వాదించని భాషలేదు. భారత భాగవతాలు కూడా అన్ని భారతీయ భాషల్లో ఏదో ఒక రూపంలో కనిపిస్తాయి. కాని రామాయణాలకున్న ప్రాచుర్యం సమగ్రత సంచరణశీలత మిగిలిన వాటికి కనిపించదు. 'వింటే భారతం వినాలి, తింటే గారెలు తినాలి' అనుకోగలిగినంత ఆనందంతో భారత సంహితను స్వాస్యం చేసుకొన్న భాషలు చాలా కొద్ది. కాని ప్రతిభాషలో రామాయణం మాత్రం

కథగా, కావ్యంగా, నాటకంగా రూపొందింది. కంబ రామాయణం తమిళులకు కమ్మని విందును అందించింది. ఎళుత్తచ్చన్ వ్రాసిన అధ్యాత్మ రామాయణం మలయా నిలవాసులకు మధురగానం అయింది. అలాగే తొరవైరామాయణం (కన్నడం) కృత్తివాసరామాయణం (బెంగాలీ) మాధవి కంగళి (అస్సామీ) రామాయణం, భావార్థ రామాయణం (మరాఠి) మొదలయిన రామాయణాలు సామాన్య ప్రజలకు కూడా అందుబాటులో ఉండేట్టు లభించాయి. గోస్వామి తులసీదాసు రచించిన 'రామచరితమానస్' జన మానసంలో నాటుకుపోయింది. పడవ నడిపేవాడి దగ్గరినుంచి పారంగత విద్వాంసులవరకు మానస రచనకు మురిసిపోతారు. తెలుగులో రంగనాథ రామాయణం నుంచి విశ్వనాథ రామాయణం వరకు వందలకొలది రామాయణాలు వెలువడ్డాయి. ఈనాడు కూడా తెలుగులో రామాయణ రచన సాగుతూ ఉంది. తెలుగు లాంటి అధునాతన భాషల్లోనే కాక సంస్కృతం లాంటి ప్రాచీన భాషల్లో కూడా రామకావ్యం సజీవంగా ఉంది.

నిజానికి రామకథా సంవిధానం భారతీయ సంస్కృతికి రమణీయమయిన ఆకృతిని సమకూర్చగలిగింది. భారత సంహిత మననీయమయిన మనోబలాన్ని చేకూర్చింది. శ్రీమద్భాగవతం భారతాత్మను భక్తిపరంగా ప్రభవింపచేసింది. భారతీయ సాహిత్యానికి రామాయణం జ్ఞానపీఠం అయితే భారతం కర్మభూమి, భాగవతం భక్తిమందాకిని.

ఈ మూడుగ్రంథాలు భారతీయ చైతన్యాన్ని వాఙ్మయంగా చిత్రించే మూడు నేత్రాలు. ఈ కృతిత్రయి దాదాపు అన్ని భాషల్లో న్యూనాధికంగా చోటుచేసుకుంది. ఈ సహస్రాబ్దిలోని పూర్వార్థమంతా భారతీయ సాహిత్యంలో భారత భాగవత రామాయణాదుల ప్రాబల్యం కనిపిస్తుంది. ఈ ప్రాతిపదికను పురస్కరించుకునే 16వ శతాబ్దంలో భక్తి సాహిత్యం ప్రాదుర్భవించింది. పూర్వాంచలంలో చైతన్య మహాప్రభువు దగ్గరినుంచి పశ్చిమంలో జ్ఞానదేవుని వరకు పంజాబులో గురునానక్ దగ్గరినుంచి దక్షిణదేశంలో పురందరదాసు, అన్నమాచార్య, పోతనామాత్యుడు, ఎళుత్తచ్చన్ వరకు, భారత దేశాన్ని భక్తి భాగీరథి అభిషేకించింది. కాశీ నుంచి రామేశ్వరం వరకు ఒకే ఒక ఆధ్యాత్మిక చైతన్యం అన్ని భాషలకూ సారస్వత సంపదను ప్రసాదించింది. ఇది కేవలం ఒక మతానికీ, సంప్రదాయానికీ సంబంధించిన సాహిత్యం కాదు. అన్ని మతాలూ ఇందులో చేరి సహగానం చేశాయి. హిందీ సాహిత్యంలోని భక్తికాలం కేవలం సూరదాసు, తులసీ దాసులకు మాత్రమే చెందింది కాదు. జాయసీ సూఫీతత్త్వం కూడా ఈ యుగానికి మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదలను చేకూర్చింది. హిందువులను, మహమ్మదీయులను ఘంటాపదంగా నిరసించి నిర్గుణ పరబ్రహ్మాను కీర్తించిన కబీరుదాసు కూడా తన కాలజ్ఞానంలో కాలాతీతమయిన పరతత్త్వాన్ని ప్రచారం చాశాడు. మొత్తంమీద పదిహేనవ శతాబ్దం చివరినుండి పదిహేడవ శతాబ్దం చివరి వరకూ భారతీయ సాహిత్యం

పరమార్థ చింతనను ప్రచారం చేసింది. త్యాగం, వైరాగ్యం, శాంతం, ధర్మబుద్ధి, చిత్తశుద్ధి, పాపభీతి మొదలయిన గుణగణాలకు సాహిత్యం దోహదం ఇచ్చింది.

ఆ తర్వాత క్రమంగా భోగలాలస జాతి జీవితంలో ప్రబలింది. అదే సాహిత్యంలో ప్రతిఫలించింది. రాజులు కావ్య నాయకులయ్యారు. ద్రవ్యలాభం సారస్వత సాధనకు తత్‌క్షణ ప్రయోజనంగా మారింది. ఈ యుగాన్ని హిందీ సాహిత్యంలో రీతికాలమనీ వ్యవహరించారు. తెలుగులో దీన్నే క్షీణయుగం అన్నారు. మిగిలిన భారతీయ భాషల్లో కూడా ఈ యుగం ఇలాగే జరిగింది. పదిహేడవ శతాబ్దం చివరినుంచి పందొమ్మిదవ శతాబ్దం చివరివరకు భారతీయ సాహిత్యం కేవలం మనోవినోదానికి ఉపకరించే విలాస సామగ్రిగా రూపొందింది. ఈ విలాస సుషుప్తి విదేశ పరిపాలనవల్ల ఏర్పడిన దాస్యవృత్తితోగాని నివృత్తికాలేదు. కాని ఈ యుగం కూడా కావ్యకళకు ఒక నూతన తేజస్సు ప్రసాదించింది. తెలుగులో చేమకూర వేంకటకవి, కంకటి పాపరాజు లాంటి కళా తపస్సంపన్నుల వలె ఇతర భాషల్లో కూడా సేనాపతి, బిహారీలాల్, మోరోపంత్, దీనబంధుమిత్ర లాంటి సాహిత్యోపాసకులు కానిపిస్తారు. వీరి రచనలను జాగ్రత్తగా పరిశీలించి చూస్తే ఇది కేవలం క్షీణయుగమనిపించదు. భక్తితో వేదాంతంతో నీతిశాస్త్రంతో ప్రమేయం లేకుండా కళను కళగా నెలకొల్పిన కళాయుగమని తోస్తుంది.

ఆంగ్లేయుల పరిపాలన ఆరంభం కావటంతో భారతీయ సాహిత్యంలో ఒక నూతనయుగం మొదలయింది. ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతులు, నాగరికతలు, భాషలు, సాహిత్యాలు మేళవించటంవల్ల భారతీయ సాహిత్య చరిత్రలో ఒక నూతనాధ్యాయం ఆరంభమయింది. ఇది అన్ని భారతీయ భాషల్లో దాదాపు ఒకే సమయంలో ఒకే పద్ధతిలో జరిగింది. తమిళంలో సుబ్రహ్మణ్యభారతి, వంగ దేశంలో రాజారాంమోహనరాయ్, హిందీలో భారతేందు హరిచంద్ర, తెలుగులో కందుకూరి వీరేశలింగం లాంటి మేధావులు ప్రాంతీయ జీవితాన్ని ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతుల మేలుకలయికను దృష్టిలో ఉంచుకుని ఆధునిక భారతీయ సారస్వతాన్ని రూపొందించారు. అంతవరకు సంస్కృత సాహిత్య సారాన్ని సంగ్రహించుకుని స్వతంత్రసారస్వత సృష్టి సాధించుకుంటున్న భారతీయ భాషలకు ఆంగ్ల భాషా సారస్వతాల క్రొత్తపోకలు అభ్యుదయ భావనలు నూతన తేజస్సును సమకూర్చాయని చెప్పవచ్చు. సాహిత్యానికి సారూప్యాన్ని ఇచ్చే వాగర్థాలలో ఆరంభంలో అర్థాన్ని ఆరాధించి, ఆ తర్వాత శబ్దాన్ని సాధించిన భారతీయులకు ఈ శతాబ్దం శబ్దార్థాల సామరస్యాన్ని బోధించిందని చెప్పాలి. ఆదికవి నన్నయ ఆశించిన ప్రసన్న కథా కవితార్థయుక్తి రాను రాను క్షీణించి కేవలం అక్షర రమ్యతతో ఆగిపోయే సమయం వచ్చేసరికి ప్రాచ్యపాశ్చాత్య సమాగమం నూతనోత్సాహాన్ని అందించింది. నూతన మార్గాన్ని చూపింది. గద్య పద్యాలకు సమానమయిన

కావ్య ప్రతిపత్తిని చేకూర్చింది. కాని ఆధునిక భారతీయ జీవిత విధానంతో పాటు అధునాతన సారస్వత సంవిధానకం సాక్షాత్కరించింది. కాని ఇందువల్ల భారతీయసాహిత్యంలో నిహితమయిన భారతీయతకు ఏ మాత్రం వ్యవధానం ఏర్పడలేదు. అన్ని వెలుగులనూ తన ఎలుగుతో కూర్చుకుని నూతన కాంతిలో తనదయిన ఒక వెలుగును ప్రసరింపచేసే ప్రభారతి భారతీయ సాహిత్యం యొక్క నైజం కావటంవల్ల పాశ్చాత్య భాషా సారస్వత సంస్కృతుల సంపర్కం వల్ల భారత భారతి మరింత భారతీయంగా ప్రకాశించిందే కాని పూర్వకాంతి ఏ మాత్రం తరగలేదు. ఒకవిధంగా పెరిగిందనే చెప్పాలి.

పందొమ్మిదో శతాబ్దం చివరిపాదం నుంచి ఇరవయ్యో శతాబ్దం మూడు దశాబ్దాలు ముగిసేవరకు ఈ సంక్రాంతికాలం సాగిందని చెప్పవచ్చు. అంతవరకు కాలం కవులను నడిపించింది. ఆ తర్వాత కవులే కాలాన్ని నడిపించారు. శ్రీ శ్రీ లాంటి వారు ఈ మాటను వాచ్యంగా చెప్పారు. పంత్, ప్రసాద్, కుమారన్ ఆసాన్, నజరుల్ ఇస్లాం, హితేశ్వర్ బస్‌బరువా, విష్ణుకృష్ణ చిప్లంకర్, భారతీదాసన్, పూరణ్‌సింగ్ లాంటి నవోదయ కవితా రాధకులు తమ రచనలద్వారా ఈ సత్యాన్ని నిరూపించారు. మహాకావ్యాలు, ఖండకావ్యాలు, గేయాలు సాధించలేని పని ముత్యాల సరాల లాంటి ముద్దు పలుకులు సాధించాయి. భావ కవిత అభ్యుదయ పథాన్ని అనుసరించింది. ఛాయావాదం రహస్యవాదం లాంటి భావ భంగిమలు ప్రగతిని తమ పదరతికి పరిమితిగా పరమావధిగా భావించి కావ్యరథాన్ని ప్రగతిపథంలో నడిపించారు. అందం, అనురాగం, ఆవేశం లాంటి కోమలభావనలు అన్న వస్త్రాలను తెచ్చిపెట్టలేవనే యథార్థం శబ్దజీవులకు అర్థమయింది. దానితో శబ్దం పై అర్థం ఆధిపత్యం వహించింది. ఈ ధోరణి దాదాపు అన్ని భారతీయ భాషల్లో ఏదో ఒక్క రూపంలో రెండు దశాబ్దాలపాటు ప్రజాకవుల మన్ననలను పొందింది. స్వాతంత్ర్య సంగ్రామం కూడా దీనికి బాగా దోహదం చేసింది. మహాత్మాగాంధి ప్రచారం చేసిన రచనాత్మక కార్యక్రమం కావ్యరచనకు కూడా చక్కగా ఉపకరించింది. భావకవుల గేయాలు దేశభక్తి గేయాలుగా మారాయి. నిజానికి ఈ వ్యవధి (1940–47)లో వివిధ భారతీయ భాషల్లో వెలువడ్డ దేశభక్తి సాహిత్యాన్ని సమగ్రంగా పరిశీలించి చూస్తే భారతీయ సాహిత్యంలోని భారతీయత అంటే ఏమిటో బోధపడుతుంది. ఒకవిధంగా భక్తి అనేదే దేశాన్ని అవిభక్తం చేసిందనిపిస్తుంది. పదిహేను పదహారు శతాబ్దాలలో దైవభక్తి సాధించిన సమైక్యం ఇరవయ్యో శతాబ్దం మధ్యకాలంలో దేశభక్తి సాధించింది. భారతమాత ఏకహృదయంగా పలికిన యీ భావతరంగాలలో భాషాభేదాన్ని మరిపించే భావసమైక్యత కనిపిస్తుంది.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కొన్నాళ్ళు ఉల్లాసం, ఆనందం, ఆవేశం, అభిమానం

సాహితీ పరులకు సారస్వత సామగ్రిని సమకూర్చింది. కాని ఆగష్టు 15 అర్ధరాత్రి కన్నకలలు పట్టపగలు ఫలించాలి. ప్రణాళికల ప్రతిఫలం నాలుకలదాకా రావాలి. స్వరాజ్యం సురాజ్యంగా సాక్షాత్కరించాలి. అలా కాని నాడు నైరాశ్యం నిరసన, నిర్లిప్తత, నిర్దాక్షిణ్యం లాంటి నిరోధక భావాలు ప్రజల్లో వ్యాపించటం సహజం. భావాలను తమ రచనల్లో ప్రతిఫలింపజేయటం ప్రజా రచయితల రచనాధర్మం. ఈ శతాబ్దం ఉత్తరార్ధంలో భారతీయ సాహిత్యంలో ఈ స్వరమే వినిపిస్తుంది. కాని కఠోర సత్యాన్ని కటువుగా చెప్పేందుకు కవి హృదయం అంత సులువుగా అంగీకరించదు. దీనికి కథలు, నవలలు, నాటకాలు, పత్రికలు, వ్యాసాలు బాగా పనికివచ్చాయి. క్రమంగా ఈ పని కవులు కూడా ఆరంభించారు. ప్రారంభదశలో ప్రయోగాత్మకంగా ఈపనిసాగింది. వ్యంగ్యంగా భంగ్యంతరంగా హృదయంలోని ఆవేదనను చెప్పటం జరిగింది. క్రమంగా ఈ డొంక తిరుగుడు మానేసి సూటిగా సూనృతం పలకటం మంచిదని నిష్కాగరిష్టులయిన విప్లవవాదులు నిర్మొహమాటంగా నిజం చెప్పటం ఆరంభించారు. దానితో కవితారీతి అతియథార్థపదార్థంగా మారింది. పరమార్థంకంటే ఈ పదార్థమే గత మూడు దశాబ్దాల నుంచి కావ్యార్థంగా చరితార్థమయింది. ఈ కోవకు చెందిన కవులు కావ్యరూపంలోనే కాక కార్యరూపంలో కూడా తమ భావశౌర్యాన్ని అనువదించి వాదించి సాధించారు. తెలుగులో దిగంబర కవిత సాధించిన దిగ్విజయం దేశదేశాంతరాలలోని రచయితల హృదయాంతరాలను స్పందింపచేసింది. అది అలా కొన్నాళ్ళు కొనసాగితే ఎలా ఉండేదో తెలియదు. కాని ఆ పొంగును మరో రంగులో చిత్రించిన కవిసేనలాంటి కవితారీతులు శబ్దానికీ అర్థానికీ యథార్థమయిన భావాధారాన్ని సమకూర్చుతూనే సిసలయిన విప్లవ శైలిలో కావ్యప్లవాన్ని నడిపించాయి. ఇది ఈ శతాబ్దం సాధించిన శబ్దశిల్పం. వచ్చే శతాబ్దం ఈ శిల్పాన్ని అందుకోగలిగితే అది నిజంగా ఒక నూతన కవితా శతాబ్దంగా రూపొందవచ్చు.

ఈ శతాబ్దంలో దాదాపు ఆరు దశాబ్దాలకాలం కవితారీతులను త్రికాలదృష్టితో సృష్టించి పోషించి తనలో లీనం చేసుకున్న కన్నడ కవి వినాయక కృష్ణ గోకాకు జ్ఞానపీఠ బహుమతిని అందుకుంటూ వచ్చే శతాబ్దంలో కవితా భవిష్యత్తును ఊహిస్తూ అన్న మాటలు మనన చేయదగినవి. "In any phase of human evolution, whatever the ethos of a century and its love for experiment, the poet fulfils his mission for which he is born, just as the scientist, the philosopher or the mystics. The form and outward fashion may change. But the electromagnetic spirit of poetry will persist for millennia even when the evolution of a higher world order and the advent of never and rarer types of human personality are in evidence" (మానవ జాతి ఏ వికాస శిఖరాన్ని అందుకున్నా సరే, ఒక శతాబ్దం ఏ నీతిని అనుసరించినా, ఏ రీతిని అభిలషించినా కవి ఏ పని కయి జన్మిస్తాడో ఆపని సాధించి తీరుతాడు. ఈ విషయంలో తానొక శాస్త్రజ్ఞుడిలా వేదాంతిలా

రాజయోగిలా పనిచేస్తాడు. కవితా స్వరూపం బాహ్యపరిధానం మారవచ్చుకాని విద్యుదయస్కాంతం లాంటి కావ్యాత్మలో మాత్రం మార్పు ఏమాత్రం రాదు. (ప్రపంచం ఎంత మహోన్నత స్థాయిని అందుకున్నా సరే, మానవుడి వ్యక్తిత్వం ఎంత అపూర్వమయిన నూతన రీతులలో పురోగమించినా సరే) శతాబ్దంలో ఎనిమిది దశాబ్దాలను అనుభవించిన కవి మనీషి చెప్పిన యీ మాటలు కావ్యం పట్లనేకాక సమగ్ర సాహిత్యం పట్ల కూడా సార్థకమవుతాయి. అసలు భారతీయ దృష్టిలో కావ్యమంటే కేవలం కవిత కాదు. ద్రష్ట నోట వెలువడిన పదసంపద అంతా కావ్యమే.

ఈ దృష్టితోనే ఇరవయ్యో శతాబ్దం చివరి మెట్టును చేరుకున్న భారతీయ సాహిత్యంలోని భారతీయతను అవగాహన చేసుకోవాలి. భారతీయ సంవిధానం (రాజ్యాంగం)లో పేర్కొన్న పదిహేను భాషల్లోనే కాక రాజస్థానీ, మైథిలి, కొంకణి, డోగ్రీలాంటి భాషల్లో కూడా ఈనాడు ఎన్నదగిన సాహిత్యం వెలువడుతున్నది. ఈ భాషల్లో రచింపబడే సాహిత్యం దాదాపు సమాంతరంగానే కనిపిస్తుంది. ఛందస్సును దాదాపు అందరూ వదిలేశారు. అయినా అధునాతన కవితాగమనంలో గమనించదగ్గ ఒక నూతన లయ గోచరిస్తుంది. వేదమంత్రాలలో, ఉపనిషద్వాక్యాలలో ఋషుల నోట వెలుపడిన నాదంలోని లయను ఈనాటి కవులు అలవరచుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. ఈ లయ గ్రాహక సాధన అన్ని భారతీయ భాషల్లో పురోగమిస్తున్నది. జాతీయ కవి దినకర్ తన తుది రచన 'హారేకో హరినామ్' లో కవితను కాలానుగుణంగా నడిపించాలంటే కవికి అకవి కావలసిన అవసరం ఎంతయినా ఉందని భావి కవులకు సూచిస్తాడు. మతం అమతమయినప్పుడే అది సర్వసమ్మతమవుతుందని చాటి చెప్పిన కేనోపనిషత్తులోని కైవల్యభావం దినకర కవి సూచించిన యీ అకవితలో ధ్వనిస్తుంది. భారతీయ కవితలో వచ్చిన యీ మార్పు ఈ శతాబ్దం సాధించిన ఛాందోగ్యం అనిపిస్తుంది.

అలాగే కథా కథనంలో నవలా రచనలో నాట్య శిల్పంలో వ్యాస రచనలో సమాలోచనా సిద్ధాంతాలలో విమర్శ విధానంలో దృశ్యనాటికల్లో చమత్కారికల్లో గజళ్ళలో కవాలీలలో అవధానాల్లో ఆరుకృతుల్లో అంత్యాక్షరీ వినోదాల్లో, ముషాయిరాలలో బహుమతి మూలకరచనా వ్యాసంగాల్లో సన్మాన సాహిత్యంలో –అన్నింటిలో అన్ని భారతీయ భాషలూ దాదాపు ఒకే పద్ధతిలో పయనం చేస్తున్నాయి.

కాని భారతీయ భాషల్లో కనిపించే సారస్వత సామ్యం మాత్రమే భారతీయత కాదు. సమానాంతరమయిన వాగ్వైఖరి కంటె సమరసమయిన సారస్వత జనమానసం, కవిహృదయం, రసదృష్టి, లక్ష్యసిద్ధి లాంటి ఉదాత్త భావసంపద భారతీయ సాహిత్యంలోని భారతీయతను నిరూపిస్తుంది. వాక్కుకూ, మనస్సుకూ అతీతమయిన ఆత్మతత్త్వాన్ని అందరికీ

అర్థమయ్యే పదజాలంలో పండితపామరులను ఒకేవిధంగా ఆకట్టుకునే ఆపాతమధురశైలితో పొదిగి కావ్యాత్మను జీవాత్మకు సన్నిహితం చేయటమే భారతీయ సాహిత్యం ఇంతవరకు చేస్తున్న సారస్వత కృషి. అర్థానికీ, పరమార్థానికీ ఉన్న అవినాభావ సంబంధాన్ని వాగర్థప్రతిపత్తితో నిరూపించి ప్రాపంచికమయిన అభ్యుదయానికీ, పారమార్థికమయిన నిశ్శ్రేయస్సుకూ పాటుపడటమే భారత భారతి పరమావధి. వాక్కును వెలయించే మానసం వాగ్విలాసానికి వెన్నెముక. అదే భారతీయ భాషా సాహిత్యాలలోని భారతీయత.

ఆధునిక విజ్ఞానం దేశకాలాలను పరిమితిం చేసి మనిషికి విశ్వజనీనత చేకూర్చటంలో ఎన్నడూ ఊహించని విజయం సాధిస్తున్నది. దూరదర్శనం ద్వారా దేశదేశాంతరాలలోని సంఘటనలు, సంభాషణలు, జ్ఞానవిజ్ఞాన వివరాలు ఒక్కక్షణంలో ప్రత్యక్షం అవుతున్నాయి. 'ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరం' అన్న గీతావాక్యాన్ని ఈనాటి విజ్ఞానం చరితార్థం చేస్తున్నది. ఈ సందర్భంలో సారస్వత స్వరూపమే మారుతున్నది. అయినా సరే భారతీయ సాహిత్యంలోని భారతీయతకు మాత్రం వ్యత్యాసం రాదు. దేశభాషలలోనే కాదు సర్వభాషలలో కూడా ప్రతిపాద్య పదార్థం మానవత్వానికి సంబంధించింది గానే ఉంటుంది. ఈదృష్టితో చూస్తే మానవులంతా ఒక్కటే. మానవులందరూ ఒకటే అయినప్పుడు జీవితాన్ని నిర్వచించి నిరూపించే సాహిత్యం కూడా సమానంగానే ఉంటుంది. కాని భారతీయతలో భావుకత ఉంది.

'భా' అనే ఏకాక్షర పదంలోని వెలుగూ, రతి శబ్దంలోని అనురక్తి –రెండూ కలిసి భారతీయత అనే భావాన్ని నిష్పన్నం చేస్తాయి. భారతీయత అంటే వెలుగుపై మమకారం అని అర్థం. అంధకారాన్ని అధిగమించి ఆలోకాన్ని అందుకోవటం భారతీయ సాహిత్యంలోనే కాక భారతీయ దర్శనంలో కూడా ప్రాణనాడిగా స్పందిస్తుంది. అంధకారం కేవలం భౌతికరూపంలోనే కాక మానసికంగా బౌద్ధికంగా సామాజికంగా ఆధ్యాత్మికంగా కూడా ఉండవచ్చు. అన్నివిధాలా అంధకారాన్ని తొలగించి అఖండకాంతి లావణ్యాన్ని జనమానసంలో ప్రతిష్ఠింపచేయడం భారతీయ సాహిత్యం నాలుగయిదు సహస్రాబ్దాల నుండి సాధిస్తూ వచ్చిన అక్షర విభూతి. అక్షరం ఆలోకానికి ఆధారం అని భారతీయుల విశ్వాసం. అక్షరం నుంచే సకల చరాచర విశ్వం ఉదయిస్తుందని మహర్షుల మహావాక్యం. అలాంటి అక్షరభారతిని ఆరాధించటం భారతీయ సాహిత్యంలోని విశిష్టత. అసత్తును నిరూపించి సత్తును సాధించటం, చీకటిని తొలగించి వెలుగును వెలయించటం, నశ్వర పదార్థాలనిర్జించి అవినశ్వరమయిన ఆత్మతత్త్వాన్ని ఆత్మగతం చేసుకోవటం భారతీయ సాహిత్యంలోని ప్రత్యేకత. ఇదే భారత భారతిలోని అక్షరభారతి.

అనేక భాషా బాహుళ్యంలో సన్నిహితమై సంచరించే సారస్వత భావసమీరాన్ని

అందుకునేందుకు వాగ్దేవికి వాత్సల్యనిలయమైన భారతీయ జ్ఞానపీఠ్ 1965 నుంచి ప్రయత్నిస్తూ వచ్చింది. భాషా భేదాన్ని విస్మరించి భారతీయ సాహిత్యంలోని భారతీయతను మాత్రమే గుర్తించి పదిహేనుభాషల్లో వెలువడిన సాహిత్యాన్ని సమరస దృష్టిలో పరిశీలించి సమగ్ర భారతీయ వ్యక్తిత్వాన్ని అన్వేషించి మధించటం జ్ఞానపీఠ్ సాధించిన సాత్త్విక సారస్వత దిదృక్ష. ఇంతవరకు వాగ్దేవి వరద హస్తాన్ని పొందిన వాఙ్మయతపోధనుల సారస్వత సేవను పరిశీలించి చూస్తే భారతీయ సాహిత్యంలోని భారతీయత చాలావరకు బోధపడుతుంది. ఇలాంటి కృషి ఇంకా ఎంతో చెయ్యవలసిన అవసరం ఉంది. అన్ని భాషలలోని అనర్ఘ రచనలకు అనువాదం ద్వారా కాని పరిశోధనలద్వారా కాని పరిచయ సాహిత్యంవల్లకాని అఖిల భారతీయ స్థాయిలో ప్రచారం లభించాలి. మంచి రచనలు ఏ భాషలో వెలువడినా అవి అన్ని భాషల వారికి అందుబాటులో ఉండాలి. ఇరుగు పొరుగు భాషల్లోని వాఙ్మయసాధనను అర్థంచేసుకుని తమ భాషకు స్వస్వరూపంతో పాటు విశ్వరూపం లేక కనీసం జాతీయత చేకూర్చేందుకు దక్షులయిన భారత భారతీయులు అంతఃకరణ శుద్ధితో ప్రయత్నించాలి. అప్పుడే భారతీయ సాహిత్యంలోని భారతీయత అనుభవగమ్యమవుతుంది.

# దేశ భాషలు - తెలుగు

"దేశమంటే మట్టికాదోయ్ -దేశమంటే మనుషులోయ్"- అన్నాడు దేశభాషలను గట్టిగా పరిశీలించిన దిట్ట కవి గురజాడ. మనిషి మట్టిలోనే పుడతాడు, మట్టిలోనే కలిసిపోతాడు. కానీ మట్టికీ మనిషికీ చాలా వ్యత్యాసముంది. మట్టి కదలదు. మనిషి కదులుతాడు. మట్టి మాట్లాడదు. మనిషి మాట్లాడుతాడు. మట్టి ఆలోచించదు. మనిషి ఆలోచిస్తాడు. కాని మనిషికి యిలా కదిలి కదిలించే శక్తి, మాట్లాడి మాట్లాడించే నేర్పు, ఆలోచించి ఆలోచింపచేసే ప్రజ్ఞ మట్టినుంచే వస్తాయి. మట్టిని ఆధారం చేసుకునే నీరు, నిప్పు, గాలి, అకాశం జీవులకు జీవం పోస్తాయి. మట్టి బొమ్మలాంటి మనిషి ఈ జీవశక్తిని తనలో జీర్ణించుకొని వాఙ్మనస్సుల సహకారంతో అవాఙ్మానసగోచర మయిన ఆత్మతత్త్వాన్ని కూడా అవగాహన చేసుకునేందుకు ప్రయత్నిస్తాడు. మట్టికి కట్టుబడి వున్నంత వరకు మనిషిలో చైతన్యం ఉదయించదు. కానీ ఆ మట్టిలోని మాధుర్యాన్ని సామర్థ్యాన్ని ఆంతర్యాన్ని గ్రహించి నింగినీ, నేలనూ తన వాక్సూత్రంలో బంధించ గలిగిననాడు అలాంటి మనుష్యులు మెట్టిన మట్టి, దేశ మనిపించు కుంటుంది. దేశమంటే ఇలాంటి మనుష్యుల మనో నిలయమే కాని మట్టితో కట్టుకున్న బొమ్మరిల్లు కాదని కవి గురజాడ ఆశయము.

నిజానికి గురజాడ ప్రవచించిన యీ నిర్వచనం ఏక దేశంగా యే ఒక్క దేశానికోగాక ప్రపంచంలోని అన్ని దేశాలకూ వర్తిస్తుంది. దేశమంటే కేవలం కొండలూ, గుహలూ, చెట్లూ, చేమలూ, మేడలూ, మిద్దెలే కాదు. ఆదేశంలో నివసించే మనుష్యుల మనస్సులూ, మాటలూ ఆ దేశానికి నిర్దిష్టమైన రూపాన్ని ఇస్తాయి. దేశాన్నిబట్టి వేష భాషలు మారుతాయి. వేషం కంటే భాష ప్రధానం. భాషకంటె భావం ప్రధానం. వ్యక్తిగత భావం కంటె జాతీయ జీవితం ప్రధానం. భాషలు జాతికి జీవధారల వంటి వంటాడు శామ్యూల్ జాన్సన్. ప్రతి భాషా ఒక దేవాలయంలాంటిదంటాడు మరో భాషాతత్త్వజ్ఞుడు హోమ్స్. ఇలాంటి భాషామందిరాల్లో ఆ భాషమాట్లాడే వాళ్ళ ఆత్మ విగ్రహంలాగా ప్రతిష్ఠించబడిఉంటుందట. మనిషి విలువ మాటల్లోనే వుంటుంది. కాలు జారినా ప్రమాదం లేదు కాని, నోరు జారితే సరిదిద్దు కోవటం సాధ్యం కాదని అంటారు. భారతీయ భాషా కోవిదులు కూడా భాషను దేవిగా ఆరాధించారు. భారతి, వాణి, సరస్వతి, వాగ్దేవి, వాఙ్మయి అని అనేక నామాలతో భాషాయోషకు భారతీయులు రూపకల్పన చేసుకున్నారు. 'శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికాహార'ముల

కంటె తెల్లగా చల్లగా ఉల్లాసంగా హృల్లాస్యంతో షోడశ కళలతో కళకళలాడే భారతిని తన హృదయములో సాక్షాత్కారించు కోగలిగిన సుదినం ఎన్నటికో అని పోతనామాత్యుడు ఆరాటపడుతాడు. ఈ భారతీయ తల్లినే బ్రహ్మాండపురాణం 'భాషా రూపా బృహత్సనాభావాభావ వివర్జితా" అని కీర్తించింది. భావాలకూ అనుభవాలకూ అతీతమైన ఆత్మ సామ్రాజ్యంలో అంతులేని అక్షర సైన్యంతో అక్షయ సౌభాగ్యాన్ని అనుభవించే మధురాక్షరి పరమేశ్వరి. ఈ కనుపించే ప్రపంచమంతా వాగ్దేవతవెలయించే వాగ్విలాసమని వేదాలు ఘోషిస్తాయి. బ్రహ్మపదార్ధమంటే అసలేమిటని ప్రశ్నించిన పార్థునికి సూటిగా సమాధానం చెబుతూ 'అక్షరమే పరబ్రహ్మ' అంటాడు పార్థసారథి. అక్షరం ఆకాశ లక్షణం. అక్షరజీవి మానవుడు మట్టిలో పుట్టి మట్టిలోని మహత్తును ఆకాశానికి అందజేస్తాడు. ఆ విధంగా తాను ఆకాశాన్ని అందుకుంటాడు. ఇదంతా భాష ప్రసాదించే భావనా పీయూషం.

భాషకు ఇంతటి అమోఘమైన శక్తి వున్నదన్న సత్యం భారతదేశం వేదనాదాలు వెలసిననాడే గమనించింది. భారతదేశమంటేనే వెలుగు కోసం కరిగిపోయే దేశమని అర్థం. ఈ వెలుగును భారతీయులు తమ ఎలుగులోనే కనుగొన్నారు. కన్నదాన్ని కమ్మని కంఠంతో ఎలుగెత్తి కీర్తించారు. ఆ గానమే భారతీయ భాషారతికి తార్కాణంగా దేశం నాలుగు మూలలా వినిపించింది, నినదించింది. దానికి దేశంలోని ప్రతి హృదయం స్పందించింది, ఆనందించింది. భారత భారతి అనేక భాషల్లో వెలసింది. భాషలు వేరు. కానీ భావం దాదాపు ఒకటే. దాదాపు ఒకే సమయంలో దేశం నలుమూలలా రామాయణం, భారతం, భాగవతంలాంటి ఉద్గ్రంథాల్లోని భావలహరి సహృదయుల హృదయాలవాలాల్లో ఉదయించి ప్రసరించటం ఇందుకు ప్రమాణం. ఒక వైపు వల్లభుని వాల్లభ్యాన్ని చేయూతగా తీసుకొని సూరదాసు శ్యామసుందరుని రూప లావణ్యాన్ని, గాన మాధురిని తన్మయత్వంతో కళ్ళు మూసుకొని కీర్తిస్తూవుంటే, మరోవైపు అదే సమయంలో భక్తకవి పోతనామాత్యుడు భాగవత పరమార్థాన్ని మందార మకరందంతో రంగరించి పదిమందికి పంచిపెట్టడం భారతీయ సాహిత్యంలోని సామరస్యానికి చక్కని నిదర్శనం. ఈనాటికి కూడా సాహిత్యంలో జరుగుతున్న సరిక్రొత్త ప్రయోగాలు అన్ని భాషల్లో దాదాపు సమాంతరంగా కనిపించటం భారత భారతీయులకు ఆనందకరమైన విషయం.

మనదేశ భాషలను సమగ్రంగా భారతీయదృక్పథంతో చూచి నపుడు కలిగే ఆనందం వేరు, ప్రత్యేకంగా తన భాషలోని ఇంపు సొంపులను చూచి తనలోతాను మురుసుకుపొయ్యేప్పుడు వచ్చే ఆనందం వేరు. మొదటిది సామూహికం. రెండవది వ్యక్తిగతం. నిజానికి సాత్వికమైన సారస్వత వికాసానికి రెండు రకాల ఆనందాలూ అవసరమే. రెండింటికి విరోధం మాత్రం రాకూడదు. తన భాష గొప్పదని చెప్పుకోవడంలో తప్పులేదు, కాని పర

భాషలను గౌరవించి వాటిలోని మంచిని గ్రహించడము కూడా అవసరం. పరభాషా పరిచయం స్వభాషకు భూషణమే అవుతుంది.

ఇలాంటి సమన్వయాత్మకమైన దృక్పథం తెలుగు భాషకు, తెలుగు జాతికి, తెలుగు నాటికి సహజంగా నైసర్గికంగా అలవడింది. తెలుగునాడు మనదేశంలో ఉత్తర దక్షిణాలకు సాంస్కృతిక సేతువుగా నెలకొని వుంది. తమిళం, కన్నడం, మరాఠి, ఒరియా, హిందీ మనకు నలుమూలలా వినిపించే భాషలు. సంస్కృతం తోటి సన్నిహితమైన సంబంధాన్ని పెంచుకుంటూనే తెలుగు భాష ద్రావిడ భాషలలోని సౌకుమార్యాన్ని పంచుకుంది. పట్టుదలకు అవసరమైతే ఒక్క సంస్కృత పదం రాకుండా కావ్యాలు వ్రాయగల సామర్థ్యం తెలుగు కవులు తమ రచనల ద్వారా ప్రదర్శించారు. పోటీకి వస్తే సంస్కృత భాషలోకూడా ఒదగని దీర్ఘ సమాసాలతో "అంబరచుంబి శిరస్సరర్ఝరీపటల" పటాటోపంతో పద్య మాలికలు అల్లిన అల్లసాని పెద్దనలు కూడా మన భాషా సారస్వతాలను అలంకరించారు. ఒకవైపు గాంభీర్యం, మరోవైపు లాలిత్యం –రెండింటి సాద్గుణ్యాన్ని సౌజన్యంతో స్వీకరించి తెలుగు వెలుగును సరియైన పద్ధతిలో వెలయించిన వాగ్ధనులు వెలసిన నేల కావడం వల్లనే కొందరు సహృదయులు దేశ భాషలలో తెలుగుకు ఒక విశిష్టమైన స్థానంవున్నదని గుర్తించారు. ఆ గుర్తింపు తెలుగు దేశానికి కొంచం దూరంగా వున్న గుణజ్ఞులనుంచి లభించటం సంతోషించవలసిన విషయం. ఎన్నడూ యే ఇంటికి వెళ్ళని పెద్ద మనిషికి తన ఇల్లే ఇంద్రభవనంలా కనిపిస్తుంది. ఇరుగు పొరుగు భాషలతో పోల్చుకొని చూస్తేనేకాని తన భాషలో వుండే సౌలభ్యం, సౌందర్యం పూర్తిగా బోధపడదు.

ఈ దృష్టితో పరిశీలించి చూస్తే తెలుగు నిజంగా చాలా సమృద్ధమైనభాష అనిపిస్తుంది. స్పష్టమైన ఉచ్చారణ, సమగ్రమైన వర్ణమాల ప్రతి భాషకు వుండవలసిన రెండు ముఖ్య లక్షణాలు. ఒకవిధంగా ఈ రెండు లక్షణాలు ఒకదానిపై మరొకటి ఆధారపడివుంటాయి. వర్ణమాల సమగ్రంగా వుంటేనేగాని ఉచ్చారణ స్పష్టంగా నిర్దిష్టంగా వుండదు. కొన్ని భాషల్లో ఖ, ఘ, ఛ, ఝ, థ, ధ లాంటి మహా ప్రాణాక్షరాలే లేవు. అలాంటప్పుడు కాంతికీ గాంధికీ భేదమే ఉండదు. కొన్ని భాషల్లో వకారమే లేదు. వామనుడు బామనుడవుతాడు, అరవిందుడు అరబిందుడు అవుతాడు. కొన్ని భాషల్లో యకారాన్ని జకారంతో ముడిపెట్టడం జరుగుతుంది. యమున జమునగా మారుతుంది. యాదేవిని సంబోధించి జాదేవి అనటం జరుగుతుంది. కొన్ని భాషల్లో సకారం కనిపిస్తుంది కానీ ఉచ్చారణ మాత్రం హకారంతో కలిసిపోతుంది. శతాయుర్భవ అనబోయి 'హతాయుర్భవ' అన్నా ఆశ్చర్యంలేదు. కొన్ని భాషల్లో అందరికీ నోరు తిరగని ధ్వనులు ఉంటాయి. కొన్ని భాషల్లో పరుషాలు వ్రాతలో కనిపిస్తాయే కాని ఉచ్చారణకు వచ్చేసరికి అవి అతి సరళంగా మారిపోతాయి. కొన్ని భాషల్లో సంయుక్తాక్షరాలకూ ద్విత్వాక్షరాలకూ వ్యత్యాసం ఉండదు. 'లక్ష్మి' అని సలక్షణంగా వ్రాస్తారు. కాని 'లక్కి' అని పలుకుతారు (ఆంగ్లంలో 'లక్కీ' శబ్దం ఇలానే వచ్చిందేమో!) కొంతమంది సంయుక్తం లేనిచోట

సంయుక్తం చేస్తారు. ఉన్నచోట తీసేస్తారు. ప్రకాశాన్ని పరకాశం చేస్తారు. పరీక్షను ప్రీక్షగా మారుస్తారు. ఇలాంటి ఒడుదుడుకులు తెలుగులో తక్కువ అనిపిస్తుంది. ముఖ్యంగా కావలసిన ధ్వనులన్నీ ఉన్నాయి. వాటికి సరియైన చిహ్నాలూ ఉన్నాయి. ఉచ్ఛారణ దోషాలు ఏమయినా ఉంటే అవి సామాన్యంగా వ్యక్తిగతాలే కాని భాషాగతాలు కావు. మిగిలిన భాషలలోని సాహిత్యాన్ని తెలుగు లిపిలో వ్రాయవలసి వచ్చినప్పుడు కొన్ని చిక్కులు రావడం సహజం. దానికి కొంత సంస్కరణ, విస్తరణ అవసరం. కాని తెలుగుకు సంబంధించినంత వరకు తెలుగు వర్ణమాల స్వతస్సమృద్ధిమైనదనే చెప్పవచ్చు. కొన్ని భౌగోళిక కారణాలవల్లనైతేనేం, మరో కారణం వల్ల అయితేనేం తెలుగుల ఉచ్చారణ నిర్దుష్టంగా స్పష్టంగా ఉంటుందనే చెప్పవచ్చు.

ఇక పలుకుబడి విషయం పరిశీలిస్తే కొన్ని భాషల్లో అక్కకూ చెల్లెలికీ, అన్నకూ తమ్ముడికీ, నిన్నటికీ రేపటికీ భేదం లేదు. తెలుగులో ఈభేదం స్పష్టంగా వుంది. అలాగే అతడు, ఆమె, అది–మూడింటికీ చాలా భాషల్లో–ముఖ్యంగా ఉత్తరాది భాషల్లో–ఒకటే సర్వనామం వుంది. అది మగా, ఆడా, ఈరెంటిలో ఏదీ కాదా అనే విషయం క్రియదాకా వస్తేగాని తెలియదు. ఇలాంటి మృదంగ సందేహం తెలుగులో లేదు. కాని తెలుగులో నేను, మేము, నీవు, మీరు అనే వాటికి స్త్రీ లింగంలో, పుంలింగంలో కూడా క్రియా రూపం ఒకటే. ఉత్తరాది భాషల్లో కొన్నింటిలో ఈభేదం ఉంది. కొన్నింటిలో లేదు. మలయాళంలో క్రియ చాలా తక్కువగా మారుతుంది. కాలం మారితేనే గాని క్రియ మారదు. ఇలా ప్రతిభాషకూ పలుకుబడిలో కొంత ప్రత్యేకత ఉంటుంది. ఏది యెలా ఉన్నా ఎవరి తీరువాళ్ళకు తీపి. అది సహజం.

సారస్వతం అన్నిటికంటె ప్రధానమైన విషయం. లిపి దుస్తులవంటిది. భాష శరీరం వంటిది. కాని సారస్వతం ఆత్మ మనస్సుల వంటిది. ఒక జాతి మనస్తత్వం, ఆత్మవైభవం ఆజాతి సృష్టించుకొనే సారస్వతం లేక సాహిత్యంలో ప్రతిబింబించి ఉంటుంది. సాహిత్యం ఎంత పటిష్ఠంగా ఉంటే ఆ భాషకు అంత గౌరవం ఏర్పడుతుంది. ఈదృష్టితో తెలుగు సాహిత్యాన్ని పరిశీలించాలి. ఇతర భాషలతో పోల్చి చూస్తే తెలుగు సాహిత్యం అన్నిటికంటె ప్రాచీనమైనది కాదు. అన్నిటికంటె సమృద్ధమైనది కాదు. కాని భారతీయ సాహిత్యానికి పరువు, ప్రతిష్ఠ తెచ్చిపెట్టే పటిష్ఠమైన రచనలు తెలుగులో విరివిగానే జరిగాయని చెప్పడంలో తప్పులేదు.

భారత సంహితా రచనతో తెలుగు సాహిత్యం ఆరంభించింది. దాదాపు మూడు శతాబ్దాలపాటు మూడు మూర్తులలాంటి ముగ్గురు మహాకవులు చేసిన వాఙ్మయ తపస్సుకు ఫలితంగా తెలుగు వారికి మహాభారతం లభించింది. 'వింటే భారతం వినాలి, తింటే గారెలు తినాలి' అన్న నానుడి తెలుగు సమాజంలో భారతానికి ఉండే ప్రాశస్త్యాన్ని నిరూపిస్తుంది.

కవిత్రయంలో మధ్యముడు మేధాశక్తికి మేలుబంతి అయిన తిక్కన సోమయాజి హరిహరాత్మకమైన ఆరాధనను ఏ శుభముహూర్తంలో భావించుకొన్నాడోగాని ఆ తర్వాత తెలుగు సాహిత్యం రెండు జీవధారలను ప్రవహింపజేసింది. కవిత్రయ కాలంలోనే శైవ వాఙ్మయం జాను తెలుగులో జానపదులకు కూడా అందుబాటులో ఉండేలా జనప్రియ సాహిత్యంగా రూపొందింది. ఇంచుమించు అందే సమయంలో రామాయణ రూపంలో వైష్ణవ సాహిత్యం కూడా వెలువడింది. పాల్కురికి సోమనాథుని బసవ పురాణం నుంచి పుట్టపర్తి నారాయణాచార్యుల వారి శివతాండవం వరకు ఈ శైవసాహిత్యం అజస్రంగా తెలుగు నాట ఈనాటివరకు ప్రవహిస్తూ వచ్చింది. అలాగే రంగనాథ రామాయణం నుంచి విశ్వనాథ రామాయణం వరకు రామకథా రసవాహిని తెలుగు నేలను సారవంతమేకాక రసవంతం కూడా చేసింది. భారత సంహితను ప్రబంధమండలిగా భావించిన తిక్కన భావనాశక్తి ఫలించి తెలుగు సారస్వతం పటుత్వంగల కవిత్వంతో కూడిన ప్రబంధ కావ్యాలను లెక్కలేకుండా దక్కించుకుంది. ప్రబంధ కవితా పితామహుడు స్వారోచిషమను సంభవ వృత్తాంతాన్ని ప్రబంధ శైలిలో వ్రాసి చూపిస్తే జడ చేతన సామరస్యాన్ని సంగీతంలాంటి శ్రుతిమధుర పదజాలంలో నిరూపించాడు వసుచరిత్రకర్త భట్టుమూర్తి. కళాపూర్ణోదయం లాంటి కావ్యాలు ప్రపంచంలోని ఏ ఉత్తమ కావ్యానికయినా సరితూగుతాయి. పాండురంగ మాహాత్మ్యంలోని అక్క లాంటి పాత్రలు ఆంధ్రులకు ఇంటింటి ఆడపడుచులా నిలిచిపోయారు. కావ్యజీవులయిన కవిపుంగవులే కాక కవులను పోషించిన మహారాజులు కూడా ఆముక్తమాల్యదలాంటి అమూల్య రచనలు చేశారు. ఒక కావ్యంలో రెండు మూడు అర్థాలు వచ్చేట్టు రాఘవ పాండవీయంలాంటి ద్వ్యర్థి కావ్యాలు అవతరించాయి. సంస్కృతం లేకుంటే మా భాషకు లోటేమీ లేదని నీటు తెలుపుకొనేందుకు కూచిమంచి తిమ్మకవి అచ్చతెనుగులో రామాయణంలాంటి కావ్యాన్ని వెలయించాడు. సంస్కృత కావ్యాలను మరిపించే సిసలైన తెలుగు కావ్యాలు శ్రీనాథుని సీసపుపోతలో అవలీలగా వెలువడ్డాయి. ఎవరి దృష్టికీ తగలని భాగవత మహాపురాణాన్ని తెలిగించడం తన అదృష్టమని భావించి పోతనామాత్యుడు తన జన్మను సఫలం చేసుకున్నాడు.

తంజావూరులో తెలుగు భారతి శృంగార వీథుల్లో విహరించే రోజుల్లో తిరువారూరు పరిసరాల్లో త్యాగయ్య రాగసుధారసంతో రామకథామధువును మేళవించి దక్షిణ దేశాన్నంతా రసప్లావితం చేశాడు. త్యాగరాజు నోట వెలువడిన రససిద్ధ వాక్కు భాషాభేదాన్ని మరిపింపజేసి నిజమైన భావ సమైక్యాన్ని నెలకొల్పింది. రామదాసు కీర్తనలు భక్తికీ, క్షేత్రయ్య పదాలు శృంగారానికీ పెన్నిధులై వెలసిన తెలుగు సారస్వతంలోనే అన్నమాచార్యులు అన్నిటికీ సమన్వయం చేకూర్చి పద కవితాపితామహుడయినాడు.

ఇలా ప్రాచీన తెలుగు వాఙ్మయం సర్వతోముఖంగా వికసించి దేశభాషల్లో తెలుగుకు గౌరవ ప్రతిష్ఠలు సంపాదించి పెట్టింది. ఈ కాలంలో కూడా బహువర్ణ బహురూప బహు భంగిమలలో నవ్యసాహిత్యం నిత్య నూతనంగా నవనవోన్మేషంతో ముందుకు సాగుతూ ఉంది. ఇంతవరకు సంస్కృత నందనవనంలో ప్రాణవాయువు పీల్చుకుంటున్న తెలుగు సాహితి యీనాడు ప్రపంచం నలుదిక్కుల నుండి స్వచ్ఛంద సమీరాన్ని స్వేచ్ఛగా సేవిస్తూ ఆరోగ్యకరమైన అభివృద్ధిని పొందుతూ ఉంది. ముఖ్యంగా పాశ్చాత్య ప్రభావం ఆధునికులకు అమోఘంగా ఉపకరించింది. రాయప్రోలు, కృష్ణశాస్త్రిలాంటి వారు ఈమార్గాన్ని చూచాయగా చూపిస్తే శ్రీశ్రీ, ఆరుద్ర, శేషేంద్రలాంటి వారు ఈనూతన మార్గంలో బాగా పురోగమించారు. షెల్లీ, వర్డ్సువర్తు, స్విన్‌బర్న్, విట్మన్‌లాంటి పాశ్చాత్య కవుల భావలహరిని పూర్తిగా జీర్ణించుకొని సొంత గొంతుకతో సమకాలిక సమస్యలకు సారస్వత సారూప్యాన్ని ప్రసాదించిన యువకవులు, మహాకవులు కవి సార్వభౌములు అనేకులు ఈనాడు మన మధ్య ఉన్నారు. ఈనాటి తెలుగు సారస్వతం వెయ్యి సంవత్సరాల నిర్విరామ కృషికి ఫలితంగా పండిన–పండుతున్న –పండనున్న–పంట.

వెయ్యి సంవత్సరాల పంట ఒక యెత్తు. ఈ శతాబ్దపు పంట మరో యెత్తు. ఇంతవరకు అవరోధంగా ఉన్న దేశకాల పరిధులు ఈ శతాబ్దంలో చాలావరకు అంతరించాయి. ప్రపంచమంతా ఒక కుటుంబంగా జీవించగల అవకాశం ఈనాటి పౌరుడికి ఉంది. ఇది సారస్వత జీవికి అమోఘమైన వరదానం. ఈ అవకాశాన్ని తెలుగువారు బాగా ఉపయోగించుకున్నారనే చెప్పాలి. పాశ్చాత్య సాహిత్యమే కాక భారతీయ భాషల్లో వెలువడిన సాహిత్యాన్ని కూడా తెలుగు రచయితలు బాగా గమనించి మంచి మంచి భావాలు, మంచి మంచి మాటలు, మంచి మంచి మార్పులు ఎక్కడ కనిపిస్తే అక్కడ వాటిని ఆకళింపు చేసుకొని తన భాషను, తన సారస్వతాన్ని పోషించుకొనే సద్బుద్ధి యీ శతాబ్దంలో వెలువడిన సాహిత్యంలో కనిపిస్తుంది.

సంస్కృతం, ఆంగ్లం తర్వాత హిందీ సాహిత్యంతో తెలుగుకు ఎక్కువ సన్నిహితత్వం ఏర్పడ్డదని చెప్పాలి. తులసీ రామాయణంలాంటి ప్రాచీన కావ్యాలేకాక కామాయని, కురుక్షేత్ర, పంచవటి, చిదంబర, కన్నీరు లాంటి ఆధునిక హిందీ కావ్యాలు కూడా తెలుగులో కావ్యరూపంలో వచ్చాయి. అలాగే భాగవతం, రంగనాథ రామాయణం, మొల్ల రామాయణం, మనుచరిత్రలాంటి ప్రాచీన కావ్యాలేగాక శ్రీశ్రీ, కుందుర్తి, శేషేంద్ర, దాశరథి, ఆరుద్ర, నారాయణరెడ్డి లాంటి అధునాతన రచయితల కావ్యాలు కూడా హిందీలో లభిస్తున్నాయి. స్వాతంత్ర్యోత్తర కాలంలో ఇలాంటి ఆదానం ప్రదానం ఎక్కువగా జరిగింది. సాహిత్య అకాడమీలు, నేషనల్ బుక్ ట్రస్ట్, భారతీయ జ్ఞానపీఠ్ లాంటి సారస్వత సంస్థలు ఇలాంటి కృషికి పూనుకున్నాయి.

ఆంధ్రదేశానికి రాజధాని హైదరాబాదు అయిన తర్వాత ఉర్దూతో కూడా తెలుగు సహజీవనం అలవరచుకుంది. అంతకుముందు తెలుగు దేశంలో తెలుగుభాషలో చక్కని కావ్య రచన చేయగలిగిన పెక్కుమంది మహమ్మదీయ సోదరులు ఉండేవారు. షేక్‌దావూద్, ఉమ్రాలీషాలు తెలుగు సారస్వ తానికి చేసిన సేవ మరువరానిది. ఉర్దూ సాహిత్యంలోని సొగసులను గజళ్ళ రూపంలో కవాలీ రూపంలో తెలుగులకు అందించిన సహృదయుల్లో దాశరథి, నారాయణరెడ్డి చెప్పుకోదగిన వారు. ఇటీవల బెజవాడ గోపాలరెడ్డిగారు ఉర్దూలో ఉండే ప్రణయ కవితను తెలుగులకు చవిచూపించేందుకు పద్యకాలను సృష్టించుకున్నారు. తెలుగు సారస్వత చరిత్ర ఉర్దూలోను, ఉర్దూ సారస్వత చరిత్ర తెలుగులోనూ లభిస్తున్నది.

బెంగాలీలోని ఉత్తమ రచనలు కూడా తెలుగులోకి విరివిగా వచ్చాయి. రవీంద్రుని గీతాంజలిని ఎందరో తెలుగులోకి అనువదించారు. బంకిం, శరత్ రచనలు సమగ్రంగా తెలగులోకి వచ్చాయి. కాని తెలుగు రచనలు బెంగాలీలోకి అంతగా వెళ్ళలేదు. హిందీ-తెలుగు విషయంలో కూడా దాదాపు ఇదే పరిస్థితి కనిపిస్తుంది. దీనికి కారణం ఇతర భాషలు నేర్చుకున్న తెలుగువాళ్ళకంటె తెలుగు నేర్చుకున్న ఇతర భాషీయుల సంఖ్య తక్కువగా ఉండడం. తెలుగులోకి ఇతర భాషల రచనలను అనువదించడం తెలుగువాళ్ళ విధి. కాని తెలుగులో నుంచి ఇతర భాషల్లో అనువదించుకోవడం ఆయాభాషలు మాట్లాడే రచయితల కర్తవ్యం. ప్రస్తుతం ఈ రెండు పనులు తెలుగువాళ్ళు చేస్తున్నారు. ఈ పరిస్థితి మారాలంటే ప్రభుత్వం కాని ప్రభుత్వ సాహాయ్యంతో పని చేసే భాషా సారస్వత సంస్థలు కాని ఈ విషయం కొంత పట్టించుకోవాలి.

ఈనాడు మనదేశంలో నాలుగయిదు భాషలు తెలిసినవాళ్ళు కనీసం రెండు మూడు భాషల్లో సృజనాత్మక రచనలు చేయగలిగిన వాళ్ళు చాలామంది ఉన్నారు. కాని వాళ్ళ ప్రతిభావ్యుత్పత్తులకు సరియైన అవకాశం లభించడం లేదు. గతంకంటె వర్తమానం మెరుగే కాని వర్తమానం కంటె భవిష్యత్తు ఇంకా ఉత్సాహకరంగా ఉండేందుకు కృషి చెయ్యాలి.

అసలు తెలుగులో నుంచి ఇంత వరకు ఇతర భాషల్లోకి వెళ్ళిన రచనలు, ఇతర భాషల్లోనుంచి తెలుగులోకి వచ్చిన రచనలు, వీటిని గురించిన పూర్తి వివరాలు మనకు ఎక్కడా దొరకడం లేదు. అంతర్జాతీయ తెలుగు సంస్థలాంటి వాళ్ళు ఇలాంటి పనులు చెయ్యాలి. ఇంతవరకు జరిగిన కృషి ఏమిటో తెలిస్తే ఇకముందు చేయవలసిన పనిని గురించి ఆలోచించడం సాధ్యమవుతుంది. తెలుగనే కాదు, మరే భాషలోనయినా సారస్వత వికాసం సమగ్రంగా జరగాలంటే ముఖ్యంగా అయిదు రకాల రచనలు ఆ భాషలో రావాలి.

1. ఇతర భాషలవారు గ్రహించి తీరవలసిన రచనలు. సంస్కృత భాషలో భారతం, భాగవతం, రామాయణం, ఉపనిషత్సాహిత్యం, పాణినీయం, పతంజలి మహాభాష్యం, వాక్యపదీయంలాంటి రచనలు వెలువడడంవల్ల ఆభాషకు నైసర్గికమైన పటుత్వం, పలుకుబడి లభించాయి. ఎన్ని అనువాదాలున్నా మూలం చదివితేగాని తృప్తి కలగదనిపించే రచనలివి. బెంగాలీలో గీతాంజలి, మరాఠీలో జ్ఞానేశ్వరి, తమిళంలో తిరుక్కురళ్, తెలుగులో పోతన పద్యాలు, త్యాగరాజ కీర్తనలు, వేమన వాక్యాలు ఇలాంటివే. అన్యాన్య సామాన్యములు కాకపోవడమే వీటిలోని ప్రత్యేకత. ఇటీవలికాలంలో ఇలాంటి రచనలు ఎక్కువగా రావటం లేదు. రావాలి.

2. మాతృభాషకు భిన్నమైన మరో భాషను పూర్తిగా అవగాహనం చేసుకొని ఆ భాషలోని సారస్వతచ్ఛాయలతో స్వభాషను తీర్చిదిద్దే రచనలు కూడా సారస్వత వికాసానికి బాగా తోడ్పడుతాయి. ఆంగ్ల సంస్కృత భాషలలో తెలుగు వారికి బాగా పరిచయం ఏర్పడ్డది. ఇటీవల హిందీ, బెంగాలీలాంటి భాషలతో కూడా సంబంధం కుదిరింది. వీటి ప్రభావం మనభాషలో కనిపించాలి. అలా కనిపించే రచనలు ఎక్కువగా రావాలి.

3. స్వభాషలోని సారస్వత సంస్కారంతో ఇరుగు పొరుగు భాషల్లో స్వతంత్ర రచనలు చేయటం కూడా అవసరం. పరభాషలో చొరవు చేసుకొని మన వాళ్ళు చక్కని రచనలు చేయగలిగితే మన భాషలోని మంచి ఆయా భాషల్లోకి అప్రయత్నంగా ప్రవేశిస్తుంది. సంస్కృతంలో గంగాలహరి, కృష్ణలీలా తరంగిణి లాంటి రచనలు వెలువడినట్టే, ఆధునిక భారతీయ భాషల్లో మనవాళ్ళ రచనలు రావాలి.

4. ఇతర భాషల నుంచి తెలుగులోకి చక్కని అనువాదాలు రావాలి. ఈమధ్య కథలు, నవలలు ఒక భారతీయ భాషనుంచి మరో భారతీయ భాషలోకి చాలా వరకు అనువదించడం జరిగింది. కాని కావ్యానువాదాలు అంత చక్కగా ఎక్కువగా రాలేదు. తెలుగులోని అనువాద సాహిత్యం పట్ల పాఠకులకు అభిమానం కూడా పెంపొందాలి. అనువాదం అనగానే అదోలా ముఖం చిట్లించుకోగూడదు. అప్రయత్నంగా బయటినుంచి మన గదిలోకి ప్రసరించే ప్రాణవాయువులా ఇలాంటి సాహిత్యానికి స్వాగతం పలకాలి. అనువాదకులు కూడా తమ బాధ్యత గమనించి పాఠకుల అభిమానాన్ని పొందే రచనలు చెయ్యాలి. ఆనాడు శ్రీనాథుడు చేసిన అనువాదాలను చక్కగా అనుసరించిన శ్రీశ్రీ అనువాదాలు ఈనాడు దాదాపు స్వతంత్ర రచనల్లాగా చలామణి అవుతున్నాయి. 'ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమసముహోములు', 'ఆనందం అర్ణవమైతే'–లాంటి ప్రసిద్ధ గేయాలు అనువాదాలని చెప్పకపోతే ఎవ్వరికీ అలా అనిపించదు. అలాంటి అనువాదాలు ఈనాడు మనకు కావాలి.

5. అలాగే తెలుగు నుండి ఇతర భాషల్లోకి కూడా విరివిగా అనువాదాలు జరగాలి. జాతీయ బహుమతులు, అంతర్జాతీయ ప్రఖ్యాతి లభించిన రచనలకయినా మిగిలిన భాషల్లో అనువాదాలు రావాలి. బహుమతులు రాని రచనలు కూడా బహుళములై యుండవచ్చు. మొత్తంమీద ఒక భాషలోని ఉత్తమ రచనలు, ప్రపంచానికి అందుబాటులో ఉండాలి. ఇది అనువాదాల వల్ల సాధ్యంకాకపోతే కనీసం పరిచయాత్మకములయిన చిన్న చిన్న సమీక్షా పుస్తకాల ద్వారా కూడా సాధించవచ్చు. ఇటీవల ఇలాంటి పుస్తకాలు కేంద్ర సాహిత్య అకాడమీ వారు చాలా ప్రచురించారు.

ఇలా సర్వతోముఖంగా సారస్వత వికాసాన్ని సాధించగలిగిననాడు 'ఆంధ్రత్వం ఆంధ్ర భాషాచనాల్పస్య తపసః ఫలం', 'దేశ భాషలందు తెలుగులెస్స' అన్న పెద్దలమాటలు మనకు ఆశీస్సులుగా సహకరిస్తాయి. ఒట్టి గొప్పలు చెప్పుకునేకంటే గట్టి పని ఏదయినా చేసి చూపించటం మనుష్యుల ధర్మం అలాంటి మనుష్యులదే దేశం.

# అనువాద సాధన

పార్థివ జగత్తులో ప్రతి జీవికి కొంత ప్రయోజనం ఉన్నట్టుగానే వాక్ప్రపంచంలో ప్రతి వాక్కుకూ, వాక్యానికీ, పదానికీ, అక్షరానికీ కొంత సార్థక్యం తప్పక ఉంటుంది. కాని కేవలం సార్థక్యం చేత ఆ వాక్కు సారస్వత స్థాయి నందుకోలేదు. సారవంతమైన సమర్థ పదవిధి మాత్రమే సారస్వత పరిధిలో చేరగలదు. ఆ సారవంతమైన సామర్థ్యంలో కూడా సామరస్యం అణుమాత్రమైనా లేకుంటే అది కేవలం భావాభివ్యక్తికీ, అవగాహనకూ ఉపకరిస్తుందే కాని హృదయాహ్లాదానికి తోడ్పడదు. సరస రమణీయమైన వాక్కు సర్వ మనోహరంగా ఉంటుంది. ఆ భాషలో పరిచయం లేని వారికి కూడా అందులోని సొంపును, ఇంపును కని విని ఆనందించాలని అభిలాష ఏర్పడుతుంది. ఈ అభిలాషను తీర్చేందుకే అందరికీ అందుబాటులో ఉండే అనువాదాలు అవసరమవుతాయి.

ఇలాంటి అనువాదాలవల్ల ఒక భాషలోని సారస్వతం ఇరుగుపొరుగు భాషల్లోకి ప్రసరించి అన్నింటిలోని భావ సమైక్యాన్ని భావ యోగులకు సాక్షాత్కరింప జేస్తుంది. అందువల్ల ఆత్మవిస్తృతి ఏర్పడుతుంది. తనవరకుతాను పరిమితం కాక, తన వలయాన్ని పెంచుకొని, తన తోటివారి ఆలోచనలను పంచుకొని, మనగలిగిన మంచితనాన్ని పదిమందికి పంచిపెట్టడం మనసును మలిచే ఆత్మలక్షణం. ఈ లక్ష్యానికే సమస్త సారస్వతం అంకితమవుతుంది. అదే సారస్వత పరమావధి. దీనికి అనువాదాలు తోడ్పడినట్టుగా మరో సారస్వత ప్రక్రియ తోడ్పడదు. నిజానికి మంచి మాటలు, మంచి ఆలోచనలు, మంచి మంచి ఆశయాలు, ఆదర్శాలు ఏ దేశంలో ఏ భాషలో ఎప్పుడు ఉదయించినా అవి సమస్త మానవ జాతికి చెందుతాయి. అందరికీ వాటిపై అధికారం ఉంటే భాషాభేదం అందుకు అవరోధం కల్పించలేదు. సారస్వత సంప్రసారానికి భాష సన్నని అవరోధం. ఈ సన్నని పొరను అనువాద సాధన అవలీలగా తొలగించగలదు. కాని రమణీయమైన వాక్కును రసపిపాసువులకు అందించేందుకు కమనీయమైన హృదయం కావాలి. అదే అనువాద సాధనకు ఆధారం. యోగశాస్త్రంలో పరకాయ ప్రవేశం ఎంత దుష్కరమో, కావ్యశాస్త్రంలో పరభావ ప్రవేశమనదగిన అనువాదం అంత సున్నితమైన ప్రక్రియ. అనువాదమంటే కేవలం పదపరివర్తన కాదు. పద హృదయ సంపాదన నిజమైన అనువాద సాధనకు నిదర్శనం.

కాని యిటీవల రెండు మూడు దశాబ్దాల నుంచి అనువాదాలకు ప్రాచుర్యం హెచ్చింది. అనువాదకులకు ప్రాముఖ్యం తగ్గింది. అనువాదాల సంఖ్య హెచ్చేందుకు అనేక కారణాలు ఏర్పడ్డాయి. స్వాతంత్ర్యం రాక పూర్వం అనువాద కార్యం దాదాపు స్వతంత్రంగా, స్వచ్ఛందంగా, ఇచ్ఛాపూర్వకంగా జరిగేది. ఆ తర్వాత భావ సమైక్య పరివాహంలో అనేకవిధాల సాధనలతోపాటు అనువాదసాధన కూడా అసంఖ్యాకములయిన పడవలను నడిపించింది. ఇందులో కొన్ని గట్టి పడవలు మాత్రం కాలానికి తట్టుకుని గట్టు జేరుతాయి. సంఖ్య పెరగటం ఒకవిధంగా మంచిదే. కాని సంఖ్యతోపాటు సామర్థ్యం, సార్థక్యం రెండూ సరియైన పాళ్ళలో అభివృద్ధి చెందాలి. అప్పుడే అనువాదాల మీద, అనువాదకుల పట్ల గౌరవం, అభిమానం, ఆదరం పెరుగుతుంది. ఈమధ్య మరీ అనువాదమంటే అదో మరలా తయారయింది. 'ఈ పుస్తకం ఈ వ్యవధిలోగా ఈ పద్ధతిలో ఫలానా భాషలోకి తర్జుమా చెయ్యాలి. మీకు తీరుబడి ఉంటుందా?' అని అడగటం, తీరుబడి లేకపోయినా తీసుకొని తిప్పించటం, చివరకు అక్షర లక్షకు అక్షర రక్షను ప్రత్యక్షం చేసి పని పూర్తయిందనిపించడం అనువాద సాధనకు పరమావధి అయింది. పుస్తకం మీద మమకారంగానీ, వాక్యశిల్పం పట్ల అభిమానం కాని, సారస్వత సంప్రసారం కోసం సహజంగా ఉత్సహించే ఉల్లసిత మనస్సుగాని లోపించడం వల్ల అనువాదం పరాధీనమయిపోయింది. వచ్చే దశాబ్దంలో దీనికి స్వాధీనత సాధించగలిగితే యీ సదస్సు సార్థకం అవుతుంది.

అనువాదాల ద్వారా ఆరోగ్యవంతమైన సారస్వత సంప్రసారం ఆంధ్రభారతి ఆవిర్భవించినప్పటి నుంచి సాగుతూనే ఉంది. ఆదికవి నన్నయ వ్యాసభారతాన్ని ఆంధ్రీకరించటంతో తెలుగులో కావ్య రచనకు శ్రీకారం చుట్టగా కవిత్రయ కావ్యసాధన ఈ ప్రక్రియను విజయవంతంగా కొనసాగించింది. భక్త కవి పోతనామాత్యుడు విద్యావంతులకు పరీక్షాగ్రంథమైన భాగవతాన్ని తెలుగువారికి అందించి మూలాన్నే మరిపించాడు. అలాగే నైషధం, కుమార సంభవం లాంటి కావ్యాలను తెలుగు నుడికారంతో తెలుగువారికి అందుబాటులో ఉండేట్టు చేశాడు – సకల విద్యాసనాథుడు, శ్రీనాథుడు. అనేక సంస్కృత కావ్యాలు, పురాణాలు, నాటకాలు తెలుగులోకి గద్య పద్య రూపంలో నాటి నుంచి ఇటీవలి కాలం వరకు వస్తూనే ఉన్నాయి.

ఆంగ్లంతో సంపర్కం ఏర్పడిన తర్వాత సంస్కృతానువాదాల సంఖ్య తగ్గి తెలుగు అనువాదాలు కొత్త వెలుగును సంతరించుకున్నాయి. కాని ప్రాచీనాంధ్ర కవులకు అనువాద సాధనపై ఉన్నంత అభిమానం, అధికారం రాను రాను తరువాతి కవులలో ఉన్నట్టు తోచదు. పాశ్చాత్య సాహిత్యంతో సంబంధం ఏర్పడ్డ తర్వాత అచ్చం అనువాదాలతో కాలక్షేపం చేసే కంటే స్వతంత్ర రచనల ద్వారా స్వచ్ఛంద సమీరాన్ని ప్రసరింపచేయడం శ్రేయస్కరమని

నవనవోన్మేషిత మేధావులకు అనిపించింది. ఒకవిధంగా అందువల్ల అన్ని భారతీయ భాషలతో పాటు తెలుగు కూడా చక్కని అభ్యుదయాన్ని సాధించింది. ఈ సాధనావస్థలో దాదాపు భారతీయ భాషలన్నీ తమ తమ సారస్వతాభివృద్ధికే ఏకాగ్రతతో కృషి చేశాయి. దాదాపు గడచిన అర్ధ శతాబ్దం నుంచి – ముఖ్యంగా స్వాతంత్ర్యానంతరం – భారతీయ భాషా సారస్వతాలలో పరస్పరావగాహన బాగా పెంపొందింది. ఈ అవగాహనకు అనువాదాలు చక్కగా సహకరించాయి.

తెలుగు నుంచి ఇతర భాషలలోకి ప్రచరించిన రచనలకంటే, ఇతర భాషల నుంచి తెలుగులోకి ప్రసరించిన రచనలే ఎక్కువగా కనిపిస్తాయి. ఆంగ్లంతో మనకు ఎంత సునిష్టమైన సంబంధం ఏర్పడినా, ఆంగ్ల భాషా ప్రభావం తెలుగు మీద ఎంత స్పష్టంగా గోచరించినా ఆంగ్లం నుంచి తెలుగులోకి వచ్చిన అనువాదాలు ఎక్కువగా లేవు. తెలుగు నుండి ఆంగ్లంలోకి వెళ్లినవి కూడా చాలా కొద్ది. అనుకరణలు అనుసరణలు ఎక్కువగా కనిపిస్తాయి. ఫ్రెంచి, జర్మను, రష్యను భాషల నుంచి వచ్చిన అనువాదాలు, అనుకరణలు, ఆంగ్లం ద్వారానే ఎక్కువగా వచ్చాయి. సారస్వత వాతావరణం, భావ పరివేశంలో ఉన్న వ్యత్యాసం ఇందుకు కారణమై ఉండవచ్చు. ఆంగ్ల భాషలో పటిష్ఠమైన రచనలు సాగించగల ఆంధ్రులు, ఆంధ్రభాషను అభిమానంతో చూచిన ఆంగ్లేయులు అనేకులున్నారు. అధర సహానుభూతి చూపే ఆత్మీయుల కంటె కార్యసాధకులయిన యీ ఆంగ్లేయుల కృషి అభినందించదగినది.

భారతీయ భాషల్లో సంస్కృతం తర్వాత తెలుగుతో ఎక్కువ సంబంధం కలిగిన భాషలు – హిందీ, బెంగాలీ, తమిళం. మరాఠీ కూడా తెలుగుకు చాలా సన్నిహితమైన భాష. హిందీ జాతీయ భాషగా రూపొందక మునుపే తులసీ రామాయణం లాంటి రచనలు తెలుగులోకి వచ్చాయి. నాదెళ్ళ పురుషోత్తమ కవి లాంటివారు హిందీలో వ్రాశారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత హిందీతో తెలుగు వారికి మరింత దగ్గరి సంబంధం ఏర్పడ్డది. హిందీలో పేరెన్నికగన్న కామాయని, కురుక్షేత్ర, పంచవటి, చిదంబర మొదలైన కావ్యాలే కాక అనేక కథలు, నవలలు, నాటకాలు, విమర్శలు, జీవిత చరిత్రలు, ప్రౌఢ వ్యాసాలు తెలుగులోకి వచ్చాయి. తెలుగు నుంచి మనుచరిత్ర, కళాపూర్ణోదయం, భాగవతంలో కొన్ని భాగాలు, ముఖ్యంగా చెప్పుకొనదగిన కావ్యఖండికలు, త్యాగరాజ కీర్తనలు, కథానికలు, నవలలు, నాటకాలు హిందీలో ప్రవేశించాయి. కాని తెలుగు నుంచి హిందీలోకి వెళ్ళిన రచనలకు హిందీ నుంచి తెలుగులోకి వచ్చిన రచనలకు లభించినంత పలుకుబడి, ఆదరాభిమానాలు ఉన్నట్టు తోచదు. కారణం దురూహ్యం కాదు. ఈ రెండు మార్గాలలో అనువాదాలు సాగించినవారు తెలుగువారే కావటం తెలుగువారి అదృష్టం. ఇతరుల దురదృష్టం. హిందీ నుంచి తెలుగు చేసేందుకు తెలుగువారు కృషి చేసినట్టే తెలుగు నుంచి హిందీలోకి అనువదించేందుకు హిందీ భాషీయులు

ప్రయత్నించి ఉంటే ఈ దురవస్థ పట్టేదికాదు. ఇప్పటికయినా ఇలాంటి పని తెలుగులోనే కాక అన్ని భారతీయ భాషల్లో జరిగేటట్టు ప్రభుత్వం కానీ, ప్రభుత్వం తరఫున నడుస్తున్న సారస్వత సంస్థలుగాని చేరడం ఎంతయినా అవసరం. ఈ సందర్భంలో హిందీకి, మిగిలిన భారతీయ భాషలకన్నా సహజంగాను, రాజ్యాంగ రీత్యాను ఉన్న వ్యత్యాసాన్ని సరియైన దృక్పథంతో అవగాహన చేసుకోవడం మంచిది.

బెంగాలీతో తెలుగుకు ఏర్పడిన సంబంధం కేవలం ఆత్మీయత, ఆదరాభిమానాలతో కూడినది. వంకాయకూర ఘుమ ఘుమలాడినట్లే వంగ భాగిరథీ సమీరం కృష్ణా గోదావరి తరంగాల్లోకి రివ్వున చొచ్చుకుపోయింది. శరత్ సాహిత్యంతో పరిచయం లేని తెలుగు వాడుండడు. రవీంద్రుని గీతాంజలికి తెలుగులో ఎన్నో అనువాదాలు వచ్చాయి. ఇంకా వస్తున్నాయి. రవీంద్రుని జన్మ శతాబ్దం జరపక పూర్వమే వంగ సాహిత్యంతో, రవీంద్రుని రచనలతో తెలుగువారికి పూర్తిగా పరిచయం ఏర్పడిపోయింది. నవలలు, నాటకాలు, కథానికలు, కావ్య ఖండికలు, పుంఖానుపుంఖంగా బెంగాలీ నుండి తెలుగులోకి వచ్చాయి. కొన్ని అనువాదాలు కావడం వల్ల వాటిలోని సారస్యం దాదాపు ఇంకిపోయింది. కాని ఎక్కువ రచనలు మూలానికి విధేయంగా, చదువరులకు ఉపాదేయంగానే ఉన్నాయి. బెంగాలీ నుంచి తెలుగులోకి అనువదించడమే కాక తెలుగు నుంచి బెంగాలీలోకి అనువదించగలిగిన ఆంధ్రులు కొందరు ఈ రంగంలో కృషి చేయడం ముదావహమైన విషయం. కాని మన కావ్యాలు, కీర్తనలు, నాటకాలు, నవలలు బెంగాలీలోకి రావలసినంతగా రాలేదు. విజయవాడలో శరత్ బిల్డింగ్ నెలకొన్నట్టు కలకత్తాలో తెలుగు సారస్వత సదనం ఒకటి ఏర్పడితే సామరస్యం సాధించినట్టు. అది ఎన్నటికో!

తమిళం తెలుగుకు అతి సమీపమైన భాష. తమిళ వేదమనబడే తురుక్కురళ్, నన్నయ కాలానికి అటు ఇటుగా వెలసిన కంబ రామాయణం తెలుగులోకి వచ్చాయి. ఇవికాక శిలప్పధికారం, మణిమేఖలై, తిరుప్పావై లాంటి ప్రశస్త రచనలు కూడా తెలుగులో లభిస్తున్నాయి. సుబ్రహ్మణ్య భారతి రచనలు కూడా చాలావరకు తెలుగు వలయంలో ప్రవేశించాయి. తెలుగు నుంచి తమిళంలోకి ప్రవేశించిన రచనల్లో ప్రాచీన కాలంలో ఎక్కువగా కనిపిస్తాయి. కవిత్రయ భారతం, కళా పూర్ణోదయం, వసుచరిత్ర, మనుచరిత్ర లాంటి ప్రసిద్ధ కళాకృతులేకాక సుమతీ శతకం, వేమన పద్యాలు, త్యాగరాజ కృతులు కూడా తమిళ మొళిలో చోటు చేసుకున్నాయి. తెలుగులకు బాగా తెలియని భానుమద్విజయం (వెలగపూడి కృష్ణయామాత్యులు), భాగవతసారం (పుష్పగిరి తిమ్మన), కాశీయాత్ర (ఏనుగుల వీరా స్వామయ్య) లాంటి గ్రంథాలు కూడా చాలాకాలం క్రితమే తమిళంలోకి అనువదింపబడి ఉండటం ఆనందకరమైన విషయం. ఈ మధ్య వచ్చిన నవలలు, కథానికలు రెండు భాషల మధ్య ప్రచరిస్తూనే ఉన్నాయి. ప్రభుత్వం

తరఫున నడిచే సారస్వత సంస్థలు ఈ విషయంలో చెప్పుకోదగిన కృషి చేస్తున్నాయి. కాని తెలుగు నుండి తమిళం చేసేందుకు కూడా హిందీ మధ్యవర్తిగా పనిచేయడం చాలా శోచనీయం. దీనికి సమాధానం వచ్చే దశాబ్దం చెప్పుకోవాలి.

వీరశైవ వాఙ్మయం తెలుగు కన్నడ భాషలకు సారస్వత సంధి సూత్రం. సోమనాథుడు ఉభయ భాషా విశారదుడు. ఆయన రెండు భాషలలో సమాన పాండిత్యంతో సారస్వత కృషి సలిపిన సవ్యసాచి. ఆయన వ్రాసిన బసవ పురాణం, పండితారాధ్య చరిత్ర 15వ శతాబ్దంలోనే కన్నడంలో ప్రవేశించింది. అలాగే కన్నడం నుంచి తెలుగులోకి బసవ వచనామృతం వచ్చింది. మనుచరిత్ర లాంటి కావ్యాలు, కందుకూరి వారి ప్రహసనాలు, రాచకొండవారి నవలలు, కాంతారావుగారి సంపంగి – ఇంకా ఎన్నో అభినవ రచనలు కూడా కన్నడంలో ప్రవేశించాయి. అలాగే కన్నడ భారతి కూడా తెలుగులోకి వస్తున్నది. ఈనాడు తెలుగు రచయితల్లో కొందరు ప్రముఖులు రెండు భాషల్లో నిష్ణాతులై ఉండటం శుభలక్షణం.

మలయాళం నుంచి తెలుగులోకి కాని, తెలుగు నుంచి మలయాళంలోకి గాని ప్రవేశించిన సారస్వతం కదు స్వల్పం. ఈమధ్య నేషనల్ బుక్ ట్రస్ట్, సాహిత్య అకాడమీ ఆధ్వర్యంలో వచ్చిన అనువాదాలే చెప్పుకోదగినవి. అవి కూడా హిందీని మాటు పెట్టుకొని మారినవే. ఈ రెండు భాషల్లోని కావ్యసంపద ఈనాటికీ ఏకాంతంగానే ఉన్నది.

పంజాబీ, ఒరియా, గుజరాతీ లాంటి భాషలతో కూడా తెలుగుకు అంత దగ్గరి సంబంధం ఏర్పడలేదు. ఇటీవల గ్రంథసాహెబ్‌లో కొన్ని ఖండికలు తెలుగులోకి వచ్చాయి. గుజరాతీలోని గాంధీ సాహిత్యమంతా దాదాపు ఆంగ్లం ద్వారానో, హిందీ ద్వారానో తెలుగులోకి వచ్చింది. మూలభాషతో ప్రత్యక్షమైన సంబంధం, అందులో పటిష్ఠమైన పాండిత్యం ఉంటేనే అనువాదం చెయ్యాలి. లేకుంటే అది అపరాధంగా మారి భావ సమైక్యానికి అవరోధం చేకూర్చే ప్రమాదం కూడా ఉంది.

ఉర్దూ నుంచి చక్కని అనువాదాలు తెలుగులోకి వచ్చాయి. ఈనాటి తెలుగు కవుల్లో ప్రముఖులు కొందరు ఉర్దూతో సన్నిహితమైన సంబంధం కలిగి ఉండటం వల్ల ఇది సాధ్యమయింది. అలాగే తెలుగు సాహిత్యం, సాహిత్య చరిత్ర ఉర్దూలోకి రావడం సంతోషకరమైన విషయం.

ఇటీవల కొందరు కవులు తమ కావ్యాలను ఆంగ్లానువాదంతో పాటు ప్రచురించడం వారి అభ్యుదయ దృక్పథానికి నిదర్శనం. ఇలాంటి ద్విభాషిక సంకలనాల్లోని అనువాదం కూడా రమ్యంగా ఉంటున్నది. కారణం రచయిత తాను స్వయంగా ఇలాంటి అనువాదాన్ని రూపొందించడమే. ఈ పద్ధతిని మిగిలిన రచయితలు కూడా అవలంబించవచ్చు, కాని అది

వ్యయప్రయాసలతో కూడిన పని. కనీసం సారస్వత సంస్థల ద్వారా వెలువడే కావ్యసంకలనాలు ఈ రూపంలో ఉంటే చాలా మేలు జరుగుతుంది. సారస్వతంలోని సారంతో పాటు మూలభాషలోని పద సంపద కూడా ఇతరులకు వాచవిగానైనా లభిస్తుంది. రంగనాథ రామాయణం లాంటి కావ్యాన్ని ఇలా రెండు భాషల్లో ప్రచురించేందుకు కొన్ని సంస్థలు కృషి చేస్తున్నాయి. ఈ ప్రక్రియను ప్రోత్సహిస్తే సారస్వత సంప్రసారం ఇతోధికంగా ముందుకు సాగుతుంది.

తెలుగు వెలుగును ఇతర భాషలకు అందించి, ఇతర భాషలలోని ఐతరేయాన్ని ఆత్మీయం చేసుకునేందుకు కేవలం అనువాదాలే అక్కర్లేదు. అనువాదాలు సాధించగలిగిన పని చిన్న చిన్న పరిచయ పుస్తకాలు (monographs) కూడా చేయగలవు. ఇటీవల యువభారతి వారు ప్రచురించిన 'కవితా వైభవం' గ్రంథమాల ఇలాంటి ప్రక్రియకు చక్కటి ఉదాహరణ. కాని అవి తెలుగులోనే కాక మిగిలిన భాషల్లో కూడా ముఖ్యంగా హిందీ, ఇంగ్లీషులో కూడా వస్తే చాలా బాగుండేది. ఇతర భాషలకు సంబంధించిన రచయితల రచనా వైభవాన్ని తెలుగువారికి అందించడం కూడా ఈ గ్రంథమాల సాధించిన మహత్తరమైన కార్యం. ఈ వరుసలో నన్నయ దగ్గర నుండి నారాయణరెడ్డి దాకా తెలుగు కవితా స్రవంతిని యావద్భారత దేశానికి ప్రసరింపజేయవచ్చు. అలాగే భారత భారతిని కూడా తెలుగువారికి విని ఆనందించే పద్ధతిలో అందించవచ్చు. అనువాదం అనగానే అదేదో అజీర్ణవ్యాధితో బాధపడే ముఖ ముద్ర ఇటీవల కనిపిస్తున్నది. ఎంతమంచి అనువాదమైనా అనువాద ముద్రవల్ల దానిపట్ల ఉండవలసిన అభిమానం పాఠకులలో కనిపించడం లేదు. ఈ మనస్థితిని గమనించి రాబోయే దశాబ్దంలో అనువాదాల కంటే ఇలాంటి పరిచయ పుస్తకాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వటం లాభకరమని తోస్తుంది. ఒక భాషను గురించి, దాని సారస్వతాన్ని గురించి, అందులోని సాధనా వైశిష్ట్యాన్ని గురించి లలితమైన శైలిలో సరళమైన భాషలో సులభంగా అందించగలిగితే సర్వభాషా సరస్వతికి సరియైన సేవ చేసినట్టవుతుంది. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, శాస్త్రాలు అన్నింటినీ ఈ పద్ధతిలో అందించవచ్చు. అయితే, యోగ్యతగల వ్యక్తుల చేత సామర్థ్యం గల సంస్థలు ఈ పని చేయించాలి. ఎంత మంచి ఆశయమైనా ఆచరణ లోపం వల్ల లక్ష్యానికి దూరమై నిర్లక్ష్యానికి గురికావచ్చు. ఈ ప్రమాదం జరగకుండా ఈ ప్రక్రియను కాచి పెంపొందించడం సారస్వత సంప్రసారం కోరే సంస్థల కర్తవ్యం.

కాని ఇలాంటి పరిచయ సాహిత్యం అనువాద సాధనకు ప్రత్యామ్నాయం కాదు. అనువాదాలకు ఉండే ప్రాశస్త్యం, ప్రయోజనం ఉండనే ఉంటుంది. అనువాదాలతో పాటు ఈ సారస్వత ప్రక్రియను కూడా పోషిస్తే అన్నం, అనుపాకాలతో కూడిన మృష్టాన్నం సారస్వత జీవులకు లభిస్తుంది. కాని అనువాదాల స్థాయిని పెంచాలి. అన్ని పుస్తకాలనూ

అనువదించవలసిన పనిలేదు. అందరికీ ఆ పని సాధ్యంకాదు. ఎవరిచేత ఎలాంటి పుస్తకాలు ఏ రూపంలో వ్రాయించాలనే విషయం మెలకువతో ఆలోచించి సరియైన కార్యక్రమం రూపొందించాలి. ఇందులో అనువాదకుల అభిరుచిని కూడా గమనించడం మంచిది. అందులోనే పాఠకుల అభిరుచి కూడా మిళితమై ఉంది. ఒక్కొక్క రచయిత వెయ్యిమంది పాఠకులకు ప్రతినిధి. రచయిత అభిరుచిలో చదువరుల అభిరుచి కూడా ప్రతిబింబించి ఉంటుంది. కాబట్టి రచయితల అభిలాషను బట్టి రచనలు జరిగితే పాఠకులు ఆసక్తితో చదువుతారు. అప్పుడు పుస్తక విక్రయం ఒక సమస్యేకాదు. మంచి పుస్తకాలకు మార్కెట్టు చిక్కులుండవు. కాని పుస్తకాలను కొని చదవడమనే అలవాటు ఇంకా బాగా ఏర్పడకపోవడం వల్ల ఒక్కొక్కప్పుడు మంచి పుస్తకాలు కూడా మార్కెట్టులోనే ఉండిపోతున్నాయి. ఇది సాంఘిక సమస్య. సారస్వత రంగంలో మనం చేయదగిన కృషి చేస్తే సంఘం కూడా క్రమంగా మనకు సహకరిస్తుంది. సారస్వత సాధనలో చేదోడువాదోడుగా పనిచేయవలసిన ప్రచురణకర్తలు, రచయితలు సంఘ రుచిని గమనించటమే కాక ఆ అభిరుచిని సంస్కరించడం కూడా తమ నైతిక బాధ్యతగా గుర్తించాలి. హితకరమైన వాఙ్మయంద్వారా ప్రియమైన సత్యాన్ని ప్రేమ పూర్వకంగా పంచిపెట్టడం అంత సులభమైన పనికాదు. 'సత్యం ప్రియహితం చ యత్' అని కొనియాడబడిన వాఙ్మయ తపస్సులాంటిది ఈ సాధన. ఎలాంటి పుస్తకాలు పాఠకులను ఆకట్టుకుంటాయి, ఎలాంటి పుస్తకాలు సులువుగా అమ్ముడుపోతాయి అనే రెండు ప్రశ్నలకూ సమాధానం ఒకటే. చౌకరకం పుస్తకాలు కూడా పదిమంది చదవవచ్చు. చాలమంది కొనవచ్చు. అంతమాత్రంచేత అది సారస్వత సేవకాదు. సారస్వత సంప్రసారం ప్రధాన లక్ష్యంగా ఉండాలి. వ్యాపారంలో నష్టం లేకుండా లక్ష్మి, సరస్వతి ఇద్దరి అనుగ్రహం సంపాదించే సాధుమార్గాన్ని ప్రచురణకర్తలు రచయితల సహకారంతో అనుసరించాలి.

ప్రభుత్వం తరఫున నడిచే సారస్వత సంస్థలపై ఇంతకు మించిన మరో బాధ్యత కూడా ఉంది. కేవలం వ్యాపార దృష్టితో పనిచేస్తే ఈ సంస్థల ప్రయోజనం నెరవేరదు. వ్యాపారసంస్థలు సాధించలేని పనిని ఇవి సాధించేందుకు ప్రయత్నించాలి. ఇంతవరకు వచ్చిన అనువాదాల వల్ల తెలుగులో జరిగిన సారస్వత సంప్రసారాన్ని ఒక్కసారి సమీక్షిస్తే ఈ రంగంలో స్వయం సమృద్ధమైన సార్వజనీన సంస్థలు చేయవలసిన సమన్వయం ఎంతో కనిపిస్తుంది. అనువాద సాధనను వ్యక్తిగతంగా వ్యాపార సరళిగా వదలివేయక దానిని ఒక జాతీయ దీక్షతో సారస్వత సత్కాంక్షతో సక్రమమైన మార్గంలో నడిపించి దానివల్ల జాతి చైతన్యాన్ని ఆరోగ్యవంతంగా వికసింపజేయవలసిన బాధ్యత నేషనల్ బుక్ ట్రస్ట్, సాహిత్య అకాడమీ లాంటి జాతీయ సంస్థలపై ఉంది.

మన దేశంలో అనేక భాషలున్నాయి. వేటికవి అన్నీ సమృద్ధమైనవే. అన్నింటిలో ఎన్నదగిన సాహిత్యం ఉంది. అన్నింటిలో ప్రాణవాయువులా ప్రసరించే సాంస్కృతిక భావ సూత్రం ఉంది. కాశ్మీరులోయల్లో వినిపించే లొల్ల భావగీతికలు కన్యకా పరమేశ్వరి కలకల నినాదంలో వినిపిస్తున్నాయి. ఈ సూత్రాన్ని పటిష్ఠం చేసేందుకు అనువాద వాఙ్మయం, పరిచయ సాహిత్యం, అఖిల భారత సారస్వత సదస్సులు బాగా సహకరిస్తాయి. కానీ యీ మహత్తర కార్యాన్ని సాధించేందుకు తగిన మనస్సు కలిగిన మనుష్యులు కావాలి. ఆ మనుష్యుల శక్తి సామర్థ్యాలను మానవాభ్యుదయానికి ఉపయోగించుకోగలిగిన సాంఘిక వ్యవస్థ ఏర్పడాలి. అలాంటి సంస్థలు నెలకొనాలి. సరియైన సాధన సాగాలి. ఇన్ని భాషలు కలిసి మెలిసి ఉన్న దేశంలో ఎన్ని అభ్యుదయ కార్యక్రమాలనో రూపొందించవచ్చు. అన్ని భాషలకూ ఒక సంస్కృతిని అనుసరిస్తూ వృద్ధి చెందుతున్నట్టే అన్ని రాష్ట్రాలూ ఒక కేంద్రాన్ని ఆధారం చేసుకొని పురోగమిస్తున్నాయి. ఇటు కేంద్ర ప్రభుత్వం, అటు రాష్ట్రప్రభుత్వాలు అన్యోన్య సహకారంతో ఈపని సాధించవచ్చు. జాతీయ భాషను ఆధారం చేసుకొని కేంద్రప్రభుత్వం కృషి చేస్తే, ప్రాంతీయ భాషలతో భారతావనికి ఘనిష్ఠమైన సంబంధం ఏర్పరచి సారస్వత సంప్రసారానికి చక్కని రాచబాట వేసే బాధ్యత రాష్ట్ర ప్రభుత్వాలు వహించవచ్చు. ప్రభుత్వంతో పాటు, ప్రజాదరణ పొందిన ప్రచురణ సంస్థలు కూడా ఈ పనికి పూనుకోవాలి. ఒక్కొక్కప్పుడు ప్రభుత్వం, ప్రచురణ సంస్థలు చేయలేని పని వ్యక్తులు నిర్వహించగలుగుతారు. ఎవరివల్ల జరిగినా మంచి పని మంచినే పెంచుతుంది. పుస్తక ప్రచురణ కేవలం వ్యాపారం కాదని భావించి సారస్వత సత్యాన్ని పోషించే సాత్త్వికమైన చైతన్యం రచయితల్లో, ప్రచురణకర్తల్లో, పాఠకులలో కూడా వ్యాపించినప్పుడే యీ లక్ష్యం సిద్ధిస్తుంది.

అనువాద సాధనవల్ల సారస్వత సంప్రసారం ఎలా సాధ్యం? అనువాదాలకు, అనువాదకులకు పుస్తక ప్రపంచంలో లభించవలసిన స్థానం ఎలా లభిస్తుంది?– ఇలాంటి ప్రశ్నలకు సమాధానం మాత్రం ఈ ప్రసంగ వ్యాసం ఇయ్యగలదు. కాని ఆచరణలో దీన్ని అనువదించినప్పుడే దీనికి సార్థక్యం చేకూరుతుంది. వచ్చే దశాబ్దం మహాకాలుని మహాలయంలో ఒక మహత్తరమైన సోపానం. ఒక సహస్రాబ్దం ముగిసేందుకు మరి రెండు దశాబ్దాల కాలం ఉంది. ఈ సంధికాలంలో చెప్పుకోదగిన మార్పులు ఎన్నోరావచ్చు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని యీ కార్యక్రమాన్ని విజయవంతంగా సాగిస్తే రాబోయే దశాబ్దంలో భారతీయుల సారస్వత సాధన సమన్వయాత్మకంగా పురోగమించి సాంస్కృతిక సమైక్యాన్ని సాధించగలుగుతుంది. భారత భారతికి ఇంటా బయటా గౌరవం లభిస్తుంది. ఆంధ్ర, తమిళ, వంగ మహారాష్ట్ర సారస్వతాల్లో వేరు వేరు కంఠాల్లో ఒకే నాదం పలుకుతుంది. అదే అనువాద భారతి ప్రసాదించగల అను వేదం.

# వాగ్దేవి నెలకొల్పుకొన్న జ్ఞానపీఠ భారతి

వాక్పదాచార సంసేవ్యాం జ్ఞానపీఠాధి వాసినీమ్
శాంతి ప్రసాద పరమాం వాగ్దేవీం తాముపాస్మహే.

వెలుగు దేవతా లక్షణం. వెలుగులకు వెలుగును కూర్చే వేవెలుగుల ఇలవేల్పును ప్రాజ్ఞులు పరంజ్యోతిగా భావించి సేవిస్తారు. ఆ పరంజ్యోతి ప్రపంచంలో ప్రతి జీవికీ పంచిపెట్టే పరమ వరణీయమయిన వరప్రసాదం వాక్కు. ఆ జ్యోతిర్మయికీ, ఈ వాఙ్మయికీ మధ్య అందరికీ బోధపడని ఆంతర్యం ఏదో ఉంది. ఆ దహరాంతర సంబంధాన్ని పురస్కరించుకొని మన పలుకుల వెలది ఆ వెలుగుల వేల్పును కలుసుకొని పలకరించుకుంటుంది. అలా పలుకులు వెలుగును కలుసుకున్న తావు తెలివికి నెలవయి వెలుస్తుంది. కలకాలం నిలుస్తుంది. అదే వాగ్దేవి నెలకొల్పుకొనే జ్ఞానపీఠం. వాక్కును వెలుగు చేరదీయగానే ఆత్మగతమయిన జ్ఞానం జ్ఞాన భారతిగా పరిణమిస్తుంది. పరమ శాంతి ప్రభవిస్తుంది. ప్రసన్నత ప్రసరిస్తుంది. వాక్కు వెలుగుతుంది. వెలుగు పలుకుతుంది. ఇలాంటి సమాగమం ఎప్పుడు ఎక్కడ ఎందుకు ఎలా సంభవిస్తుందో చెప్పలేము. అందులో పురుషార్థం కంటె పరమార్థమే పటుతరమని మాత్రం గట్టిగా చెప్పగలం.

భారతీయమైన (భా-రతీయమనిపించుకోగల) జ్ఞానానికి ఒక పటిష్ఠమైన పీఠాన్ని నెలకొల్పాలనే ఆలోచన ఇలాంటి సన్నివేశంలో ఉదయించిందే. ఇప్పటికి దాదాపు అర్ధ శతాబ్దం పూర్వం 1943 డిసెంబరు నెలలో అన్నపూర్ణకు ఆలయమయిన కాశీ క్షేత్రంలో జాతీయ స్థాయిలో పన్నెండవ ప్రాచ్య విద్యా మహాసభలు జరిగాయి. మహా సభలు ముగియగానే కొందరు మహా విద్వాంసులు, సాహితీప్రియులు, సంస్కృతి పరాయణులు, ధర్మదాతలు, ఉదాత్తులు అయిన శ్రీ శాంతిప్రసాద్ జైన్‌ను కలుసుకుని సంస్కృతంలోనే కాక ప్రాకృతంలో, అపభ్రంశంలో, తమిళంలో, కన్నడంలో అమూల్యమైన జ్ఞానం దాగి ఉన్నదని దాన్ని వెలుగులోకి తీసుకురావలసిన అవసరం ఎంతయినా ఉందని సూచించారు. సంస్కారమూర్తి అయిన మూర్తి దేవి కుమారుడు శ్రీ శాంతి ప్రసాద్ జైన్ మనస్సులో ఆ మనీషుల మాటలు బాగా నాటుకుపోయాయి. వెంటనే జ్ఞానపీఠం స్ఫురించింది. మాతృమూర్తి మూర్తిదేవి తన తనయునికి ఉగ్గుపాలతో పాటు అందించిన సంస్కారం ఫలించింది. విద్యావతి, గుణవతి, పతిమతి అయిన శ్రీమతి రమాదేవి తన భర్త మనస్సులో ప్రభవించిన యీ ప్రశస్త భావానికి ప్రసన్న హృదయంతో ప్రోద్బలం ఇచ్చింది. అంతే. రెండు నెలలు నిండక మునుపే 1944

ఫిబ్రవరి 18వ తేదీ జ్ఞానపీఠం ఏర్పడింది. అదృష్టవశాత్తు అది భారతీయ జ్ఞానపీఠంగా రూపొందింది. ఏ జైన జ్ఞానపీఠమో కాలేదు.

భారతీయ పరిభాషలో భాషకు అందని భావ గాంభీర్యం ఉంది. భారత శబ్దం ఒకదేశానికి సంబంధించినది కాదు. ఎక్కడ వెలుగు (భా) కనిపిస్తే అక్కడ మైమరచి ఆ వెలుగులో మునిగి లోలోపల మురిసిపోయే వెలుగుల మమకారం భారతి. అదే నిజమైన భారతీయత. అలాంటి భారతీయతను జ్ఞానమార్గంలో పయనించి వాక్కు, పదం, ఆచారం (ఆచరణ) అనే మూడు నేత్రాలతో సాక్షాత్కరించు కోవటమే జ్ఞానపీఠం ప్రధానలక్ష్యం. ఈ లక్ష్యాన్నే అక్షరరూపంలో నిర్వచించుకుంది భారతీయ జ్ఞానపీఠం. 1944లో వ్రాసుకున్న సంకల్ప శాసనం. కాలగర్భంలో లీనమయి కంటికి కనిపించకుండా పోతున్న అమూల్యమైన జ్ఞానభారతిని పరిశోధనల ద్వారా పరిరక్షించి మానవ కల్యాణం కోసం కాలానుగుణంగా జ్ఞానాన్ని ప్రసరింపజేసే అధునాతన రచనలను ప్రోత్సహించటం జ్ఞానపీఠం సాధించవలసిన సత్కార్యం అని పీఠ ప్రతిష్ఠాపకులు ప్రకటించుకున్నారు.

ఆనాటి నుంచి ఈనాటి వరకు జ్ఞానపీఠం అదే దిక్కులో పురోగమిస్తున్నది. కన్నడ దేశంలో ఒక మందిరంలోని శాస్త్ర భండారంలో కేవలం పూజా ద్రవ్యంగా పడివున్న ఒక మహా గ్రంథాన్ని వెలుగులోకి తెచ్చి ప్రపంచానికి పరిచయం చేయటంతో ఈ పరిశోధన కార్యక్రమం ప్రారంభమయింది. ఆ గ్రంథం పేరు 'మహాబంధ్'. భాష ప్రాకృతం. లిపి కన్నడం. విషయం కర్మ సిద్ధాంతం. క్రీ.శ. రెండవ శతాబ్దంలో ప్రాకృతంలో వ్రాసిన కర్మ సిద్ధాంతానికి తొమ్మిదవ శతాబ్దంలో సంస్కృతంలో వెలువడిన వ్యాఖ్య అది. ఇన్ని భాషలతో, ఇంతటి కాలపరిమితితో ముడిపడిన యీ ఉద్గ్రంథాన్ని హిందీ అనువాదంతో ఏడు ఖండాలుగా ప్రచురించేందుకు ఆ రోజుల్లో (1947) జ్ఞానపీఠం 90వేల రూపాయలు ఖర్చు పెట్టింది. మూడువేల పుటలను అలంకరించిన యీ 'మహాబంధం' ఈ సంస్థ ప్రచురణ కార్యక్రమానికి శ్రీకారం చుట్టింది. ఇంతవరకు దాదాపు రెండువందల గ్రంథాలు ఇలాంటివి వచ్చాయి. వీటికి మూర్తిదేవి గ్రంథమాల అని పేరు. బొంబాయిలో ఇలాంటి ప్రచురణలే మానిక్‌చంద్ గ్రంథమాల అనే పేరుతో దాదాపు 50 సంవత్సరాలు బాగా వృద్ధి చెంది 1959లో క్షీణ దశలో ప్రవేశించడం చూచి జ్ఞానపీఠం ఆ గ్రంథమాలను కూడా పేరు మార్చకుండా (తన పేరుతో ప్రమేయం లేకుండా) నిలబెట్టింది.

ప్రాచ్య విద్యా పరిరక్షణకు ప్రోద్బలం ఇచ్చే యిలాంటి ప్రచురణలతో పాటు ఈనాడు (అంటే ఆనాడు 1944 నుంచి 1965 వరకు) ప్రతిభా సంపన్నులయిన రచయితలు రచించే మహోన్నత రచనలను కూడా 'లోకోదయ గ్రంథమాల' అనే పేరుతో ప్రచురించటం కూడా జ్ఞానపీఠం చేపట్టింది. ఇవి దాదాపు 300కు మించాయి. దేశం స్వతంత్రమయిన తర్వాత

భారతీయ భాషలకు లభించిన ప్రాశస్త్యాన్ని పురస్కరించుకొని వేరు వేరు భాషలలోని ఉత్తమ సాహిత్యాన్ని హిందీలో అనువాదరూపంలో ప్రచురించడం కూడా క్రమక్రమంగా జ్ఞానపీఠ భారతిలో చోటు చేసుకుంది. ప్రస్తుతం ఈ ప్రచురణ కార్యక్రమంలో విశ్వభారతికి కూడా స్థానం లభిస్తూ ఉంది. మొత్తం మీద ఈనాడు జ్ఞానపీఠం ప్రచురించిన గ్రంథమాల అయిదారు వందలకు మించి ఉన్నాయి. వందల లెక్క అటుంచి ఆధునిక పాఠక సమాజంలో జ్ఞానపీఠం ఏర్పరచుకున్న గౌరవ మర్యాదలు భారత భారతికి గర్వకారణం అని చెప్పడం సత్యాన్ని వినయంగా విన్నవించుకున్నట్టే అవుతుంది.

అసలీ ప్రచురణ కార్యక్రమం నుంచే బహుమతి ప్రస్తావన కూడా వచ్చింది. ప్రాచ్య విద్యా మహా సభలు జ్ఞాన పీఠ ప్రతిష్ఠకు ఎలా నిమిత్తమాత్రమయ్యాయో శాంతిప్రసాద్ జైన్ గారి యాభైయ్యో జన్మదినం జ్ఞానపీఠ బహుమతికి అలాగే సూత్రధారణ చేసింది. ప్రత్యేకమైన ఈ జన్మదినానికి ఒక ప్రత్యేకమయిన కానుకను సాహిత్యపరంగా అందించాలని కుటుంబ సభ్యులందరూ ఆలోచించారు. ఈ ఆలోచనను మనస్సులో ఉంచుకొని శ్రీమతి రమా జైన్ ట్రస్ట్ సభ్యులతో రాష్ట్రభారతీ ప్రచురణలను గురించి సంప్రతిస్తూ 1961 సెప్టెంబర్ 16వ తేదీ ఒక ప్రశ్న వేశారు. మన దేశభాషలన్నింటిలో నిరంతరం వెలువడుతూ ఉండే మంచి మంచి రచనలలో నుంచి ఒక మహోన్నత రచనను ఎన్నికచేసి ఆ రచనకు ఒక గొప్ప బహుమతి ఇచ్చి జాతీయస్థాయిలోనే కాక అంతర్జాతీయ స్థాయిలో కూడా భారతీయ సాహిత్యంలోని భారతీయతను నిరూపించడం సాధ్యమవుతుందా అని. ఆమె ఒకవిధంగా తనకుతానే ప్రశ్నించుకున్నారు. దానికి సమాధానం ఆ సమావేశంలోని పదిమంది సభ్యులే కాక దేశంలోని విద్వత్కోటి అందించింది. ఆలోచన చాలా గొప్పది కనుక ఆలోచనాపరులు కూడా ఉన్నత స్థాయిలో ఆలోచించి ఈ సమాలోచనకు సదాచరణ స్వరూపాన్ని సమకూర్చారు. కాకాసాహెబ్ కాలేల్కర్, బచ్చన్, దినకర్, జైనేంద్రకుమార్‌లాంటి మనీషులు, కవులు, సారస్వత తేజోమూర్తులు 1961 నవంబరు 22వ తేదీని ఈ పని సాధ్యం అవుతుందనీ, ఇలాంటిది చేసి తీరాలని తీర్మానించారు. దానికి ఒక స్థూలమైన రూపకల్పన చేసుకుని శ్రీ శాంతి ప్రసాద్ గారు రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్‌గారిని కలుసుకున్నారు. ఈ ప్రణాళికకు రాష్ట్రపతి ఆశీస్సులు లభించాయి.

చేసి తీరాలని తీర్మానించుకున్న తర్వాత ఎలా చెయ్యాలి అనే విషయం మీద కూలంకషంగా చర్చలు ఆరంభమయ్యాయి. 1961 డిసెంబరులో కలకత్తాలోని సుప్రసిద్ధ బెంగాలీ రచయితలు ఈ విషయాన్ని వివరంగా పరిశీలించి తమ ఆమోద ముద్రను వేశారు. 1962 జనవరి నూతన సంవత్సరాది నాడు అఖిల భారతీయ హిందీ పరిషత్ సమావేశాలకు కలకత్తా విచ్చేసిన సాహితీపరులలో కొందరిని శ్రీమతి రమాజైన్ తన యింటికి ఆహ్వానించి దాదాపు మూడు గంటలసేపు వారితో ఈ ప్రణాళికను గురించి పరామర్శ చేశారు. ఆనాటి

కమ్మని సమావేశంలో ఓదన ప్రియుడైన ఈ వ్యాస రచయిత కూడా పాల్గొని ఉండటం ప్రాసంగికం. ఆనాటి పండితులు వ్యక్తం చేసిన అభిప్రాయాలు ఎంత మననీయంగా ఉన్నాయో ఆ చర్చల తర్వాత అలిపుర్ పార్కులో లభించిన కమ్మని విందు అంతకంటె కమనీయంగా ఉంది. 'మధురం మధురాక్షరం' అనదగిన ఆ సమావేశాన్ని ఆధారం చేసుకొని భారత దేశ రాజధాని ఢిల్లీలో దాదాపు 300 మంది ప్రబుద్ధులను సమావేశ పరచి 1962 ఏప్రిల్ 2వ తేదీ టైమ్స్ ఆఫ్ ఇండియా ఆధ్వర్యంలో జ్ఞానపీఠం మరో సదస్సు ఏర్పాటు చేసింది. ఈ సదస్సులో దేశంలోని తేజోమూర్తులందరూ పాల్గొన్నారు. ఈలోగా ప్రారంభం నుంచి జ్ఞానపీఠానికి కార్యదర్శిత్వం నిర్వహిస్తున్న శ్రీ లక్ష్మీ చంద్ర జైన్ ఈ ప్రణాళికకు ఒక ప్రాతిపదిక తయారు చేసి 4000 ప్రతులు దేశంలోని ప్రబుద్ధులకు పంపించి వారి సలహాలు సేకరించారు. చివరకు జ్ఞానపీఠ బహుమతికి బహుజన సమ్మతి లభించింది.

ఇక బహుమతి నిర్ణయం ఎలా చెయ్యాలి అన్న ప్రధానాంశాన్ని తమలో తాము పరామర్శించుకొని మేధావుల అభిప్రాయాలను సేకరించి మంచి మంచి రచనలను తిలకించి పరికించి పరిశీలించి సర్వ సమ్మతమైన సత్కృతికి బహూకృతిని ఎన్నిక చేసేందుకు 'ప్రవర పరిషత్' కూడా ఏర్పడింది. ఈ పరిషత్తుకు తొలి అధ్యక్షునిగా ఉండవలసిందని డా॥ రాజేంద్ర ప్రసాద్‌ను కోరగానే ఎంత కార్యభారం ఉన్నా ఈ సత్కార్యానికి తాను సహకరిస్తానని తన అంగీకారాన్ని తెలిపారు. ప్రవర పరిషత్ మొదటి సమావేశానికి ఆయన 1963 మార్చి 16వ తేదీ నిర్ణయించారు. కాని కాలనిర్ణయం మరో విధంగా ఉండటం వల్ల ఆనాటికి ఆయన పరమపదాన్ని చేరుకున్నారు. సమావేశం మాత్రం జరిగింది. కాకా కాలేల్కరు అధ్యక్షత వహించారు. ఆ తర్వాత కీ॥ సంపూర్ణానంద్ ఈ కార్యభారం వహించారు.

ప్రథమ బహుమతిని నిర్ణయించేందుకు దాదాపు రెండు సంవత్సరాలు పట్టింది. మార్చి 63లో ప్రవర పరిషత్త్ తొలిసారి సమావేశంలో డిసెంబరు 65లో నిర్ణయం జరిగింది. అది బహుమతి మలయాళకవి జి. శంకర్ కురుప్ వ్రాసిన 'ఓటక్కురళ్' అనే కావ్యకృతికి లభించింది. జ్ఞానపీఠ భారతికి మలయమారుతం మంగళగీతి పాడింది. శంకర కవికి సర్వ ప్రథమంగా జరిగిన సన్మానానికి గణ దేవతలు ఆనందించడం సహజమే. భవానీ శంకరుల గుణగణాలను కీర్తించే గణదేవతల పేరిట తారా శంకరులు వ్రాసిన నవలకు ద్వితీయ సంవత్సరపు బహుమతి లభించడం దైవ నిర్ణయంగా తోస్తుంది. ఎక్కడ కేరళం ఎక్కడ బంగాళం! రెంటినీ ఒక వేదికలో సమావేశ పరచిన జ్ఞానపీఠం భారతీయ రచనలనూ, రచయితలనే కాక భారతాత్మనే అర్చించినట్టయింది. ఆ తర్వాత మూడవ బహుమతికి రామాయణ దర్శనంలో పుట్టప్ప కన్న పురుషార్థం, నిశీథ వీధిలో ఉమా శంకరులు చేసిన ఊహాగానం పరస్పర సంవీక్షణంతో పరవశించాయి. రామాయణం ఉమాయనం వాగ్దేవి అందించిన పాయసాన్ని చెరిసగం

పంచుకున్నాయి. రామ రామేశ్వరుల యీ సౌహార్దాన్ని గురించి తెలుసుకుని ఆ పాయసం ఎలా వుంటుందో చూద్దామని సుమిత్రానందనుడు తన చిందంబర చిద్విలాసంతో జ్ఞానపీఠంలో ప్రవేశించి కమ్మని కవితా గానంతో కోమలకాంత పద సంపదతో పలుకుల వెలదిని పలుకరించుకున్నాడు. ఈ గానంలో తన రాగం కూడ కలపాలని ఇంతలో రఘుపతి సహాయకుడు గోరఖ్ పురధోరణిలో ఉర్దూ మార్దవాన్ని సాహితీ జగతికి వాగ్దేవి ద్వారా వినిపించారు.

వాగ్దేవి నిలయంలో పంచమ స్వరం వినిపించగానే విజయవాడను శ్రీరామ విజయవాడగా మలచుకున్న విశ్వనాథుడు తన నాథుకథను సకలోహ వైభవ సనాథంగా రూపొందించి జ్ఞానపీఠాన్ని కల్పవృక్షచ్ఛాయతో కమనీయమే కాక రమణీయం చేశాడు. ఆ తర్వాత 'యస్యస్మరణ మాత్రేణ' జన్మ సంసార బంధాలను ఛేదించే సాక్షాద్విష్ణువే విష్ణు దేవునిగా అవతరించి నృతి నత్తా భవిష్యత్తుతో వంగదేశానికి మరోసారి ఖ్యాతిని సంపాదించిపెట్టినట్టయింది. ఆ తర్వాత క్రమంగా దినకర తేజం ఊర్వశి మోహం, దత్తాత్రేయ చతుశ్శ్రుతి, 'మహాంతం విభామాత్మానం' అని మాధవి కీర్తించిన మధురగానం' ఖాండేశ్వర్ కామేశ్వర తత్త్వం, అఖిలాంకం చిత్రించిన చైతన్యచిత్రం, ప్రథితయశస్విని పరిపూర్ణమైన ఆశతో చేసిన ప్రథమ ప్రతిశ్రుతి, చిరంజీవి శివరామ కారంత్ నిరూపించిన ముకజ్జియ ముగ్ధ బోధ ఎవరికీ తెలియని సత్యానందుడు హీరానందుడై వాత్స్యాయన శైలిలో పునరపి నౌకం, పునరపి యానం అని చేసిన కవితాగానం, వీరేంద్రుని మృత్యుంజయ విభవం, అనగా అనగా ఒక దేశం అని వామనమూర్తి ప్రదర్శించిన త్రివిక్రమతేజం, అమృతాయమయిన ఆత్మకళా విలాసం, అహోరాత్రులను సంధించి అనురాగంతో ఆవేదననూ, ఆవేదనలో అనురాగాన్నీ అనుసంధించి యామినిని మేల్కొల్పిన మహాదేవివీ జ్ఞానపీఠ భారతి తిలకించి లోలోన పులకరించింది.

ఆ తర్వాత .కృతి కంటే కృతికర్త ప్రధానమని పరిషత్ ప్రముఖులు భావించడంతో జ్ఞానపీఠ బహుమతి వ్యక్తికి ప్రాధాన్యం ఇచ్చింది. ఈ పద్ధతిలో గుర్తింపు రావడం దాదాపు అమృతా ప్రీతమ్, మహాదేవితోనే ఆరంభమయిందని చెప్పవచ్చు. బహుమతిగ్రహీతను ఎన్నుకోవడంలో సమగ్రమయిన వ్యక్తిత్వం ఎంత ప్రధానమయినా నిర్దిష్ట కాలావధిలో రచయిత రచించిన ప్రముఖ రచనలను దృష్టిలో పెట్టుకునే తుది నిర్ణయం జరుగుతుంది. ఈ పద్ధతిలో మధురకథామృతసూతిమాస్తి, మెట్టుకు పై మెట్టును సృష్టించిన తకళి కథకట్టు, పతితోద్ధారక పన్నాలాల్, సత్కవితాఖని సచిరావుత్ రాయ్, సుకుమాగ్రజ కవి కోకిల కాకలి, విశ్వంభరగా విస్తరించిన అభినవ నారాయణీయం, కరుణ నయన కురుతులయన్ ఏటేటా వాగ్దేవి వాత్సల్యాన్ని అందుకొని జ్ఞానపీఠానికి శుభ్ర నక్షత్రకాంతిని చేకూర్చారు.

ఇంతవరకు జ్ఞానపీఠ బహుమతిని అలంకరించిన 27గురు సాహితీ మూర్తులలో నలుగురు నారీమణులు. సాక్షాత్ చతుర్ముఖ సతీ స్వరూపిణులు. మిగిలిన ఇరవై ముగ్గురు పురుషమూర్తులు పుంభావ సరస్వతులు. జ్ఞానపీఠ బహుమతి ప్రారంభమై ఇప్పటికి 25 సంవత్సరాలయింది. ఈ పాతిక సంవత్సరాలలో రెండు మారులు రెండు భాషలు బహుమతిని పంచుకోవడం వల్ల బహూకృతుల సంఖ్య 27 అయింది. అది కూడా ఒకందుకు మంచిదే అయింది. బహుమతి రజత జయంతి సందర్భంలో వాగ్దేవికి సమర్పించేందుకు ఒక నక్షత్రమాలిక స్వతఃసిద్ధంగా ఏర్పడింది.

జ్ఞానపీఠ బహుమతి ప్రారంభించడంలో ప్రధానమైన ఉద్దేశ్యం భాషా భేదం లేకుండా భారత భారతిని సమైక్య భావంతో ఆరాధించి ఆమెకు వన్నె తెచ్చిన వాఙ్మయ తపస్సంపన్నులను భారతీయ భావనతో సంభావించి వారి కృతిత్వానికి నమస్కృతి తెల్పడమే. అయితే భాషాభిమానం వల్ల అపుడప్పుడూ ఏ భాషకు ఎన్నిసార్లు గుర్తింపు వచ్చిందనే ప్రశ్న సహజంగా తలయెత్తుతుంటుంది. ఇప్పటికి హిందీ కన్నడాలకు నాలుగుసార్లు బహుమతులు లభించాయి. మలయాళం, బెంగాలీ భాషలకు మూడు పర్యాయాలు, గుజరాతీ, మరాఠీ, ఒడియా, తెలుగు, ఉర్దూ భాషలకు ఈ బహుమతి ఆమ్రేడితమయింది. తమిళం, అసమియా, పంజాబీ భాషలకు వాగ్దేవి ఒకే ఒకసారి సాక్షాత్కరించింది. సంస్కృతం, సింధీ, కాశ్మీరీ భాషలకు ఇంతవరకు వాగ్దేవి కరస్పర్శ లభించలేదు. ఇది స్థూల దృష్టికి కనిపించే యథార్థం. కాని సూక్ష్మ దృష్టితో అసంపృక్తంగా పరిశీలించి చూస్తే ఏ భాషకు బహుమతి లభించినా అది భారతీయ సాహిత్యానికి సామూహికంగా లభించినట్టే. భారతీయ సాహిత్యం ఏ భాషలో ఏ లిపిలో వెలువడినా అది సమస్త భారతావనికి చెందిందే కాని ఏకాంతంగా ఏదో ఒక భాషకు పరిమితమని భావించడం భావ్యం కాదు. భారతీయ సాహిత్యంలోని ఈ పరమార్థాన్ని యథార్థవాదులు హర్షించకపోవచ్చు. కాని పరమార్థం పరమార్థమే. ఉదాహరణకు విశ్వనాథ పుట్టప్ప లాంటి రచయితలకు లభించిన బహుమతులు తెలుగు, కన్నడాల కంటే సంస్కృతానికే ఎక్కువ చెందాయని చెప్పటంలో తప్పు లేదేమో! బహుభాషా పరిజ్ఞానం భారతీయ సాహిత్యంలో ప్రచురంగా వృద్ధి చెందినప్పుడు ఇలాంటి ఉదాత్త దృక్పథం ఏర్పడుతుంది. అలాంటి వాఙ్మయ దృష్టి అలవడాలనే సాహిత్య అకాడమీ, జ్ఞానపీఠం లాంటి సంస్థలు కృషి చేస్తున్నాయి. ముఖ్యంగా సాహితీపరులు భాషాభేదాన్ని అధిగమించి భావ గౌరవాన్ని నిరపేక్ష పూజ్య భావంతో ఆదరించడం అవసరం.

జ్ఞానపీఠ బహుమతి కేవలం సృజనాత్మక సాహిత్యానికి పరిమితమై ఉండటం వల్ల జ్ఞాన వాఙ్మయానికి సంబంధించిన రచనలకూ, రచయితలకు ప్రాధాన్యం లభించడం లేదనే ఒక ఆలోచన కూడా భారతీయ జ్ఞానపీఠ యాజమాన్యంలో ఉదయించింది. దానికి ఫలితంగా కీ.శే. శాంతి ప్రసాద్ జైన్ తల్లి మూర్తిదేవి పేరిట మరో బహుమతి అయిదారు సంవత్సరాల

క్రితం ఆరంభమయింది. ఇప్పటికి అయిదారుగురు రచయితలకు ఈ బహుమతి లభించింది. శ్రీ కె. నాగరాజరావు, శ్రీ మనూభాయీ పంచోలి, శ్రీ వీరేంద్ర కుమార్ జైన్, శ్రీ కన్హయ్యాలాల్ సేఠియా, శ్రీ విష్ణు ప్రభాకర్ ఇంతవరకు ఈ సన్మానం అందుకున్నారు. ఆరంభంలో ఈ బహుమతి క్రింద 11వేల రూపాయలు ఇచ్చేవారు. ఆ తర్వాత దీనిని 21వేల రూపాయలకు పెంచడం జరిగింది. గత సంవత్సరం నుంచి ఇది 51 వేలయింది. ముందు ముందు ఈ బహుమతి కూడా జ్ఞానపీఠ బహుమతికి సరిసమానం కావచ్చునని ఊహ. సృజనాత్మక సాహిత్యానికీ, జ్ఞాన వాఙ్మయానికీ సరిసమానమయిన ప్రాధాన్యం ఇచ్చి రెంటినీ పరిపూర్ణ హృదయంతో ప్రోత్సహించటం వాగ్దేవికి హర్షదాయకమే అవుతుంది.

యువ రచయితలను ప్రోత్సహించేందుకు కూడా జ్ఞానపీఠం ఒక ప్రత్యేకమయిన పథకం ఏర్పాటు చేసింది. వేరు వేరు సాహితీ ప్రక్రియలలో యువ రచయితలకు పోటీ జరిపి అందులో శ్రేష్ఠతమమయిన వ్రాతప్రతులను జ్ఞానపీఠం ప్రచురిస్తుంది. అది పోటీదారుల తొలిరచన అయి ఉండటం ఇందులో విశేషం. ఇలా నాలుగు సంవత్సరాల నుంచి ఇలాంటి పోటీలు జరుగుతున్నాయి. కథా సాహిత్యం, హాస్య వ్యంగ్య రచన, నాటకం, నవల ఇంతవరకు ఈ పథకంలో ప్రవేశించాయి. ప్రస్తుతం ఈ పథకం హిందీకి మాత్రమే పరిమితమయింది. క్రమంగా ఇది మిగిలిన భారతీయ భాషలకు కూడా విస్తరించవచ్చు.

అలాగే జ్ఞానపీఠం ప్రచురించే రచనలు ప్రస్తుతం ఎక్కువ భాగం హిందీలోనే ఉన్నాయి. మిగిలిన భారతీయ భాషలలో ప్రచురణ కార్యక్రమం కూడా సాగించేందుకు 1969లో ప్రయత్నం జరిగింది. కానీ ఇందులో సాధక బాధకాలున్నాయి. సుమిత్రానందని పంత్ రచించిన 'చిదంబర' కావ్యానికి జ్ఞానపీఠ బహుమతి లభించినప్పుడు ఆ కావ్యాన్ని ఆంగ్లంతో బాటు ఇతర భారతీయ భాషల్లోకి అనువదింపజేసి ఆ అనువాదాలను జ్ఞానపీఠం ప్రచురించింది. కాని ఈ రంగంలో అనుకున్నంత ప్రోత్సాహం లభించకపోవడం వల్ల ఆ ప్రయత్నం అంతటితో సమాప్తి చెందింది. అయినా జ్ఞానపీఠ బహుమతి పొందిన రచనలను మిగిలిన భాషల్లో ఏదోవిధంగా అందచేయగలిగితే అది చాలా ప్రశస్తమయిన పని అవుతుంది.

జ్ఞానపీఠ బహుమతి పొందిన రచయితలపై పరిశోధన కార్యక్రమం చేపట్టాలని దేశంలోని సారస్వత సాంస్కృతిక సంస్థల సహకారంతో ఈ సత్కార్యం కూడా సాధ్యం కాగలదని ఆశ. జ్ఞాన పీఠ బహుమతి ఈనాడు జాతీయస్థాయిలోనే కాక అంతర్జాతీయ స్థాయిలో కూడా అప్రతిమానమయిన స్థానం ఏర్పరచుకుంది. ఇది వాఙ్మయ తపస్సంపన్నులు సరియైన మార్గంలో ప్రసరింపజేసి తాము తరించి ఇతరులను తరింపచేయటం ఈ తరం వారి సాహితీ ప్రియుల పరమ కర్తవ్యం.

– స తరతి లోకాన్తా రయతి –

# ఉపాఖ్య

శ్రీ రాధాముఖమందహాస మధుర క్రీడా సుఖాక్రీడమా
పారావార గభీర కోణ విలసత్ పర్యంకమే సౌఖ్యమో!
'రా,రా, రా'యని రేయియుంబవలు నిద్రాహారముల్ లేకనిన్
తారాస్థాయిని బిల్చు నీ సుతల ఆర్తారావముల్ ముఖ్యమో!

దాదాపు నాలుగు దశాబ్దాల క్రితం నాకు బాల్యం నుంచిపరమారాధ్యుడైన బాలగోపాలుని వేణుగానం వినాలనీ, ఆ నాదం నాదాకా రాకుండా తన మోవితో ఆ గ్రోవిని నిరోధిస్తున్న పరమారాధిక రాధిక రమ్యసౌమ్య రూపలావణ్యం చూడాలనీ నాలో నేను ఆలపించికున్న ఆర్తనాదం ఇది. అప్పటినుంచి ఇప్పటివరకు ఆకు ఆ గానం వినిపించలేదు. ఆ రూపం కనిపించలేదు. ఆ తర్వాత ఏదో సందర్భంలో రాధోపనిషత్తు చదువుతుంటే ఈ గాన రహస్యం కొంతవరకు బోధపడింది. 'తయా సమం హేమమురళీం వాదయన్ హేమ స్వరూపాం అనురాగసంవలితాం కల్పతరోర్మూలే (ఆస్తే) సురభి విద్యా అక్షమాలా శ్రుతిరివ పరమాసిద్ధాసాత్వికీ – అత ఏవ ద్వయోర్నభేదః' అన్న ఉపనిషద్వాక్యాలు నన్ను ఈ జంటకు కొంత సమీపస్థుణ్ణి చేశాయి.

ఎక్కడ ఉన్నా ఇద్దరూ కలిసే ఉంటారట. కలిసే పాడుతారట. కల్పవృక్షం క్రిందకూర్చుని పసిడి పిల్లనగ్రోవిని తమ మోవికి చేర్చుకుని సాత్వికమైన స్వరలహరిని సమవేతంగా ఇద్దరూ సమకూర్చుకుంటూ ఉంటారట. కల్పవృక్షానికీ కలికాలానికీ చాలాదూరం కాబట్టి 'ఏ తరుచ్ఛాయ మురళి వాయించుచుంటో స్థాయినించుక హెచ్చింపవోయి కృష్ణ!' అని వేణుగోపాలుణ్ణి వేడుకున్నాను. క్రమంగా ఆ స్థాయి నాకు భారతభారతిలో పలువిధాలుగా పలుకుబడికివచ్చింది. భారతభారతీ ప్రియనందనుల ప్రబ్ధ వాక్కులో నాకు శ్రీకృష్ణచైతన్యంలోని చిద్రూపం, శ్రీరాధానందంలోని సద్రూపం స్థాలీపులాకంగా కనిపించింది. ఈ గానమాధురినీ, రూపలావణ్యాన్నీ తెలుగు సాహిత్యం ఎలా ఆలకించి తిలకించి అందరికీ వినిపించిందో చూపించిందో చక్కగా నిరూపించిన రాధికా పరిశోధన డా॥ నందివాడ అనంతలక్ష్మి

తెలుగు సాహిత్యంలో రాధాతత్త్వం ఎలా ప్రవేశించింది, ఎలా ప్రచురించింది, ఎంతవరకు తెలుగు హృదయాలను ఈ వాగ్విభూతి అలరించింది, అసలీ రాధాకృష్ణులు ఎవరు – అనే

విషయాలను కూలంకషంగా చర్చించి మనస్సును ఆకొట్టుకునే మృదుమధుర పదజాలంతో తీర్చిదిద్దిన పరిశోధనా ప్రబంధం ఈ గ్రంథం.

దీనిని ఆమూలాగ్రం చదివి ఆనందించే అవకాశాన్ని నాకు ప్రసాదించింది పూజ్యులు డా॥ భావరాజు నరసింహారావుగారు. వారి కోరికపై నేను ఈ గ్రంథానికి పూర్వరంగంగా ఈ చిన్న ఉపాఖ్యను వ్రాస్తున్నాను.

పది అధ్యాయాలలో పరిపూర్ణత చెందిన యీ పరామర్శ ఇంకా అపూర్ణమే అని రచయిత్రి సవినయంగా చెప్పుకున్నారు. ఆ మాట నిజానికి సత్యమే. ఈ గ్రంథంలోని ఒక్కొక్క ప్రకరణాన్ని ఒక ప్రత్యేకమైన పరిశోధనగా రూపొందించవచ్చు. తెలుగు కవులు ప్రత్యేకంగా చిత్రించిన ఇళాపాత్ర తాత్త్విక వివేచనకు తగిన విషయం. జ్యోతిశ్శాస్త్రపరంగా శ్రీరాధాకృష్ణుల వాస్తవికతను ఉద్ఘాటించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఈనాటి సాంఘిక పరిస్థితులలో రాధాకృష్ణుల అద్వైతమయిన అనురాగం ఏ రూపంలో ప్రతిపాద్యం, గ్రాహ్యం అనే విషయం కూడా చాలా ముఖ్యమైన విషయం. కాని తాను ఎన్నుకున్న విషయాలను కూర్చుకున్న పరిధిలో అనంతలక్ష్మిగారు సాంతంగానే చెప్పగలిగారని చెప్పితీరాలి.

ముఖ్యంగా పరిశోధనా గ్రంథాలలో కనిపించే క్లిష్టత ఈ రచనలో ఎక్కడా కనిపించదు. భాషలోకానీ, ఆలోచనలకు ఆకృతి – అందులోకూడా మధురాకృతి – సమకూర్చటంలో కానీ, పరమ రహస్యాలను సామాన్యపాఠకులకు కూడా అందుబాటులో పలికేట్టు అందించడంలోకాని అనంతలక్ష్మి అద్భుతమైన నైపుణ్యం చూపించారు. ముఖ్యంగా రాధాకృష్ణుల దాంపత్యంలో కనిపించే భక్తిశృంగారాలను సున్నితంగా సునిశితంగా సువిమర్శితంగా చెప్పగలగటం ఈ గ్రంథంలోని లలిత గాంభీర్యానికి మూలకందం.

సామాన్య దృష్టికి రాధాకృష్ణులు అనగానే ముందు శృంగారం స్ఫురిస్తుంది. గొప్పగొప్ప కవులు కూడా ఈ విషయంలో తప్పటడుగులు వేసి భక్తికీ, శృంగారానికీ రెంటికీ ద్రోహం చేశారు. అలాంటి అశ్లీల రచనల్లోని అభద్రతను కాంతాసమ్మితంగా విమర్శించి పాండురంగ మహత్త్వం లాంటి సత్కావ్యాలలో రాధాతత్త్వం ఎంత ఉదాత్తంగా చిత్రింపబడిందో చక్కగా ప్రతిపాదించడం జరిగింది.

ఇలాంటి విమర్శలవల్ల సామాన్య పాఠకుల సంస్కారం పెరుగుతుంది. శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావు గారి 'రాధాకృష్ణ' అనే నాటకం కూడా ఈ కోటికిచెందిన రచన అని రచయిత్రి చాలా చక్కగా వివరించారు. లోకంలో రాధాకృష్ణుల సంబంధానికి గల దుష్ప్రచారాన్ని పారద్రోలి, శ్రీ స్వరూపిణి అయిన రాధాదేవి ఆరాధనలోగల అలౌలిక తత్త్వాన్ని తెలుగునాట

వ్యాపింపచేసిన పానుగంటి వారి యీ నాటకం వారు స్వయంగా చెప్పుకున్నట్టు 'పరమార్థ రాధాకృష్ణ నాటకం!'

ఆధునిక తెలుగు సాహిత్యంలో కూడా రాధాతత్త్వం ఎలా ప్రస్తావితమయి ఉందో ఈ గ్రంథం తెలియపరిచింది. జయదేవుల గీత గోవిందంతో. తెలుగునాట ప్రవేశించిన రాధాతత్త్వం ఈనాటికీ తెలుగు రచయితల వాక్కును ఆకర్షిస్తూ ఉండటం ముదావహం. ఇలాంటి నిత్యనూతన విషయాన్ని చేపట్టి తెలుగు భాషకూ, సాహిత్యానికే కాక తెలుగు సంస్కృతికీ సమాజానికీ శ్రేయస్సూ, ప్రేయస్సూ సమకూర్చిన డా॥ నందివాడ అనంతలక్ష్మి గారిని నేను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. శ్రీ రాధాకృష్ణుల అన్యోన్యత ఆమెకు అండగా కూడి ఆమె చేత ఇలాంటి సద్గ్రంథాలు ఇంకా ఎన్నో వెలయింపజేయాలని నా అభీప్స. రసజ్ఞులయిన పాఠకులు కూడా ఈ గ్రంథం చదివి ఇలాగే అనుకుంటారని నా నమ్మకం.

శ్రీ రాధామణి తనుచ్ఛాయ సోకినంత మాత్రాననే శ్యామసుందరుని కృష్ణవర్ణం హరితద్యుతి అవుతుందని సుప్రసిద్ధ హిందీ కవి బిహారీలాల్ (1595-1663) తన సప్తశతికి మంగళాచరణం చేస్తూ అన్నాడు. ఆ వాక్యం ఈ రచనకు అనువాకం కావాలని నా ఆశంస.

# పుస్తక ప్రపంచానికి స్ఫూర్తిని ప్రసాదించిన పుణ్యజీవి శ్రీ మద్దూరి నరసింహారావు

శ్రీ యం. శేషాచలం కంపెనీ, ఎమెస్కో పాకెట్ బుక్స్, ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, పుస్తక ప్రపంచం, ఇంటింట గ్రంథాలయం, ప్రాగ్భారతీ ప్రచురణలు – ఈ మాటలు తెలుగు నాట నాటుకొని పొయ్యాయి. వీటిని గురించి వినని తెలుగువాడు కానీ, వీరి ప్రచురణల్లో కనీసం రెండు మూడు రచనలనైనా చదవని తెలుగు పాఠకుడుగాని సామాన్యంగా తెలుగుదేశంలో కనిపించడు. ప్రఖ్యాత రచయితలు కూడా ఎమెస్కో వారు తమ రచనలను ప్రచురించారని గౌరవంగా చెప్పుకోవడం కద్దు. తెలుగు పుస్తకాలకు, తెలుగు పాఠకులకు, తెలుగు రచయితలకు – ఇలాంటి ఆత్మ గౌరవాన్ని, ఆత్మీయతను, ఆనందాన్ని అందజేసిన యీ సంస్థకు మూలకందంగా నిలచి గడచిన ఈ నాలుగు దశాబ్దాలుగా ఈ పుస్తక ప్రపంచానికి స్ఫూర్తిని ప్రసాదించిన శ్రీ యం.ఎన్.రావు గారు ఈనాడు కీర్తిశేషులై తన పార్థివ శరీరాన్ని చాలించడం పాఠకలోకానికే కాక పుస్తక ప్రపంచానికే తీరని లోటు. ఆయన పూర్తి పేరు శ్రీ మద్దూరి నరసింహారావు – ఎంతమందికో తెలియదు. తన పేరు ప్రధానంగా భావించక తాను చేయవలసిన పనికి ప్రాధాన్యమిచ్చిన సహజ సౌజన్యమూర్తి కనుకనే రావు గారు తాను నిలబెట్టిన సంస్థ పేరు కలకాలం నిలిచేటట్టు తన స్వల్ప జీవిత సర్వస్వం పుస్తక ప్రపంచానికి అర్పించి నిర్విరామమైన కృషి చేశారు. యం.ఎన్. రావ్ అంటే మర్యాదకు, నయ వినయాలకు మారుపేరయింది.

పుస్తకాలను ప్రచురించి పుస్తక ప్రపంచానికి అపారమైన సేవ చేసిన మహనీయులు ఎంతోమంది ఉన్నారు. కాని తానున్నంతకాలం సంపన్నంగా జీవించి జీవితం చాలించేవారు ఉన్నతజీవులు మాత్రమే కాగలరు. కాని తన తర్వాత కూడ తాను తరించి ఇతరులను తరింపచేయగల అమరజీవులు పుస్తక ప్రపంచంలో ఎంతోమంది లేరు. అలాంటి కొద్దిమందిలో శ్రీ మద్దూరి నరసింహారావు గారు ఒకరు. పుస్తక ప్రచురణ అనేది ఒక వ్యాపారంగా వారు ఎన్నడూ భావించలేదు. ఆలోచనపరుల మనస్సుల్లో వెలువడిన ఆలోచనలను అశేష పాఠక లోకానికి అందించడం ఒక ఆరాధన, సారస్వత సాధన అని భావించిన భావనాపరుడు శ్రీ యం.యన్.రావు. ఒకవైపు పాఠకుల మనోవృత్తిని శాస్త్రీయంగా పరిశీలించి మరోవైపు దానికి అనుగుణమైన సాహిత్యాన్ని అనువైనరీతిలో వారికి అందించటం సామాన్యమైన సాధనకాదు.

దానికి శాస్త్రీయ దృక్పథం, సారస్వత పరిచయం, మంచి మనసు, నిండు హృదయం, నిస్వార్థబుద్ధి, నిర్విరామ కృషి, నిర్లిప్తమైన నిష్ఠలాంటి అనేక గుణగణాలు కావాలి. ఇంతటి అంతఃకరణ శుద్ధితో పనిచేయబట్టే ఈనాడు ఎమెస్కో అంటే తెలుగు దేశంలో నానుడిగా వినబడుతూ ఉంది.

శ్రీ రావు గారు తెలుగు వారయి పుట్టడం తెలుగు పుస్తక లోకం చేసుకున్న అదృష్టం. వారికి తెలుగుదేశంలో ఎంత పలుకుబడి ఉందో అంతర్జాతీయ రంగంలో అంతకు మించిన పేరు ప్రతిష్ఠలున్నాయి. దాదాపు 30 సంవత్సరాలనుంచి వారు ప్రచురణ కర్తలకు సంబంధించిన అంతర్జాతీయ సమావేశాల్లో పాల్గొంటూ ప్రచురణ కార్యకలాపాలకు నవీన పరిభాష కల్పించి, ఆ రంగంలో కొత్త కొత్త మార్పులు తీసుకొని వచ్చారు. 'బుక్ పబ్లిషింగ్ మాన్యుయల్' అనే పేరిట వారు రచించిన గ్రంథం ఈనాడు ప్రపపంచమంతటా ప్రచురణశాస్త్రం అభ్యసించే విద్యార్థులు. పరిశోధకులు ఎంతో ప్రామాణికంగా భావించి చదువుతారు. ఈ పుస్తకంలో శ్రీ రావుగారు వాడిన ఆంగ్లంలో వారి వ్యక్తిత్వంలోని సారళ్యం, తారళ్యం, వినయం, వివేకం తొణికిసలాడుతూ ఉంటాయి. ఎన్ని సంవత్సరాల కృషి ఫలితంగానో వారి యీ రచన ప్రచురణలోకానికి ఆలోచనామృతంగా లభించింది.

శ్రీ రావు గారు కేవలం ఆలోచనాపరులే కాదు, కార్యశూరులు కూడాను. ఇటీవల క్రైస్తవ సాహిత్య ప్రచారానికి ఎలా ఏం చెయ్యాలని లండన్‌లో జరిగిన చర్చల్లో పాల్గొని వారికి సలహాలిచ్చేందుకు శ్రీ రావుగారిని ఆహ్వానించారు. వారి సలహాలు అందరూ అభినందించి అవలంబించేందుకు అంగీకరించారు. కాని నిండు కుండలాంటి శ్రీ రావు గారి హృదయం దానికి తొణకలేదు. లండన్ నుండి రాగానే మన ప్రాచీన సంస్కృతిని భారతీయులకు, ముఖ్యంగా తెలుగువారికి, ఎలా అందజేయాలని వారు ఆలోచించారు. వెంటనే ప్రాగ్భారతీ ప్రచురణలను ప్రవేశపెట్టారు. శ్రీ రావుగారి జీవితంలో ఇది గొప్ప మలుపు. నవలలు, కథలు, చిన్న చిన్న కవితా సంకలనాలు, కొన్ని బరువైన గ్రంథాలను ప్రచురించడంలో తన శక్తిసామర్థ్యాలను వినియోగించిన రావు గారి మనస్సులో 'ఏదో ఒక ఉషస్సు' ఈ నవ భావనను ఉదయింపజేసింది. నవంబర్ 7 (1977) ఆశ్వయుజ బహుళ ఏకాదశి ప్రాగ్భారతీ ప్రచురణలకు నాంది పలికిన పుణ్యదినం. ఆనాడు 'ఆది–అనాది' అనే పుస్తకాన్ని వారు ప్రెస్సుకు పంపించారు. రెండు నెలలు నిండకముందే గంగిరెద్దులా ఛంగు ఛంగున నడచివచ్చే సంక్రాంతి నాటికి అలాంటివి అయిదు పుస్తకాలు తీసుకొని రావాలని వారి సంకల్పం. ఈ బృహత్సంకల్పంలో వారు నా ఉడుత సహకారాన్ని అర్థించి ఆదిత్య హృదయం, గీత, శ్రీ విష్ణు సహస్రనామం, శ్రీ లలితా సహస్రనామం ఈ నాలుగు విషయాల్లో నాచేత నాలుగు పుస్తకాలు వ్రాయించడం దైవ సంకల్పం. నా దగ్గరి నుంచి వ్రాత ప్రతి

అందకముందే వారు ప్రెస్సును ఏర్పాటు చేసుకున్నారు. ప్రెస్సులో పుస్తకాలు అచ్చవుతూ ఉండగానే వాటిని గురించిన ప్రకటనలు రూపొందించడం, ధరలు నిర్ణయించడం జరిగింది. ఇలా చకచకా ఏదో వెనుక వత్తిడి చేస్తున్నట్లు ప్రాగ్భారతీ ప్రచురణల కార్యక్రమం ప్రచండవేగంతో కొనసాగింది. ఎలాగయితేనేం డా॥ బుర్రా వెంకటప్పయ్యగారి అధ్యక్షతన న్యాయమూర్తి తాతాచార్యులు గారు పుస్తకాలను ఆవిష్కరించారు. గీతామృతం కొంచెం ఆలస్యంగా వచ్చింది. జనవరిలో ఆది–అనాది (ఉపనిషత్సారం), ఆదిత్య హృదయం, శ్రీ విష్ణు సహస్రనామం, శ్రీ లలితా సహస్రనామం వస్తే ఫిబ్రవరి ఆరంభంలో గీతామృతం అందరికీ అందింది. అందరికీ అమృతం పంచిపెట్టిన అమృత హృదయుడు ఇంతలోనే తాను కూడా అమరత్వం పొందుతాడని ప్రపంచం అనుకోలేదు. కాని కాలం అలా నిర్ణయించింది. మహాకాలుని సంకల్పం ప్రకారం కాలజయుడయిన రావుగారు ఫిబ్రవరి 15 బుధవారం ఉషఃకాలంలో అనంత చైతన్యరాశిలో లీనమైపోయారు. ఇది పుస్తక ప్రపంచానికి, పాఠక లోకానికి తీరని లోటు. కాని పూర్ణమదః పూర్ణమిదం. పరిపూర్ణమైన జీవితం గడిపిన పుణ్యజీవికి ఎక్కడికక్కడే పరిపూర్ణత సిద్ధిస్తుంది. అది దైవ నిర్ణయం.

కాని లౌకికంగా వ్యక్తిగతంగా చూచుకున్నప్పుడు మనస్సును సమాధాన పెట్టుకోవడం చాలా కష్టం. గడచిన మూడు నెలల నుండి వారితో నాకు ఎందుకో చాలా సన్నిహితమైన సంబంధం ఏర్పడింది. ఈ మూడు నెలల్లో వారు మూడుసార్లు ఢిల్లీ వచ్చారు. మూడుసార్లు మా యింట్లోనే బస చేశారు. నేను ఇంట్లో ఉన్నంతసేపు నాతో మాట్లాడటమే వారికి విందు. మాటమాటకు మురిసిపొయ్యేవారు. నేను వ్రాసిన మాటలను తన మనస్సులో మూటగట్టుకొని అప్పుడప్పుడు వాటిని వల్లె వేసేవారు. నాలుగు సంవత్సరాల క్రితం నా తెలుగు కామాయని అచ్చువేయటంతో వారితో నాకు తొలి పరిచయం. కాని అప్పుడు నేను రచయితను. వారు ప్రచురణకర్తలు. కాని ప్రాగ్భారతి మాకు ఎన్నడూ లేని ఆత్మీయతను కల్పించింది. ప్రతి ఏకాదశి ఉదయం నాకు ఉత్తరం వ్రాసేవారు. జనవరి మొదటితేదీ నాకు నూతన సంవత్సర శుభాకాంక్షలు మొట్టమొదట మదరాసు నుండి అందాయి. ఉదయం లేవగానే టెలిఫోను మోగింది. “నేను యం.ఎన్.రావును మదరాసు నుండి మాట్లాడుతున్నాను. హాపీ న్యూ ఇయరండీ” అని రావుగారు పలికిన మాటలు ఇప్పుడు వినబడుతున్నట్టు తోస్తుంది. ఒకనాడు వారు నాకు టెలిఫోన్ చేయాలని ఫోను దగ్గరకు వెళ్ళగానే నా ఫోను వారికి అందిందట. ఆ మాట వారు ఎంతమందికో చెప్పుకొని మా ఆత్మీయతను ఆనందించారు. డిశంబరు 24వ తేదీ వారికి నా గీతామృతం అందగానే అది చదువుకొని ఆనందంతో పొంగిపోయి వ్రాశారు. “ఈ పని ప్రారంభించినప్పటి నుంచి మీ ఆత్మీయత, ఆపేక్ష కట్టలు తెగి, పొంగి పొరలి వస్తుంటే, ఆ ప్రవాహంలో ఆనందంలో కొట్టుకుపోతున్నా – పోవాలనే ఉంది. ఎక్కడికి?

ఎంత దూరం? అక్కడికి – దూరమూ లేదు! అక్కడ దుఃఖమూ లేదు! దురాశ లేదు!! పాపమనెడి భయమే లేదు!!!... ఎవరో ఎక్కడో ఎప్పుడో చెప్పిన మాటలు జ్ఞాపకం వస్తున్నాయి."

ఈ మాటలకు ఆనాడు అర్థం వేరు. ఈ నాటి పరమార్థం వేరు. ఇంతటి దృఢ సంకల్పం సామాన్యులకు సాధ్యం కాదు. రావుగారి కుటుంబానికి ఏర్పడిన లోటు కంటె కూడా గుణగ్రహణ పారీణులైన పాఠకుల కోసం, సహృదయులయిన ప్రచురణకర్తల కోసం పరితపించే రచయితగా నాకు, నాలాంటి అనేక రచయితలకూ తీరని లోటు ఏర్పడింది. కాని శ్రీ రావు గారు చూపిన వెలుగుబాటను అనుసరించి ఆ బాటకు మరి కొంతవెలుగును సేకరించగల వ్యక్తి రావు గారి కుమారుడు చిరంజీవి రఘు ఉన్నారు. తన తండ్రి సాధించిన సారస్వత సాధనము ముందుకు సాగించవలసిన బాధ్యత అతని మీద ఉంది. అందుకు సహకరించవలసిన బాధ్యత అందరిమీద ఉంది.

# ఆంధ్రీ ప్రశస్తి

ఓం నమశ్శివరూపాద్యాం హృద్యాం పద్య పదోజ్జ్వలాం
సాధ్వీం స్పష్టాక్షరాం సాంద్రాం చాంద్రీం ఆంధ్రీం భజామ్యహం. 1

శ్రీవాణీ గిరిజా ధాత్రీం కవిత్రయ సరస్వతీం
మందార మధురానంద నందినీం తాం నమామ్యహం. 2

ఆముక్త మాల్యదానేక కావ్యాభరణ భూషితాం
సంపన్న యుగసాహస్రీం సాహితీం సంస్మరామ్యహం. 3

త్యాగబ్రహ్మ రసానంద తర్పితాం క్షేత్రపాలితాం
అన్నయ్యస్వర సారస్యాం భారతీం భావయామ్యహం. 4

శ్రీశేష శైల వేదాద్రి సింహేంద్రాచల వాసినీం.
దక్షరామా చలారామాం ధాత్రీం ఆంధ్రీం నమామ్యహం. 5

త్రిలింగాం లింగనిలయాం త్రినగాం నగసేవితాం
కృష్ణా గోదావరీ రమ్యాం రస్యాం స్వాస్యాం స్మరామ్యహం. 6

రాజరాజేంద్ర రాడ్వంద్యాం కృష్ణరాయ నిషేవితాం
దక్షిణాంధ్ర ధ్వజోపేతాం రాజ్ఞీం ఆంధ్రీం భజామ్యహం. 7

పంచాశత్ పీఠ సంభావ్యాం సర్వవర్ణహిరణ్మయీం
వ్యాకృతాం సుకృతాం స్ఫీతాం గీతాం ఆంధ్రీం నమామ్యహం. 8

విశ్వనాథ వియద్వేణీం రంగనాథాంతరంగణీం
సర్వాంతరంగ హారిణీం తన్మయీం భావయామ్యహం. 9

★ ★ ★

# స్వాతంత్ర్యసంరంభము

శ్రీ నృత్యంబొనరింపఁగ! వీనుల పండువగవాణి - వీణియ మీటన్
మేనక సుతపాడఁగ రస! పానం బొనరింతువమ్మ భారత జననీ!
గాంధీజీ!
కదనము మాటయెత్తకయె - కత్తులు డాళ్లు కఠార్లు పట్టకే!
అదయతనుష్ణ రక్తముల - నానకయే రణభేరి మ్రోగకే!
సదమల శాంతసత్యగుణ - సాధనచేఁ బ్రథిత స్వతంత్రతా!
సదనము గట్టి బానిసపు - సంకెలలన్ విడఁగొట్టి తక్కటా!

తెల్ల వారల తెల్వి - తెల్లవారగఁ జేయు
        ముత్యంబులొల్కు నీ - బోసినోరు
రమ్య భారతికి నా - రతిపాట పాడుఁబో
        తెంపు లేకుండ రా - ట్నంపు గీతి
పాశ్చాత్య వీరుల - నిశ్చేష్టులం జేయు
        నసమానమైన - సత్యవ్రతంబు
అఖిల ప్రపంచంబునందు శాశ్వతముగ
        శాంతి గొల్పెడు నహిం - సా వ్రతంబు
పరదేశ నిజదేశ - వాసుల మనసులు
        ల్లాసంబుజేయు కొ-ల్లాయిగుడ్డ
సులభసూత్రంబుగా - సుభగ దిగ్విజయంబుఁ
        బిలిచి తెప్పించు నీ - పిలకజుట్టు
అనుపమాయుధములు గూర్చి - తసమధీర
        భరతవీర! మహాశూర! భవ్యచరిత!
కలియుగా దర్శ నిష్కామ - కర్మయోగి!
        దివ్యరూప! మహాత్మ! గాంధీమహాత్మ!

చేయని వాఁడవె చేసియుఁ । జేయకయును జేసినట్లె - చిత్రచరిత్రా!
తోయజపత్రముపైఁ గల । తోయము నీగురువటంచుఁన్ దోచెడి మదికి
నాస్తియిఁకఁ బారతంత్ర్యం । బస్తోకత్వంబు భారతాంబకు హెచ్చెన్
స్వస్తిం జెప్పుము వారల । "బస్తీ ఫ్యాషన్సు" । కింక - భారతజననీ

★ ★ ★

# ఇలపావులూరు - ఇంద్రప్రస్థం

మా అమ్మ సరస్వతమ్మ - మాట మంచినేర్పినమ్మ
ఆ మాటల వెనకనున్న - అంతర్యము విప్పి చెప్ప
సుబ్రహ్మణ్యుడు వెంకట - సుకుమారుడు జనకుడయ్యె
మాతృశ్రీ భారతిగా - మధురభాషి జనకునిగా
మాకు ప్రసాదించిన మా - మాతామహ పితామహులు
మాకు వందనీయులు బహు - మాన్యులు 'మానిషాద'సములు
ఆదికవికి 'మా నిషాద' మందించినదట భారతి
ఆ భారతి వెను వెంటనె - అరిగి రామ కథారతి తెలుపగ
ఆర్తి చెందెనట వాక్పతి - అది రామాయణమయ్యెను.

★ ★ ★

# కలకత్తా - కలకత్తా

కలకత్తా కలకత్తా
అవినశ్వర కలకత్తా
కాలానికి కాలమయిన
కాళీనగరి కలకత్తా
కలకత్తా కలకత్తా
భలే అత్త కలకత్తా
కలల కత్త కలకత్తా
కళల కత్త కలకత్తా
కవితకు సంగీతమునకు
నృత్య గీత వాద్యములకు
నిలయమయిన కలకత్తా
నాకు మనసు కలకత్తా
వెన్నలాంటి కలకత్తా
వెన్నుపూస కలకత్తా
వెన్నెలవలె విరబూసే
పిన్నవయసు కలకత్తా

★ ★ ★

# ఉగాది పచ్చడి

**ఉగాది పచ్చడి అనాదిగా యుగయుగాల రుచులకు పునాది అయినది**
ప్రభవ విభవలెన్నో పరికించిన పరబ్రహ్మమయ పదార్థ నిధి యిది
ఆరు రుచుల ఆమ్నాయము జగమని నోరూరించెడి నుడుల కదలి యిది
ఉప్పు పులుపులకు తీపి చేదులకు ఒగరు పొగరులకు ఉనికి పట్టు ఇది
సకల రుచులు సహజీవన పాఠము శాంతియుతముగా సాధించుటనిది
షడ్రస షడృతు షట్చక్రములకు సమరస సరస రసాయనమయినది
**ఉగాది పచ్చడి అనాదిగా యుగయుగాల రుచులకు పునాది అయినది**
జీవితమే ఒక ఉగాది పచ్చడి చేదులోనె నానా రుచులున్నవి
వేపపూత జీవిత పరమార్థము చూపులకది సుకుమారము సూక్ష్మము
అణువులలో పరమాణువయ్యు నఖిలాండ కోటినలరించి మించునది
చెట్టు చివర చిరురెమ్మల చాటున చిద్విలాసమును చిందుచు మురియును
నా తావును కనుగొన్న వారికిల ఏ తావులు రుచించవులే యని
**ఉగాది పచ్చడి అనాదిగా యుగయుగాల రుచులకు పునాది అయినది**
ఇందులో శ్రీముఖములున్నవి యిందె బహుధాన్యమ్ములున్నవి
సౌమ్య సాధారణములున్నవి సర్వధారి విధాతలున్నవి
శుక్ల నందన జయ విజయములు శోభకృత్వ్యయ పరాభవములు
భావ యువ కీలకములున్నవి హేవిళంబి విళంబి శార్వరి
దుందుభి ధ్వానములున్నవి దురిత రుధిరోద్గారులున్నవి
రక్తనయనోల్లాసమున్నది ప్రజోత్పత్తికి ఆశలున్నవి.
ఆశలందు నిరాశలున్నవి అందె మహదాశయములున్నవి.
ఇది ఉగాది పరమార్థం పచ్చడిలోని పదార్థం
ఈ పచ్చడి ఈ జగతికి వేప ప్రసాదము నిచ్చును
వేములేని చేదు విరిగి వేమనగా మారినచో
లేమి కలిమిగా మారును లేదన్నది లేకుండును
ప్రతి జీవికిసహజీవన పరమార్థము తెలియవలెను
సత్యధర్మ శాంతి సహన సమత మమత అలవడవలె
పువ్వులవలె నవ్వుచు మనపుడమి కడుపు పండవలెను
**ఉగాది పచ్చడి అనాదిగా యుగయుగాల రుచులకు పునాది అయినది**

★ ★ ★

# ఉగాదికి ఉపచారం

తినగ తినగ తియ్యదనము తోచెదు వేము
వేమనార్యునాట వెలది కెరుక
వినగ వినగ వెలుగు వెదజల్లు తెలుగాది
నాదమహిమ తెలుసు వేదములకు

యతి కుదరని చరణము వలె మతి చెదరిన కరణము వలె
శృతి తప్పిన రాగము వలె గతి తప్పిన రేవతితో
సతమతమై అరుదెంచిన సతి దుర్మతి కెదురేగుచు
వలపు పలుకరించినటులు పలికె స్వాగతము పాడ్యమి

కరయుగములు చరణమ్ములు కడుగు నవయుగాది వేళ
పండుగ సంరంభముతో నిండు మనసు భాండముగా
అర్ఘ్యమిచ్చినది ద్వితీయ ఆప్యాయము పొంగి పొరల

రమ్ము రమ్ము లోపలికని రమ్యముగా నర్మోక్తుల
ప్రేమ మీర ముద్దులొలుక పిలిచి పెద్ద పీటవేసి
గుణమెరిగిన కోడలివలె కూర్చోబెట్టెను తృతీయ

పేరుకు దుర్మతివి గాని తీరు తెన్నులే వేరని
దురవగాహమగు నీమతి దుందుడుకులు తెలియలేరు
అని చల్లని మాటలతో అభినందించినది చవితి

చలియింకా పోలేదని నులివెచ్చని నీళ్ళు కాచి
చలువరాళ్ళు పరచిన చిరు స్నానాగారమున పెట్టి
జలకమాడి రమ్మని ప్రాంజల భాషిని పంచమి యనె

మల్లె రెక్కలను మించిన మంచి మంచి వస్త్రములను
ఎంచి యెంచి ఏర్చి కూర్చి ఎక్కడెప్పు డెటువంటివి
అవసరమో అమరించిన దట్ట చట్టములుగ షష్ఠి

చల్లని పానీయములను సరిసమాన పాత్రలలో
చక్కగ అమరించితెచ్చి చుక్కలాంటి సతి సప్తమి
అందించిన దందముగా ఆనందము నందించగ

తాకినంత మలయానిల దాక్షిణము సోకునటులు
పరిమళములు విరజిమ్మెడు హరిచందన లేపనములు
గిన్నెలలో ఎనిమిదేండ్ల కన్నె తెచ్చినది అష్టమి

నవ నవ భావనలు వెలయ నవరసములు పరిఢవిల్ల
నవపల్లవ రాగలతలు నలువైపుల నాట్యమాడ
దివిని భువిని మురిపించెడు దివ్యగీతి పాడె నవమి

కమ్మని సంగీతమునకు కొమ్మ కొమ్మ కుసుమించగ
పూల జల్లు కురిసినదట పాలవెల్లి యనిపించగ
ఆ పూవులతో దుర్మతి నారాధించినది దశమి

ఏకాంతముగా శ్రీమతి ఏకాదశి సీమాంతము
హ్రీమంతము చేయు నవ్య నామాంకిత సుమములతో
సంవత్సరవతి వసుమతి సంకీర్తన సాగించెను

పూజలతో పూవులతో పొడి పొడి పదజాలముతో
కడుపునిండదని కమ్మని గారెలు బూరెలను చేసి
ఇష్టమైన మృష్టాన్నము ఎదుట పెట్టినది ద్వాదశి

కడుపు నిండ తిని దుర్మతి పడకవైపు చూచుచుండ
పసిడి పళ్ళెరము నిండుగ బహుపరిమళ భరితమ్మగు
తాంబూలము తెచ్చి యిచ్చె తరుణి త్రయోదశి తడయక

మతిమాలిన దుర్మతికీ మర్యాదలు చేయుట గని
పట్ట లేక పొక్కలేక గుట్టుగ కూర్చున్న చతుర్
దశికనిపించిన దప్పుడు 'దశకావలె మతికేమిని'

అవును నిజం అని పూర్ణిమ నవల మృదుల హాసముతో
'దుర్లభమతి మా దుర్మతి దుస్తరమతి దుర్గమ మతి'
అనుచు కురులు సవరించుచు అనురాగము నభినయించె

'అభినయమందు మీ వసుమతి అనుభవమే పరమార్థము'
అని మంగళ గీతిపాడి ఆరతిచ్చె నమావాస్య
మానసమున మాంత్రికముగ మనన చేసికొనె దుర్మతి

తెలుగులకు ఉగాది వెలుగులకు యుగాది
పలుకులకు పునాది ప్రతిపదాది
అన్ని పండుగలకు ఆది – కాని అనాది
అన్నిటికిది నాంది అయన వేది

★ ★ ★

# త్యాగరాజ స్మృతి

ఏ జపంబు చేసినావో ఏ తపంబొనర్చినావో
ఏ వ్రతంబు సల్పినావో ఎన్నగ మనసునకు రాదు

పుట్ట నుండి పుట్టిన ముని, పుడమి నెల్ల తిరుగు యోగి
పలుకులకు వెలంది కూడబలుకు కొనిరో యేమొ కాని
మూడు మూర్తులొక రూపున ముచ్చటగా వెలసినారు.
నాదముపాసించు వేళ నారదువలె భాసింతువు
సరస వాగ్విలాస విధుల శారద మూర్తీభవించు
సత్య పరాక్రముని కథను చాటిన ప్రాచేతసుడవు.

★ ★ ★

ఏ జపంబు చేసినావో ఏ తపంబొనర్చినావో
ఏ వ్రతంబు సల్పినావో ఎన్నగ మనసునకు రాదు

పంచనద క్షేత్రమును వరించినది స్వరార్ణవంబు
అర్ణవంబు నదులంజేర అద్భుతమాశ్చర్యమనుచు
అమర వరులు గంధర్వులు యక్షులెల్ల గుమి కూడిరి
రామ కథా మధువునందు రాగసుధారసము చేర్చి
నాదస్వర భావయోగ నవరస రుచి రాగములను
మేళవించి నామ రూప మేళకర్తవయితివీవు

★ ★ ★

ఏ జపంబు చేసినావో ఏ తపంబొనర్చినావో
ఏ వ్రతంబు సల్పినావో ఎన్నగ మనసునకు రాదు

నాదమునకు తనువు కూర్చి నామ రూపముల నొసంగి
నిత్య విజయమంగళముల నీరాజన మిచ్చినావు
స్వరము విన్న మా చెవులకు సౌందర్యము చూపినావు
చూడఁదగిన లావణ్యము సొంపుగ వినిపించినావు

నాభి హృదయ కంఠరసన నాసాదుల శోభిల్లెడు
సప్తస్వర సుందరులను సాంగముగ భజించినావు.

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

నిద్దురను నిరాకరించి ముద్దుగ తంబూర పట్టి
శుద్ధమైన మనసుకుదుర సుస్వరమున పాడి పాడి
కద్దు కద్దు కద్దనుచును పెద్దల మాటలను చెప్పి
ముద్దుగారు మోము చూడ బుద్ధిని పుట్టించినావు
కాల హరణమేల సుగుణ జాల హరికృపాల వాల
రారా మా రామ! యనుచు రయమున రప్పించినావు.

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు
కనక నిధి నిరాకరించి ఘనతను సన్నిధిని గోరి
దధి మధునవనీత రుచిని దమశమ తీర్థమునఁజేర్చి
దాశరథీ భజన సుధా ధ్యానమునర్థించి నావు
పట్టి విడువ రాదు పరులు గుట్టు తెలిసి నవ్వరాదు
తెలిసి యూరకుండరాదు తెలుపుట మరియాద కాదు
అలుక మాని పలుకుమనుచు పలికి పలుకరించినావు

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

ఎన్నగ మనసునకు రాని పన్నగేంద్రశాయి సొగసు
పన్నుగ కనుగొనినవారి కన్నులేల యనుచు వగచి
సరసిజములు మల్లె తులసి విరజాజులు పారిజాత

విరుల చేత పూజించని కరముల నిరసించి నావు
మాలిమితో త్యాగరాజు నేలిన రఘునాధ కథను
నయముగ కీర్తించలేని నాల్కను మేల్కొల్పినావు.

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

అలకలల్లలాడగఁగని ఆ రాణ్ముని వలె పొంగుచు
శ్యామసుందరాంగ రుచిర శక్తిని నెర నమ్మినావు
బాలు, కనక చేలు, లోకపాలు, రమా లోలుఁ జూచి
మధుర భావములకు మంచి మాటలు కల్పించినావు
నాదసుధారసము భువిని నరరూపము తాల్చె ననుచు
స్వరమునందు రసము చూపి సమరసమని పించినావు.

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

ఎందరో మహానుభావులందరికిని వందనమని
అందచందములను చిందు చందురు హృదయారవింద
మందు పొందు పరచి మహానంద మనుభవించినావు
కలకల ముఖ కళ జానకి కులుకుచు కనుగొనల కనగ
కన కన రుచి విరజిమ్మిన కనక వసన కమనీయత
దిన దినమును చనువునగని మనసు కరుగ తెలిపినావు.

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

దేహ మోహములను విడచి సోహము దాసోహమనుచు
తోడు నీడనీవె యనుచు వేడుచు నాదమున పాడి

శ్రీరాముని జయరాముని శృంగారము భావించుచు
మారు బలుకకున్నాడని మందలించినావు విభుని
ఏ పనికో జన్మించితివీ భువినని యెంచనీక
ఓర చూపు తగదని రఘు వీరుని వారించినావు.

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

అప్ప! రామ భక్తి యెంత గొప్పరా యటంచు పలికి
బలము కులము లేల రామ భక్తియె గుణమనుచు తెలిపి
నిజముగ నీ మహిమ తెలియ భజన చేయవలెనంటివి
పన్నగేంద్ర శయను తప్ప పరుల వేడ వలదంటివి
చిన్నతనము నాడె మున్ను నిన్నే నెర నమ్మితినని
అన్ని కల్లలనుచు తెలిపి ఆడిపాడి వేడినావు.

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

సొంపుగ అలివేణులెల్ల చుట్టుముట్టి మ్రొక్కుచుండ
వికసిత పంకజ వదనలు వివిధ గతుల నాడుచుండ
ఒకరి నొకరు కరమునగొని ఓరకనుల చూచుచుండ
శుకరవ ముఖరిత తరుణులు సొంపు మీర పాడుచుండ
సకల సురులు త్యాగరాజ సఖుని వేడ వచ్చియుండ
వేణుగానలోల విభుని వేయి కనుల గాంచినావు

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

సరిగంచుల శాలువగని చౌకట్టుల పోగులలర
పరువపు ప్రాయంబటంచు పరమాత్ముని వర్ణించుచు

ముఖనిర్జిత చంద్రుడనుచు ముద్దు మాటలాడుననుచు
సుఖమొసంగి బ్రోచుననుచు సుందరాంగుడని రంగని
శృంగారము కీర్తించుచు చెంగటనే చేరియున్న
రంగపతిని చూడ జనుల రారండని పిలచినావు

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

తల్లి దండ్రినేనుండగ తక్కిన భయమేల యనుచు
పలికిన కళ్యాణరాము పలుకులు పలుమారు పలికి
చాల కల్లలాడుకొన్న సౌఖ్యమేమియని వచించి
చింత దీర్పనంతరాత్మకెంత మోడి యనుచు వగచి
జగమేలెడు పరమాత్ముని నగు మోమును గనజాలని
తన జాలిని తెలుప లేక లాళలేను రమ్మంటివి

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

ఏ రాముని నమ్మితినో ఏ పాపము చేసితినో
ఎందు దాగినావో నిన్ను ఎచ్చోటని మొరబెట్టుదు
ఎందు పోదు నేమి సేతు నెంతని సైరింతు నిపుడు
ఎంత వేడి కొందు నీకు పంతమేల చెంతజేర
చేర రావదేమి నేను చేసిన పని మరచితివో
ఎందుకు నీ దయరాదని ఏ మేమో పొంగినావు

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

సంగీతము భక్తివినా సన్మార్గము నొసగదనుచు
రాగరత్నమాలికలను రామున కర్పించి నావు
రాగసుధారసము గ్రోల రంజిల్లవె మనసాయని
బోధించుచు యాగయోగ భోగములను సాధించితి
భాగవతోత్తములు కూడి పాడు కొనెడు కీర్తనములె
త్యాగరాజు కడతేరగ తారకమని తెలిపినావు

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

రామ రారయని నంతనె రాజపు చూపేల నయ్యా!
ఎదుట నిలచినంత సొమ్ము లేమి పోవు లేవయ్యా
ఉపచారము చేసేవారున్నారని మరువ బోకు
లేమి తెలుప పెద్దలెవరు లేరని చింతించబోకు
సాక్షిలేదులే యటంచు సాధించకుమని వేడుచు
భక్తి నివేదించి బ్రోవ శక్తినిరూపించినావు

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

మనసు నిల్ప శక్తిలేక ఘనముగ పూజింపనేల
మనసును వశపరచుకొన్న మంత్ర తంత్ర మాయ లేల
అన్ని నీవె యని తలచిన ఆశ్రమ భేదంబులేల
మనవిని విని మరువరాదు మరచుటకిది వేళకాదు
కృప కావలెనని వేడుచు కినుకమాని రమ్మంటిని

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

గ్రహబలమును ధిక్కరించి కామాదుల నిగ్రహించి
రామానుగ్రహము సకల కామితార్థ దాయకమని
విభుని దివ్య తేజోమయ విగ్రహమును కొనియాడుచు
సామదాన భేద దండ చతురుండు సరసుండు తప్ప
ఇతర దైవములను వేడ ఇల సౌఖ్యము లేదంటివి
సతతము సాకేతరామ చరణములే శరణంటివి

★ ★ ★

ఏ జపంబు చేసినావొ ఏ తపంబొనర్చినావొ
ఏ వ్రతంబు సల్పినావొ ఎన్నగ మనసునకు రాదు

★ ★ ★

జూన్ 1967

# విశ్వ భారతి

ఒకనాడు ఒకనాట ఒకమూల ఉదయించి
క్రమముగా గగనమును కాంతిమంతము చేసి
కలికతానిల తరంగములంతరంగమున
ప్రసరించగా విశ్వభావనోదయమయ్యె

విశ్వ పౌరుడవీవు విశ్వ భావన నీది
రవి కాంచలేని ఛవి కవి కాంచునని యంద్రు
రవిని గాంచిన కవివి కవిని గాంచిన రవివి
కనుకనే నీపేరు కాకతాళీయమై
జనక నామము నీకు సార్థకంబై నిలచె

అలనాకు సెలయేరు కలలోన కనిపించె
సెలయేటి కల కలత చెందగా కలకత్త
సరికొత్త స్వప్నమై పురికొల్పినది నిన్ను
కణకణము కనకమై కనిపించినది నీకు
విశ్వమే కావ్యమై వినిపించినది నీకు

కాళికా పట్టణము కాలస్వరూపమై
దేశ కాలాతీత దీధితులతో నీకు
కలకాల మవనిలో నిలువ నెలవిచ్చినది
శబ్దార్థ జగతిలో శాశ్వతంబుగ నిన్ను
నిల బెట్టినది శాంతి నీ నికేతనమనుచు
ఆ శాంతి నిలయమే ఆ శాంత మల్లుకొని
విశ్వ విఖ్యాతమౌ విశ్వభారతి మయ్యె

మన కాళి వినిపించు మాణిక్య వీణలో
మన కాళిదాసు మధు మంజులార్ద్రత గాంచె
వాగర్థముల నిత్య వాగ్విలాసమ్ముతో
అమ్మ చెప్పిన మాటలఖిలాండమున నింపె
ఆ మాతయే నీకు అక్షరాకారమున

సాక్షాత్కరించినది స్వాస్థ్య మందించినది.

కాళికానగరమిది కణకణములో తల్లి
కరుణాతరంగితాంతర తమాలోకనము
జనమానసములోని పెను చీకటులు చీల్చి
వెలయించు విశ్వ సంవీక్షణానందమును
దేశప్రియోద్యాన దివ్య మకరందమును

చలి చీమలకు కూడ శ్వాసమాకని మహా
నగరిలో జనరాశి నడువనేరని చోట
ఏకాంతమున స్వాంతమింపుగా నింపుకొని
విశ్వమును వీక్షించు విప్పారు కనులతో
సర్వమును గ్రసియించు సరస రసనార్చితో
జన మానసార్బటికి సాక్షి కాళీమాత

తల్లి హృదయములోని దహరామే చౌరంగి
స్వచ్ఛ వాయువులతో స్పందించు చతురంగి
అది నీకు అందించె నానంద నిర్ఝరిణి
నీరాజనము పట్టె నీకు రస నిర్భరణి

కాలమును కబళించు కాళినీ గళములో
కాలమును మరిపించు కావ్యరసమును నింపి
జోర సాంకిని రస జ్యోతిస్సరము చేసె
ఏ జోరసాంకి నిన్నీ జగతికందించె
ఆ జోరసాంకి నీకమరత్వమును గూర్చె

ధన్యజీవివి నీవు తల్లి నీ పలుకులకు
ఉప్పొంగి పోయినది ఉల్లసించిన దుర్గ.

★ ★ ★

# మన భారతి - మనుభారతి

మన భారతి మను భారతి
  మలయజ మధుమయ భారతి
సూనృతమును కన్నతల్లి
  సూక్తి కుసుమ కల్పవల్లి

మా నిషాద కరుణ గీతి
  మహిత మహికి వినిపించిన
మధురాక్షరి మన భారతి
  మంత్రాక్షరి మన భారతి

నిత్యశుద్ధ నిత్యబుద్ధ
  నిత్య ముక్త మన భారతి
సత్య ధర్మశాంతి నిరతి
  సాధించిన మన భారతి

శుభ్ర సుధాకర వికిరిత
  శుద్ధ స్వర రస భారతి
సుబ్రహ్మణ్యతను కన్న
  సుప్రసన్న సురభారతి

కాదల్ కాదల్ కాదల్ వరణం
కాదల్ పోయిర్ కాదల్ పోయిర్
సాదల్ సాదల్ సాదల్ మరణం

ఇన్బమ్ ఇన్బమ్ ఇన్బమ్ సంతోషం
ఇన్బమ్ దిర్కోర్ ఎల్లై కాణిల్
తున్బమ్ తున్బమ్ తున్బమ్ సంతాపం
నాదం నాదం నాదం నాదం

నాదత్తేయోర్ నలివుణ్ కాయిన్
సేదం సేదం సేదం కాలం
భారతీయతాత్మ గీతి
భారతికే వినిపించిన
చిరు భారతి తిరు భారతి
శ్రీ భారతి మన భారతి

2

కాదల్ సాదల్ ఇన్బమ్ తున్బమ్
నాదం సేదం పాడిన భారతి
కుయిలీనేట్టై మాడన్ కూడిన
కోయిల పల్కుకులు పలికిన భారతి

భారతీయతాలోకిత భారతి
ప్రభాప్రభాసిత భారతభారతి
కావేరికి గంగను పిలిపించిన
కలి భగీరథుడు కవికుల భారతి

ముప్పదికోటి ప్రజానీకంలో
ముదిత భారతిని చూచిన భారతి
లోకానికి ఆలోకం చూపిన
లోక హృదయ పరినిష్ఠిత భారతి

మహాభారతికి మంగళ గీతిని
మహాసక్తితో మహాశక్తిచే
పాడించిన వినిపించిన భారతి
పాంచాలిని పలికించిన భారతి

కన్నయ్యను కణ్ణమ్మగ కాంచిన
కనక నయన కమలాసన భారతి
సమత, మమత, సమరసయుతి కోసం
సత్సాహితి సేవించిన భారతి

# మా మంచి కల్యాణి

మా మంచి కల్యాణి మంచి పెంచిన తల్లి కణ కణములో గుణము కన్న కాంచన వల్లి
మంచి మాటలలోని మర్మమెరిగిన తల్లి మాటలను పాటలుగ మార్చి పాడిన తల్లి
తనది కాదని తనువు తత్త్వ మెరిగిన తల్లి మనసార ఆత్మలో మనసు వ్రేల్చిన తల్లి
జరరానలములోని జడత తెలిసిన తల్లి యోగానలములోని భోగమెరిగిన తల్లి
మాట మాటకు బుక్కు మారు పలికిన తల్లి పాటలో సామమును పంచిపెట్టిన తల్లి
అంతటను మంచినే అరసి మురిసిన తల్లి అందరికి మంచినే అభిలషించిన తల్లి
తన మేలు కోరువారిని దైవమని మ్రొక్కి తన కీడు తలపెట్టు దస్యులను మన్నించు తల్లి
అందరిని అన్నింట ఆత్మభావముతోడ అమనస్కముగ చూచి ఆరి తేరిన తల్లి
ఆహారమును కూడ ఆత్మకవరోధమని భావించి విషయములు పరిహరించిన తల్లి
తల్లిదండ్రుల మనసు తల్లడిల్లక యుండు మధ్య మార్గమునందు మసలిన మహాతల్లి
కన్నవారికి తనను కాంచు భాగ్యము నొసగి కాంచవలసినదాని కాచియిచ్చిన తల్లి
పరమ సత్యము నోట పలుకనేరక వగచి మంచి లోపల నిజము మాటుపెట్టిన తల్లి
నిష్ఠతో నీవు ధ్యానించు పరమేద్యమును జాడ్యమని రోగమని జాలిపడితిమి తల్లి
అది మహాయోగమని అది మహాదీక్ష యని తెలియవచ్చిన దిపుడు తెలిపితివి మా తల్లి
పుట్టపర్తికి వెళ్ళి పుట్టు పూర్వోత్తరపు గుట్టు కనిపెట్టితివి పట్టు విడవక తల్లి
చిన్న నచికేతువలె తిన్నగా ధర్మువునె చేరి సకలార్థముల సారమరసిన తల్లి
మూడు రాత్రులు గడిపి ముద్దుగా మరుప్రొద్దు సత్యసందర్శనము సాధించితివి తల్లి
ఆయురారోగ్యములు హారములు భోగములు కురిపించి దైవమే వరములిచ్చెను నీకు
కాని నీ కవి యన్ని కంటి కానగలేదు అన్నింటికిని మిన్న ఆత్మ సాయుజ్యమని
ప్రణవ నారాయణాస్పదమైన హారతిని కని కప్పురము పగి కరగిపోతివి తల్లి
అదియె శశ్వచ్ఛాంతి అదియె శాశ్వత సుఖము అదె ప్రశాంతికి నిలయమయ్యె నీ కా నాడు
అది మహాషాఢ కృష్ణైకాదశీ వేళ మధ్యందినాదిత్య మహిత సుముహూర్త మది
చంద్రకళ గురు శుక్ర సాహ్యమరసిన వేళ సాయి నీ స్వాంతమున హాయి గూర్చిన వేళ
నీ మహా సంకల్ప నీరాజనమ. పీకు నిశ్శ్రేయసము నిచ్చె నీ తనువు ధనువయ్యె

కుమిలిపోయెను మేను కుందిపోయిన దెడద మాయదీ గాయమిక మాకుపాయము లేదు
మా వేదనకు మందు మాకు నీతో విందు నీవు చేరిన పదము నిఃశ్రేయసఃపథము
వెయ్యేళ్ళు జీవించి వెయ్యనుభవించినను నీ పథము, నీ పదము, నీ పదవి సాధ్యమా?
ధన్యజీవివి నీవు తలచితిమి బిడ్డవని తెలిసికొంటిమి యిపుడు వెలుగులకు వెలుగువని
మా తల్లి కల్యాణి మా బిడ్డ యమకాన్న భాగ్యమే భాగ్యమని భావించుచున్నాము
పదునెన్మిదేండ్లు నిను పాలించి లాలించి పాలించితిమి అదే పుణ్యమంతే చాలు
శ్రీమాత లలిత మా చిట్టి కల్యాణియై మా కడుపు పంటగా మా కంటి వెలుగుగా
మా యింట పుట్టినది మా పంచ పెరిగినది మా నడుమ మెలగినది మా మంచి కల్యాణి

॥ ఇతి శమ్ ॥

# సంక్రాంతి

అఖిల జగతినాత్మయందు, ఆత్మను బ్రహ్మాండమందు
సమరసముగ గాంచి జీవితమును శివతమం బొనర్చి
క్రాంతి నుండి శాంతి పొంది శాంతిని సంక్రాంతి చేయు
భరత భాగ్యలక్ష్మి పెంచి పండించిన హృదయముతో
కృష్ణవేణి సంబరమున వచ్చెను సంక్రాంతి యనుచు
పొంగి పొరలి గంగమ్మకు పొంగలి కానుకగ పంపు
ప్రత్తి విత్తనముల నయిన భక్తి నరసి యారగించు
గంగిరెద్దు గంగమ్మకు పొంగలినందించు నేడు

పొంగలి గని గంగ పొంగి నింగి నుండి తొంగి చూచి
బంగరు కలశములతో పాలవెల్లి పంచిపెట్టు-
ఈ మురిపెము గమనించుచు ఎత్తుగ ఉత్తర హిమాద్రి-
నెక్కికూరుచున్న పార్వతీశుని ముఖ కాంతి చూచి
చిన్మయ విధురేఖ లేత చిరునవ్వులు చిలకరించు
పులకరించు సుర నర పశు భూయిష్ఠంబగు విశ్వము
కృష్ణవేణి వినిపించును క్రొన్నవ సంక్రాంతి గీతి

ఆ గీతియె పురుషాకృతి నవతరించెనన్నట్టులు
సుప్రసన్న ముఖదీప్తిని శోభిల్లుచు సంక్రమయ్య
ఎనిమిది కర్ణముల తోడ ఎనిమిది బాహువుల తోడ
ఇంపగు వక్ష స్థలంబు సొంపును పెంపొంద జేయ
విప్పారిన కనుబొమలకు విందు కూర్చునాసికతో
శత యోజన గగనమునకు శత సహస్ర గుణము లొసగె
వెడలు చుండ వాడ వాడ వెల్లి విరియ గొబ్బియవలె.

దశ దిశలను హృదయ నిరతి దశ దశముగ విస్తరించు
దశమినాడు కృష్ణ పక్ష దాక్షిణ్యము తోడ వచ్చె

చండ కిరణు తాపంబును చల్లని వెన్నెలగ మార్చు
చిన్ని చందమామ గారి మన్ననతో నడిరేయిని
ఇందు వాసరాంచలమున అందరి కానందముగా
అశ్వగతిని నశ్వ రేచ్చులడు గడుగున అణగ ద్రొక్కి
తక్కెడ చేబట్టిన తన టక్కరి మామయ్య కెపుడు
చిక్క ననుచు తాను కూడ తక్కెడనే చేబట్టిన
భాస్కరయ్య దీవనలను భక్తిని శిరసావహించి
ఉచ్చైశ్శ్రవ మెక్కి వచ్చు చున్నాడిటు సంక్రమయ్య.

రాజ ఠీవి వాజి నెక్కి రావయ్యా సంక్రమయ్య
చిన్న చిన్న పిల్ల లెల్ల జేజేలను చెప్పుచుండ
చెంతనున్న పెద్దవారు వంతు పాడి పిలువవలెను
సంక్రమయ్య సంబరమున "శాబస"ని పలుకవలెను.
కృష్ణవేణి వినిపించగ కిల కిల సంక్రాంతి గీతి
పులకరించ వలె వసుమతి పుణ్యము పెంపొంద వలెను
కలసి మెలసి చెలగ వలెను తెలుగుల నగు మోము వెలుగు
"సత్యమేవ జయతే" యని శంకరుడే పలుకవలెను.

# మంచి మనసు - మంచి మనిషి

## గురుదేవులు శ్రీ దోనెపూడి రాఘవరావు గారికి
## స్మృత్యర్థ శబ్దాంజలి

మా మాస్టరు హెడ్ మాస్టరు
మహనీయులు మననీయులు
గుణగణముల గణనీయులు
దోనెపూడి వంశీయులు
రాఘవనామాఖ్యేయులు

దోనెపూడి శ్రీకారం
రాఘవరావోంకారం
శ్రీకారం మంచిమనసు
ఓంకారం ఒక తపస్సు
మనిషికి వర్చస్సు మనసు
మనసుకు ఓజస్సు తపసు

దోనెపూడి అనగానే
ద్రోణాకృతి కనిపించును
ఏకలవ్య లెందరున్న
గురుదక్షిణ కోరని ఋషి
రాఘవ రావనగానే
లాఘవానికధిపతియగు
రఘుపతి ఇతడనిపించును.

శిష్యుల సశ్రీకాంజలి
స్వీకరించి దీవించే
సీతాపతి మా రఘుపతి

మా మాస్టర్ హెడ్మాస్టర్
దోనెపూడి రాఘవరావ్

శిష్య వర్గమును చెంతకు
చేరదీసి చదువు చెప్పి
మంచి మనసుగల మనిషిని
మలచి మహికి అందించిన
మహనీయుడు మననీయుడు
స్మరణీయుడు స్పృహణీయుడు
మా మాస్టరు రాఘవరావ్
అనుకుని ఆనందించే
సౌభాగ్యం మా భోగ్యం
అది ఒక ఆత్మానుభూతి

ప్రతి పాఠం గుణపాఠం
ప్రతినిత్యం ఒక సత్యం
ప్రతి వచనం ఒక ప్రణవం
ప్రతి శబ్దం ఒక శాస్త్రం

ఆ చూపులు ఆ రూపులు
ఆ శిష్యులు ఆ గురువులు
రాఘవ మార్కండేయులు
మమతకు మహతికి మూర్తులు
అమర జీవులారాధ్యులు
ఋషితుల్యులు గురూత్తములు
గురుతు తెచ్చుకున్న కొలది
గురుభావం పెంపొందును.

గురువులలో గురుతముడని
ఘనత కెక్కె మా రాఘవ
రావుగారు మరల మహికి
రానక్కర లేని జీవి

ఆ జీవికి శిష్యాంజలి
అందించుటకీ సదస్సు

అంకితమొనరించుచున్న
దీవిద్యా నికేతనము
శ్రీ విద్యా నిలయంగా
శ్రీ రాఘవ సదనంగా
నెలకొనవలె ఈ భవనం
ఇదే మరో భువనంగా
వరవరులకు లొంగని యీ
వంగవోలు నగరంలో
పురపాలక సంఘం ఈ
పుణ్యకార్యమొనరించెను

ఈ పురమున పురపాలక
గోపురమిది కలకాలం
అవనికి సుఖశాంతినిచ్చి
ఆ శశాంక తారకముగ
ఆదిత్య ద్యుతియుతముగ
నెలకొని వెలుగొంద వలయు

గురుభక్తికి తార్కాణం
ఋషి తర్పణ సత్కార్యం
పరమ ఋషులు పరవశించి
స్వస్త్యయనం పలుకుతారు
మన భారతి మన మదిలో
మాధుర్యము నింపుతుంది
వాక్సంస్మృతి ప్రసాదించి
వాత్సల్యం పంచుతుంది

ఇతి శమ్

# అభీప్స

ఎచటనో యున్న రసభాండమెందు కొఱకొ
చిందగా క్రింద పడినట్టి బిందువులను
చప్పరింతుమదే సుధాసారమనుచు-
అమృత భాండంబు కన్పింపదాయె మనకు 1

తొలుత సెలయేటి మించు ఆతురతతోడ
పరుగులిడితిని నీదు మందిరము చేర
వాకిటనె పిల్ల మేఘముల్ పరిహసింప
సిగ్గుపడి వెంటనే యిల్లు చేరుకుంటి 2

గున గున సంచరించు గ్రహకోటికి
సంయమ బోధ చేయుదో!
వనజములందు చేరి మధుపంబులతో
మధువారగింతువో!!
మినుసిగపై ప్రభాత సతి మేలి -
ముసుంగును తీసివైచెదో!!!
కనుగొనఁజాలకుంటి జనకా!
ఇక కావలె దివ్య చక్షువుల్!! 3

ఎదల నెదతోడ పిల్చుచున్నది మనమ్ము
నవ్యగీతిక పాడుచున్నది దినమ్ము
ఇంపుగ ముందు మురళి వాయింపవోయి
వంతు పాడెద నేను గేయాంతమందు 4

కనులు చెవులేక మొనరించు కొనుచు వెదకి
జాడయైనను కనిపెట్టజాలకుంటి-
ఏ తరుచ్ఛాయ మురళి వాయించు చుంటి?
స్థాయినించుక హెచ్చింపవోయి కృష్ణ!!! 5

1947

# ఎందుకు?

1969

ఇంత చిన్నపనికి నన్ను ఎందుకు పిలిచితివి ప్రభూ!
ఎందెందో తిరుగు చుంటి ఏమేమో చేయుచుంటి
వేయి కనుల గాంచి నన్ను వెనుక నుండి పిలువగానె
వెంటనె పరుగెత్తుచు నీ వెంట వచ్చితిని జంటగ
వచ్చితినని మెచ్చలేదు వచ్చిన పని చెప్పలేదు
చిచ్చు మ్రింగు మచ్చు చల్లి చీకటి గది చేర్చినావు
వెలుగనగనె వెలిగినదిల వెలుగును గని విలపించితి
ఇంత చిన్న పనికి నన్ను ఎందుకు పిలిచితివి ప్రభూ!

మరచితి నీ పిలుపు మాట మాయ వెలుగు మరపించెను
మరపించెను మాయదారి మనసు భువిని కన్నతావు
మరలి వెళ్ళ వలయునన్న మాసిపోయినవి గురుతులు
ఎవరినేమి అనుకొన్నను ఏమిలాభమనుకొంటిని
గుంఫించిన చూపులతో గూఢమనో వాంఛలతో
చూచిరిచటి వారు నన్ను వాచవి నగు మోములతో
ఇంత చిన్నపనికి నన్ను ఎందుకు పిలిచితివి ప్రభూ!

ఎంతగ నే విలపించిన సంతసించి రంతగ మది
పేలవమీ పుడమియనుచు నే బేలగ విలపించగ
పరిదేవన మాలకించి పరి పరి నా తలమూర్కొని
పాలకడలి నొడిని కూర్చి లాలించుచు జోలపాడి
కొంగున క్షీరాబ్ధి పొంగ చెంగట నను చేర్చుకొనుచు
మురిపించుచు మరిపించెను మరపురాని మధురగతము
నా వేదన నగు మోమున నవ్వులలో లీనమయ్యె
ఇంత చిన్న పనికి నన్ను ఎందుకు పిలిచితివి ప్రభూ!

ముందు వెనుకలను మరచిన ముద్దులొలుకు చిన్నతనము
చెన్నకేశవాలయమును చేరిన పావురము వోలె

మన్ననతో మక్కువతో మరియాదలు తెలియకయే
పన్నగేంద్రు వాగ్విలాస భాగ్యము నలవరచుకొంటి
సకల చరాచరలోకము శబ్ద పరాధీనమనుచు
తెలిసికొంటి భావములను వెలయించును శబ్దమనుచు
ఇంత చిన్నపనికి నన్ను ఎందుకు పిలిచితివి ప్రభూ!

పశ్చిమాద్రినధిగమించి భానుదస్తమించగనే
ఆ వెలుగునె వెలయించుచు అందములను చిందుచున్న
చేందమామ జగతినెల్ల చేప్పరించి నవ్వసాగె
లెక్కలేని చేక్కలలో ఒక్కటియు 'అదేమి?' అనక
జాబిల్లియె మా-ధవుడని సంబరముగ కులుక సాగె
అందని ఆకసము మహా నంద జలధినోలలాడ
క్రిందనున్న జగమంతయు క్రీడాంగణమనిపించెను.
నవ్వుకొంటి మందరమును దవ్వుననవ్వినవివిరులు
ఇంత చిన్న పనికి నన్ను ఎందుకు పిలిచితివి ప్రభూ!

## ఇలపావులూరి వారి ఆరాధ్య దేవత

# ఆదిలక్ష్మి కామేశ్వరి

జననీ! నీ పద పంకజద్వయము నా స్వాంతారవిందాంతరా-
వని నాప్యాయముగా సృజించిన కదా! భవ్య ప్రభావీచికల్
కని స్వాత్మ ప్రతిరూపకల్పనలు గాద్గద్యంబు సాక్ష్యంబుగా
వినిపించన్ భవదీయ భావన మదిన్ వీక్షింతు కామేశ్వరీ! 1

**తల్లీ!** నీ చరణారుణారుణిమ దుర్దర్శంబుగా కుండ నా-
కుల్లాసంబు నొసంగి అంకమున నన్ కూర్చుండంగా నిమ్ము నీ
ఫుల్లాబ్జానన పావనేక్షణము నన్ పూతస్వాంతుగాఁజేయనీ
సల్లాపంబులకుల్ల ముల్లసిలు సాక్షాల్లక్ష్మి కామేశ్వరీ! 2

**దేవీ!** నీ వదనారవింద వికచాధీనుండ, దీనుండ, నీ
సేవా కార్య పరాయణత్వమున నిన్ చింతింతు నిత్యంబు, నీ
తావే తావునఁగాన లేక త్రిజగద్ వ్యాప్తంబుగా నెంచి నీ
భావాభావ విభావ భావనలనే భావింతు కామేశ్వరీ!! 3

**అమ్మా!** నీ నయనమ్ములాన మదినా కన్య స్పృహాపేక్ష లే-
దమ్మా! నమ్మితి నెమ్మనమ్మున త్వదీ యా కర్ణికాంతాక్షి యు-
గ్మమ్మున్ తావక భావనా కలిత వీక్షాపేక్ష జీవింతు నీ -
నెమ్మోముంగను భాగ్యమొక్కటియె నా నేమంబు కామేశ్వరీ! 4

**మాతా!** నీ మృదు పాణి పల్లవము నా మాంద్యంబు పోఁగొట్టియీ
చేతోన్మాద ఘనాంధకారమున నా చేదివ్వెగా వెల్గ ని -
ర్వాత ప్రాంత నిశాంత నిశ్శిథిల నిర్వ్యాపార నిర్వేద సం
గీతానంద సుధా స్రవంతివని నిన్ కీర్తింతు కామేశ్వరీ! 5

నీ వాత్సల్యము చాలు నాకు జననీ! నీ రమ్య హర్మ్యంబులున్
లావణ్యంబు ధనంబు వాహనములున్ లాలిత్య మాధుర్యముల్
దేవీ! నీ కరుణా కటాక్షమును సాధించి ప్రసాదించునే!
కావమ్మా అవి కావు నావి, వలదీ **కామార్తి కామేశ్వరీ!!!** **6**

రమణీయంబు జగంబు కాదనుచు సర్వస్వంబు నీవంచు నా
కమరుండెవ్వడొ తెల్పినాడు మరి నా కాత్మీయులే లేరిలన్
తిమిరాంధుండను దారి చూపి నను నిర్దేశించి శాసించి నా-
కమరత్వంబు నొసంగు **తల్లి! పరమాహ్లాదంబు కామేశ్వరీ!!!** **7**

మహదానంద రసానుభూతి నొసంగున్ మాండూక్య సంభావనల్
సహగానంబులు పాడు తైత్తిరము – లాశాంతంబు లాలింపంగా!
ఇహ సంకీర్తన మైతరేయమగు బ్రాహ్మీ! త్వత్ ప్రసాదంబునన్!
బృహదారణ్యక పుణ్యధామశుచిషద్ – **విఖ్యాత కామేశ్వరీ!** **8**

"తవదాసోఽహ" మటన్న మాట విని వాత్సల్యాతిరేకంబుతో
దివినున్నన్ భువినున్న అంబరమునం దెచ్చోటనెట్లున్న క్రొ–
న్నవలావణ్యము తెచ్చి యిచ్చెదవు పుణ్యశ్లోక కాదంబినీ!
భవదీయాగమనాభి కాంక్షయె మహాభాగ్యంబు **కామేశ్వరీ!** **9**

తల్లీ! నీ మృదు మందహాస రుచి సద్ధర్మానురాగంబు, నీ
సల్లాపంబులె భవ్య భావరసవత్ సంగీత సాహిత్యముల్
ముల్లోకంబులు నీ విశాల నయనాంభోజ ప్రకాశంబు, నీ
ఉల్లాసంబె జగద్విభావరికి ప్రత్యూషంబు **కామేశ్వరీ!** **10**

ఈ సంసార ఘోర సాగరము దాటింపగలే రెవ్వరున్
నీ సాయంబుననే తరించవలె నన్నేకాంత కాంతారమం
దేసాయంతనమో త్యజించినది సందిగ్ధానురాగంబునన్
దాసోఽహంబనువాని బ్రోచుటయె నీ ధర్మంబు **కామేశ్వరీ!** **11**

బృహదారణ్యక పుణ్యతీర్థములు సేవింపంగ రమ్మంచు నన్
అహముల్ రాత్రులు పిల్చుచుండ జగమీశావాస్యమిత్యాజ్యమిం
దిహమా ముష్మికమంటి యున్నవని ప్రేరేపించు ఛందంబు నీ
మహనీయ స్థితి మూలమెట్లు కను నీ మందుండు **కామేశ్వరీ!!** **12**

నయనంబుల్ తిలకించు నీ కరుణ నన్నాలోకితుం జేయు – నీ
నయనాబ్జంబుల మాత్రమారయమి అన్యాయంబుగాఁదోచు – నీ
దయకున్ సాధ్యము కాని దేది జగతిన్ ధర్మార్థ కామాయనీ!
నయనానందకరంబు నీ నయన సందర్శంబు **కామేశ్వరీ!!** **13**

వరలక్ష్మీ కరుణా కటాక్షము సరస్వత్యాతతాత్మీయతన్
కరుణింపంగల తల్లి వీశ్వరివి నీ కారుణ్యమే భూర్భువ
స్వర సంపద్విభవ ప్రదాయకము శశ్వచ్ఛాంతి సంధాయకంబు
ఎఱుగన్నేరని నన్నెరుంగుదువు నీవే కాదె **కామేశ్వరీ** **14**

1969

# జ్యోతిర్మయి

ఆరంభమున మృణ్మయాకారమును దాల్చి
  నటియింతువొక నంగనాచి వోలె
సారభూత ద్రవ్య సంగ్రహం బొనరింతు
  ప్రఖర కరోద్దీప్త భానువోలె
శుచి సముజ్జ్వలితాత్మ శోభావికాసంబు
  పొందెదవొక తపః పూర్ణువోలె
వైరాగ్య గీతికల్ బైరాగి రాగాల
  పాడి భస్మంబుగా పరిణమింతు
రంగు రంగుల మాయా తరంగ గంగ
పొంగి పొరలంగ ఛంగున నింగికెగసి
మట్టిలో పుట్టి మట్టియై మాయమౌదు
అచ్చెరువు గొల్పునీగాథ చిచ్చుబుడ్డి

1949

# కాల మహిమ - కామదహనం

నాకు తెలుసు నీ ముసి ముసి నవ్వులు
  నమ్మరాని కమ్మని తెమ్మెరలని-
వలపు లొలుకు నీ చిలుకల పలుకులు
  వలపల గిలకల వలె వెలుపలివని...
నాకు తెలుసు నీ కనుగవ సొగసులు
  నరుల ఎడదలను వ్రేల్చెడి పొగలని-
పాలుగారు నీ పసిడి చెక్కిలికి
  పరవశించు సచరాచర జగమని...

నాకు తెలుసు నీ కిసలయ మధువులు
  నలినీ దళగత తరళ కణములని
సఘన పయోధర జలజ హారములు
  సాధించును ముని మానసములనని...
కాని నీకు తెలియదు కాబోలును
  కాలగతిని హరియించితి నేనని-
కాలము నాతో కదలును - నిన్నది
  కాంచగనే కప్పురమయి పోవును...

కాలమన్నిటిని కబళించును - నే
  కబళించితినా కాలజాలమును
కామ కామినీ కామేశ్వరులకు
  కాలమహిమ వివరించితి నేనని
తెలియదేమో! తెలిసియునటియింతువో??
  తొలుత నేను తెలిపితిని మరిచితివి

జన మానసమున సహజ వాసనలు
  చేల్లి నవ్వుచున్నది కామేశ్వరి
కామ దహనమున కాలానలమును
  కక్కి సొక్కి యున్నాడు మహేశుడు

రతి విలపింపగ బ్రతికెనామె పతి
  రాజశేఖరుని రాజాశ్రయమున
కాలదహనమది కాదు - పరాజితు
  కామ శరీరుని కాయ దహనమది
భస్మమయ్యె పార్థివమగు దేహము
  భవ్యానిలమమరము శాశ్వతమిది
ఆ పవనము కలకాలము నిలచును
  అదియె మర్త్యునమరునిగా తీర్చును
కానగునది కాలమునకు కాలము
  కాలతత్త్వ మెరిగించు సత్యమది
కాలకూటమును మ్రింగిన మృడునకు
  కామదహనమవలీలయె కానగు

నాకు తెలుసు - నీ మాయాజాలము
  నను వంచింపగ తూగదులే యని

ఇతి

శమ్-శంకరమ్-శివమ్

# దేశ భాషా సరస్వతి

జయదేవ కాకలీ స్వర సుధామలధార
క్షేత్ర విద్యాపతుల్ చింది చేర
దాస సూరుని నంద తనయుని పోతన్న
మందార మకరంద మందు ముంచ
సుకవి మౌని కబీరు నకథగాధనుచూచి
వేమనార్యుని ఆటవెలదియాడ
రాగసుధా రసోల్లాసంబుతో త్యాగ-
రాజు గోస్వామికి భ్రాతయయ్యె
కనుఁడు గీర్వాణ దివిజ గంగాభవాని
రాష్ట్రభాషా ర్కజనుకూడి రమ్యహర్మ్య
దేశ భాషా సరస్వతీ తీర్థకామి
యగుచు ప్రవహించుచున్నదల్లదిగొ!!!
నేడు

1951
గుంటూరు.

# నుడుల పోగు

అంబరమున సంచరించు చంద్రునకొక నూలు పోగు
మానవ రసజీవి పూర్ణ చంద్రునకొక నుడుల పోగు

★ ★ ★

నలువైపుల పెనుచీకటి క్రమ్మునమావాస్య రాత్రి
నెల బాలునకా చీకటి కళలు వెలుగు చెలువ మొసగు
జగతి చిమ్మ చీకటులను సైపలేక నిదురించగ
ప్రభాకరుడు దివాకరుని ప్రవేశించి పరవశించు
ఒకటి వీడకయె అందదు వేరొక ఆలోకరాశి
లోకులిదే లోకమ్మున ఆలోకము వాంఛింతురు
అచ్చపు శశికాంతిలోనె అమావాస్య నిదురించును
అమావాస్య సుధాకరుని కానందము లందించును

★ ★ ★

అంబరమున సంచరించు చంద్రునకొక నూలుపోగు
మానస రసజీవి పూర్ణ చంద్రునకొక నుడుల పోగు

★ ★ ★

అందములకు నందనమని ఆనందము చిందు నుడుల
చందమామ రావెయనుచు జాబిల్లిని పిలుచు శిశువు
ఎంతమంచిదీ జాబిలి నేనెచ్చట కెంతవడిగ
పరుగిడ నా వెంట వచ్చు ననుచు నవ్వుకొను కుమారి
చంద్రునిలో నలుపుచూచి ప్రశ్నించును పితను సుతుడు
నెలవంకను చూచి వధువు తలవంచుట నేర్చుకొనును
శశిరేఖల కభిమన్యులు సర్వస్వము నర్పింతురు
సంగ్రహించు సార్థవహుడు శశితల పాషాణరజము

★ ★ ★

అంబరమున సంచరించు చంద్రునకొక నూలుపోగు
మానస రసజీవి పూర్ణచంద్రునకొక నుడులపోగు

★ ★ ★

ఎంతహాయి నొసగు చున్నదీ జాబిలి యనుచుపుడమి
పులకరించి సుధాకరుని వలపు తలచి శయనించును
పుడమి పూర్ణబింబముగని ముహుర్ముహుర్లుఠదభంగ
మానస వీచికలు పొంగ తలత్రిప్పక చూచును శశి
ఒకరిని గని ఒకరు మురిసి కొనుటకు మూలాధారము
భాస్కరుడని తెలియలేక భ్రాంతినొందు కాంతియుగము
ఏకాంతయొ ఈ కాంతిని లోకాంతమునందుగాంచి
ఏకాంతస్థలి నెలకొను నదియె శాంతినికేతనము

★ ★ ★

అంబరమున సంచరించు చంద్రునకొక నూలుపోగు
మానసరసజీవి పూర్ణ చంద్రునకొక నుడులపోగు

# ఈ లోకంలో పుట్టకు

ధర్మం క్షీణించినపుడు ధరణి నుద్ధరించేందుకు
అప్పుడిప్పుడీ యిలలో తప్పక జన్మిస్తానని
మక్కువతో నొక్కి నొక్కి మా బావకు చెప్పావట!
అన్నా! నీ యెద మెత్తని వెన్నలాంటిదని వింటిమి
అడుగడుగున అడగకనే పుడమిపయిని పుడుతావని
అనురాగంతో పలికిన ఆ పలుకులు మాకు తెలుసు.
కాని యిచట స్థితిగతులే కాస్త తారుమారయ్యాయ్
ఇప్పట్లో మళ్ళీ నీ వీ లోకంలో పుట్టకు!
మా ధర్మం మా కర్మం మాకే వదిలేసి నీవు
హాయిగా నీ పాలకడలి సోయగముల తులదూగుము
లేదా విధు మండలమో లేక మరో మండలమో
చూచుకొనుము నీ మురిపెము దాచుకు తలదాచుకొనుము.
మా పిల్లలతో మేమే మహాబాధ పడుతున్నాం
రెండు మూడు మార్ల కన్న పండదిపుడు పుడమి కడుపు
అన్నపూర్ణ వారసులం ఆహారం కావాలని
అహర్నిశలు మహామహికి ఆర్తిని వినిపిస్తున్నాం.
విరబూసిన పూలల్లో దొరికిన మకరంద రసం
దొరల్లాగ దోచుకొనే దుందుడుకుల తుమ్మెదలం
మాకు ఫలాపేక్ష లేదు మా కామం నిష్కామం
వీలుంటే ద్వైతమతం లేదంటే అద్వైతం
వీటి కతీతంగా ఒకటుంది విశిష్టాద్వైతం
పిల్లలెంతమంది అనే చిల్లర ప్రశ్నలు వేయం
చల్ల కదలకుండ జరుపు సల్లాపం మా ధ్యేయం
సత్వ రజస్తమస్త్రితయ సారముత్తమోత్తమం
అదే మాకు ఆరాధ్యం అందరికీ అది సాధ్యం

త్రిగుణాతీతులకు ఇచట తిండిగింజలును గిట్టవు
ద్వైతం మా పరదైవం అది లక్ష్మణరేఖ మాకు
పొరబాటున దాటినచో చెరతప్పదు లంకలోన
నిలువనీడ దొరకదిచట పిలిచినచో పలుకరెవరు
అప్పిచ్చే దిక్కుండదు ముప్పుకు వైద్యుడును రాడు
తేరిపార చూచుట కొక ఏరు కూడ చేరనీదు
కనక చిట్టి కన్నయ్యా! కంసునిపై కినుక మాని
అష్టమ గర్భమున పుట్టి కష్టపెట్ట కీ జగతిని
ఏదో ఒక మూల మూగ వేదనలకు నలిగి ఒదిగి
కాలక్షేపం చేస్తూ కాలాన్నే చూస్తుంటాం
ఏది ఎలా కనిపిస్తే ఇదమిత్థం అనుకుంటాం
కాని నీవు కొంపదీసి కంసునిపై పగబట్టకు
కొన్నాళ్ళీ మహామహిని కన్నీళ్ళకు అప్పగించు
మబ్బుచాటు నుండి మరల మార్తాండుడు రాగానే
నిన్ను నేను పిలుస్తాను తిన్నగ రా మా యింటికి
అందాక స్టే ఆర్డర్ దాటకూడ దీ బార్డర్
ఇప్పట్లో రాకిచటకు ఈ లోకంలో పుట్టకు.

# క్రోధన సంవత్సరాది

చైత్ర శుక్ల పాద్యమి నవచైతన్యము కోరువేళ
శుక్రవారమున వేకువ సుప్రభాతమును పాడుచు
శుభ్రలక్ష్మి వలె వచ్చిన సుదతికి సుస్వాగతమని
ఆకాశము పులకరించ అనిల వాయువులు చలించ
పావక రుచి పరవశించ జీవనదులు పొంగి పొరల
ఉల్లాసముతో పలికిన దుర్వీశ్వరి సర్వేశ్వరి.
"క్రోధన సంవత్సరాది కువలయమునకిది యుగాది"–
అని పంచమమున పాడిన దమరగాన కోకిలయిల.
రాగ రంజితముగ వచ్చి రక్త సిక్తముగ వెడలిన
రక్తాక్షిని వీక్షించుచు రాగమునే ద్వేషముగా
శంకించుచు క్రోధములో శాంతిని దర్శించలేవని
అవనికి వివరించుచున్న దామని అనురాగసయని.
"అనగనగా కనివినగా అనుబంధములల్లుకొనును
అల్లుకొన్న అనుబంధములనురాగముగా మారును.
అనురాగము తెగిపోయిన ఆక్రోశము కొనసాగును.
ఆక్రోశము ఆవేశము ఆవేదనలకు మూలము"–
అని వ్యాఖ్యానించుచుండ విని అన్నది యుగభూమిని
"శాంతమూర్తి క్రోధనాంగి సాత్విక సౌజన్యమూర్తి
కోపతాపములు సహజము, తాపన వరులకు సయితము.
చూపులలో అనురక్తిని చూపిన రక్తాక్షి పగిది
ముక్కుమీది కోపము మా ముదితలకారోగ్యకరము"–
అని అనపాయముగ క్రోధమభినయించు మా క్రోధన
మగువల కోపము జగతికి మంగళకరమని చాటెను.
సత్యధర్మసాధకమగు సాత్త్వికమగు క్రోధాకృతి
అవినీతిని అపనయించి ఆనందము చేకూర్చును.
క్రోధన సంవత్సరాది సాధించును క్రోధమహిమ.
కనుక క్రోధనాంగికి మహి ఘనముగ స్వాగతము పలికె.

# శ్రీ హనుమతే నమః

# సుందర చాలీసా

దాశరథీ! నీ సుందర దర హాసము సోకినంత
బలవంతుడు గుణవంతుడు పరమ యశో ధీమంతుడు
హనుమంతుడు పులకితుడై అంతరాంతరముల లోన
సీతారామాంజనేయ సిద్ధాసనమును కూర్చును

ఆ సుందర దర హాసము ఆ సిద్ధాసన వాసము
నాటి నుండి నేటి వరకు నానా పరిధులను దాటి
ఎంత మంది కవి వరులూ ఎంతమంది మునివరులూ
ఎంత మంది తాపసులూ ఎంతమంది దాసులనో
ఎంత మంది గాయకులూ ఎంతమంది భావుకలూ
ఎంత మంది ధార్మికులూ ఎంతమంది కార్మికులూ
ప్రోత్సహించి పరమేష్టిని పొందు మార్గమును చూపెనొ

రామ కథా మధువునందు రాగసుధా రసము జేర్చి
శ్రీరాముని జయరాముని సేవించెను త్యాగరాజు
ఏ తీరుగ దయ జూచెద వేమో రఘురామ యనుచు
పలుకరించుకొనె రాముని భద్రాచల రామదాసు
ఆ భద్రుడు పలికినదే నా భాగవతము మనదని
అందరికిని గుణకరముగ అందించెను పోతరాజు
అబల ఆతుకూరి వారి ఆడ పడుచు మృదు భాషిణి
మల్లెలాంటి మాటలతో అల్లినదొక మాల మొల్ల
కవి బ్రహ్మ భాస్కరాది కవి శేఖరు లల్లినారు
నిండుతనము పండిన పలుదండల నా రాము పయిని
రంగనాథ విశ్వనాథ రామాయణ ధారలలో
పావన సలిలమును నింపె పాపరాజు – మరి యెందరా

ఈ విధముగ యుగ యుగముల భావ తరంగములు దాటి
ఈ నాటికి ఏ నాటికి ఏ మ(త్రము కొదువ లేక
(ప్రేమ మీర పారిన దిల రామ భ(ద్ర రసవాహిని
ఈ (స్రవంతి సంతతముగ ఇల వసంత శాంతి కాంతి
వెలయించెను. వెలయించును నెల వెన్నెల లున్నవరకు
రవి కిరణములున్నవరకు దివి చుక్కలు వెలుగు వరకు

అసలు రామకథ యంతయు అక్షర రమణీయ రాశి
అందులోను ఆది కవికి అందమయిన దనిపించిన
రస ఖండము రామాయణ రమ్య హర్మ్య మణి కూటము
సుందర కథ సర్వస్వము సుందర తర రస కలశము
ఆ సుందర తర గాథను ఈ సీతారామ దాసు
సుందర తమ మధురముగా సుజను లెల్ల మెచ్చు కొనగ
భరత రాజధాని యైన పావన ఢిల్లీ పురమున
బాపూ నిలయమున పాడి పద సంపద విప్పి చెప్పి
అందరి కానంద సుధను అందించిన ధన్యజీవి
పద రాగములకు భక్తిని పదిలముగా పొందు పరచి
పదిమందికి వినిపించిన భక్త కవికి జోహారులు

మంగళం మహత్

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

# ఓ ప్రభూ!

జీవితమున నన్నేలు వేలుపని నిలతు నెపుడు నీ యెదుట నో ప్రభూ
సకల లోక నాయకుడవు నీవని
నిలతు నెదుట కైమోడ్చి నా ప్రభూ
అంతు లేని నీ అంతరిక్షమున
మారుమూల నిర్జన వనసీమల
మెత్తని యెద చెమరించిన కనుగవ
నిలబడుదును నీ యెదుట నో ప్రభూ

నీ విచిత్ర సంస్కృతి భవ జలనిధి
నధిగమించి ఆచరణ తటమ్మున
అఖిల జగతి జన సంకుల తలమున
నిలతు నెపుడు నీ యెదుట నో ప్రభూ

నిదగు భువి నా చేయ దగిన పని
ముగియగనే రాజాధిరాజు నే
నొంటరిగా సన్నని నిస్వనమున
నిలబడుదును నీ యెదుట నో ప్రభూ!!
జీవితమున నన్నేలు వేలుపని నిలతునెపుడు నీ యెదుట నో ప్రభూ

# తెలియనిది

నాకు తెలియని దొకటి
  నన్ను విడనాడినది
నాకు తెలిసిన దొకటి
  నన్ను విడినాడదది
తొలి సంజ గగమున
  పలు వన్నెలను గాంచి
తెలిసి తెలియని దిశల
  తెలివి తేటల కోడి
పక్కుమని నవ్వుకొని
  దిక్కునే మరచినది
ఈ సంజ కెంజాయ
  ఏ దారి నరిగెనో?
చెప్పుకో చిన్నమ్మ
  చెప్పరానిది కాదు.
నడిరేయి తొలినాటి
  పడుచు ముచ్చట దీర
రంగు రంగుల పసిడి
  కొంగు సవరించుకొని
జాబిల్లి కంబరము
  చాపి రాకకు వలచి
కాయ గాచిన కండ్లు
  కమనీయమై వెలుగ
చిన్నపోయిన చెలియ
  చెంత కెందుకు రాదొ?
తెలిసికో చెల్లమ్మ
  తెలియరానిది కాదు.
జగతి కందని గతిని

  గగనమును లంఘించి
పట్టు చిక్కని మేలి
  పట్టు కిరణములతో
మన్ను మిన్నుల గలుపు
  మార్తాండ విభు డిలను
పట్టపగలని యనక
  బట్ట బయలుగ జేసె
ఇంత నిర్దాక్షిణ్య
  మే పుడమి సైరించు?
పలుకవే చిలుకమ్మ
  పలుకరానిది కాదు.

# తొలికోడి

ఉదయ శిఖరాను రాగంబు మదిగలంచ
అంబరము వీడు చుక్కల నరసి యరసి
కొక్కోరో యని తొలికోడి కూయగానె
అరుణ కన్యక జగమునందవతరించె 1

అరుణ సంధ్యాను రాగ రహస్యమిలకు
విప్పి చెప్పగ దీని పంపించి రెవరొ
కూత కాదది జగమును(ఊతలూపు
మానసానంద మధుమయాహ్వానగీతి 2

కనుల తెరచితి వినీ దాని గానలహరి
వీనులకు విందు గొల్పు నవీనగీతి
ఆలకించియు భావార్థ మరయ లేక
నిలచితిని దాని యెదుటనే తలపుమాని. 3

వింతగా నేడు వినిపించు గొంతుకాదు
తెలివి నను జేరి వలచిన దినము నుండి
వెలుగునకు ముందె ఎలుగెత్తి విసుగు లేక
లేపి వినిపించు జగములు లేచి వినగ 4

ఒక్క నాడైన బీరు పోకుండ నెపుడు
కర్మ యోగిని మించు నిష్కామ సేవ
చేయు చున్నది దీని ప్రశ్నించి యెఱుక
పఱుచుకొనవలె దీని తాత్పర్యమేమొ! 5

స్వరము వినుటకు కర్ణ రసాయనంబు
కాని అందలి భావ మగ్రాహ్యమగుట
చేయునది లేక చింతించి స్నేహ వశత
నిస్సహాయుడనై చెంత నిలచి యుంటి 6

అంతనొక రామ చిలుక నా స్వాంతమందు
ఎటులనో చేరి నా మనో భీప్సితంబు
తెలిసి తొలి కోడి పలికిన పలుకు లెల్ల
నాకు వివరించె భాషాంతరీకరించి 7

వినుము జగమున వినిపించు వింత లెల్ల
కోడి కంఠంబు వినిపించు పాడి పాడి
విషము పీయూష మగును స్రవించు శిలలు
కొక్కొరోయని తొలికోడి కూయగానె 8

అస్మదీయత నరులను విస్మరించి
అంతయును నాకు పరుల కావంత వలదు
అనుచు భావించు నర కోటి కనులు విప్పి
చెప్పినదె చెప్పు – అజుడు సృష్టించు నటుల 9

మాతృ మహిమను మరచిన మంద నరుల
మందలించుచు సచ్చిదానంద లహరి
జగతి ప్రసరింప జేయుచు సంచరించు
విశ్వ మానవ వైభవాపేక్ష చేత 10

ఇల జనించు నొకడు హేమ పాత్రల తోడ
మట్టి పాత్ర తోడ మరి యొకండు
వెలుగు పడెద వేల విధి విధానము గాంచి
తనివి జెందుమున్న దాని తోడ 11

ఈ జగంబేమొ ఇందు నీ కేమి పనియొ
రాక యెట నుండియో మరి పోక యెటకొ
మద్య సాధింప గల మహా మర్మ మేమొ
తెలిసికొన వేల నీ తెల్వి తెల్లవార 12

రేపు నేడుగ నెంచి పై జూపు మాని
దివ్య విజ్ఞాన పథము సాధింపు మింక
బ్రతికి నన్నాళ్ళు మరి ఇంక బ్రతుక బోము
వెలుతురుండగనే యిల్లు వెదకి కొనుము 13

ఇంక క్షణములోన ఏమి కానున్నదో
లేశమే నెరుంగ లేవు నీవు
గాలి భవనములను కట్టెద వీలోన
శ్వాస ఆడు వరకు ఆస పోదు 14

వదలి పెట్టిన గాలి ఉచ్ఛ్వాస మందు
అందునో లేదొ నీకు ధైర్యంబు లేదు
మిడిసి పడెదేల క్షణికంపు మెరపు చూచి
కోటి వైభవములు గూడు కాటి యందె 15

నిదురవోయి మరల ఉదయాన లేతువో
లేవ లేవొ చెప్ప లేవు నీవు
పది దినాల పాటి పట్ట పగలును చూచి
మిట్టి పడెద వేల మట్టి బొమ్మ! 16

ఆది నుండి గూడ హక్కు శూన్యము నీకు
పుట్టు నపుడు తిరిగి గిట్టు నపుడు
నడుమ జరుగుచున్న నాటకమును గాంచి
విఱ్ఱ వీగె దేల వెఱ్ఱి వాడ 17

ఆది వారము నాడున్న అందలంబు
సోమ వారము నాటికి జోలె కాదె
భాగ్య చక్రంబు గని భ్రాంతి పడెద వేల
కష్ట సుఖములు చేయునే కాపురములు 18

గడ్డి మ్రింగెద వొక చిల్లి గవ్వ కొఱకు
నూరు బొంకెదు నీ పాటి నోటి కొఱకు
నాల్క దాటిన సకలంబు నరకమనుచు
తెలిసియును స్వార్థమున మున్గి తేలెదేల? 19

బిచ్చు మిడ లేవు పిడికెడు ప్రేమ తోడ
వందలును వేలు కాంక్షించు చుందు వీవు
ఈ వోరులకీయ వొరులు నీకీయ వలయు
ఇట్లు కోరగ నీకు నోరెట్లు వచ్చు? 20

దిగులు లేక సరిగ తిని త్రేపినన్నాళ్ళు
ధాత లేదు వాని తాత లేదు
కష్ట దినము లెపుడు గల్గునో అప్పుడే
జప తపంబు లెల్ల సాగు చుండు. 21

ద్రవ్య లాభమునకె రామ నామ జపంబు
భూషణముల కొఱకె పూజ లెల్ల
తులసి మాల చేత దుడుకు మాటలు నోట
ఈశ్వరుండు దీని నెరుగ లేడె? 22

లంచగొండి యని తలంచి యీశ్వరునకు
మ్రొక్కు చుందు పిచ్చి మ్రొక్కు లెల్ల
లోక నాయకుండు లొంగునే కొబ్బరి
కాయలకును తీపి తాయములకు 23

అధ్యయనములు గూఢ వేదాంతములును
యోగ విద్యలు వ్రతములు యాగములును
ఇమిడి యున్నవి స్వార్థ రాహిత్యమందె
విశ్వ మానవ సేవయే విష్ణు సేవ. 24

కోడి కూతకు మాటలు కూర్చి మనకు
తెలియ వచ్చెడు రీతిని చిలుక పలుక
పులకరించితి హృదయముప్పొంగ పొరల
వీచినది గాలి భువి తల యూచి చూడ. 25

1948

# త్రివేణి

జయ దేవ కాకలీ స్వర సుధామల ధార
క్షేత్ర విద్యాపతుల్ సేకరింప
సుకవి యోగ ఇకబీరునకథ గాతను పాడి
వేమనార్యుని ఆటవెలది యాడ
సూరదాసుని నంద సూనుడు పోతన్న
మందార మకరంద మందు కొనగ
తులసి మానస పుణ్య తోయంబులో చేర
త్యాగయ్య రాగ సుధా రసంబు
కనుడు, గీర్వాణ దివిజ గంగా భవాని
తరణి జను కూర్చుకొను చెంత తరలి వచ్చి
దేశ భాషా సరస్వతీ తీర్థ రుచుల
విశ్వతోముఖ మొనరించు చున్నదిపుడు.

# పుండరీకము

శుక్ల వత్సర ఫాల్గుణము, శశి
కృష్ణ కాంతులు కాంచి కన్యా
హస్తమున కారాట పడ నిల
కనులు తెరచెను పుండరీకము

మొలక లెత్తినవపుడు శిశిర ని
శీథ సరస విలాస వాంఛలు
వాని తిమిరోన్మాదమును మర
పించు మధుమయ వాసరమ్ములు

ఏమి తెలియని పుండరీకము
జగడముల జడలల్లు జగమున
చిక్కుకొని చీకాకు పడి విల
పించినది విడిపించుకొనుటకు

దీన జన పరి దేవనమునకు
స్వజను లెల్లరు సంత సించిరి
తెల్ల రేకుల నల్ల చూపులు
రంగు రంగుల నింగి నరసెను.

కన్న వారల కనుల పండుగ
చింత దీర్చెడు చెలిమి పొంగగ
దిక్కులరసిన రెక్క లెదుగగ
పెరుగ సాగెను పుండరీకము.

ఎన్ని గడయలొ గడచినవి మురి
పించి పోయిన వెన్ని క్షణములొ
అన్నిటికి సాక్ష్యంబుగా చిరు
నవ్వు చిందును పుండరీకము.

కొసరి సరసము లాడుకొను కుసు
మములు మధుమయ మమత నేర్పగ
సరసులో తన ఛాయలను భా
వించు కొని భాసించు సుమనము.

ఎందు చూచిన ఎంత వగచిన
జార విడిచిన జాడ తెలియ
దిగులుపడి, యెద రగుల, వగచెను
బోధ పడదా బాధ యెవరికి

సుదుల సొగసుల మడుగులో మా
ర్దవమునకు కర్దమము చెదరగ
పిలచి నటులా తలపులటు నిటు
పలుకు తడ బడ పలుకరించెను.

పుండరీకము చూచినది నా
వంక, మరి యే వంక ఎరుగదు
తెలిసి తెలియని తేటి కలతలు
తొలగ వలెనని తెలుపుచున్నది

ఈ పరస్పర పరిచయము మా
యావి పుడమి సహించ లేదట
ఈ చిరంతన బంధనము ఛే
దించ వలెనని చూచు చున్నది.

నిత్య సత్య పవిత్ర రూపము
అలవి కాదీ మాయలాడికి
గెలుపు నిజమని తెలిసి కొని యీ
వలపు కలిమిని నిలుపు కొనవలె

యుగ యుగంబుల జగడ మిది ఈ
నాడు తీర్చిన తీరదిది యని

గడుసు చీకటి కటువుగా నడి
రేయి నను మేల్కొల్పి తెల్పెను.

కాదు కాదని కాంతి పుంజము
తూర్పు వాకిలి తెరచుకొని వద
నార విందము చిందగా దర
హాసమును విరజిమ్మి పల్కెను.

నిదుర లేచితి నుదయ మనుకొని
నింగి వెలుగున నిలిచియున్నది
కరములను వశ పరచుకొని బం
ధించినది మాయాంధకారము.

పగలు రేయిగ రేయి పగలుగ
వెలుగు చున్నది వింత జగమిది
ఏది చేతన మేది జడమీ
రెండు కలయక పండదీ భువి.

వలచినవి తుమ్మెదలు తన్నని
పిలిచినది మకరంద మాధురి
కలచినది మలయజము జలముల –
పక్కుమని నవ్వినవి పువ్వులు

లేదు లేదని వాదులాడుచు,
చేదు – వదలదని నీతి చెప్పుచు
లేత వలపుల పూత వలె విరి
సినది కమ్మని నింబ కుసుమము

జీవితము చిరిచేదు కాదని
తీపి కలదని తేట పరచుచు
కుహు కుహూ యని కూయుచున్నది
కోయిలమ్మ విచిత్ర కాకలి

పూచినవి యేటేట తరువులు
పాడినది పలుమారు కోకిల
పూత పూతకు పాట పాటకు
నవ్య రసరాగములు చిలుకగ.

చేరినది శుక్లాభి సారిక
నందనము నయనాభిరామము
సర్వధారి మహేశ్వరి శ్రీ
ముఖము గని దాగినది దుర్ముఖి

చూచినది విశ్వావసు వ్యయ
విజయ జయ విక్రమ విధాతల
భావ యువ బహుధాన్య పార్థివ
హేవిళంబి విళంబి శార్వరి

కాల పురుషుని కాలియందెలు
ఘల్లు ఘల్లున మ్రోగినవి శుభ
శోభ కృత్తారణ పరాభవ
వత్సరంబులు వంతు పాడగ

ఇటులనే ప్రాభవముతో సం
వత్సరంబులు క్రమము తప్పక
సౌమ్యముగ సాధారణంబుగ
అక్షయంబుగ గడచిపోవును.

అన్నిటికి స్వాగతము చెప్పుచు
స్వగతమగు అగతము తెలియక
ఒంటరిగ కను మూసికొని యే
మేమొ పలుకును పుండరీకము.

పాడుకొనునది నీరవంబుగ
పరుగులిడు నిశ్చలముగా మది
నవ్వుకొను నిర్వేదమున వికసించి వాడని పుండరీకము.

# పునరుక్తి

చెప్పినదే చెప్పుదునని చెప్పుకొందు రదియె మరల
చెప్ప దలచినాడను మరి చెప్పనా మరొక్కసారి!

తెలిసియు తెలియనివి కొన్ని తెలిసి కొంటి మనుకొంటిమి
తెలివి కనులు తెరువగానె తెలియరాని వనుకొంటిమి
కలవని యనుకొన్నవెల్ల కలలయి కాలమున గలిసె
మనవి కాని వనుకొన్నవి మన చెంతనే చేరి యుండె
ఎవరి వారలిల నెవరో? ఎవరెవరో? ఎవరికెరుక!
వెంకయ్యకు నచ్చినటులలు విన్నవించు మంగమాంబ!

చెప్పినదే చెప్పుదునని చెప్పుకొందు రదియె మరల
చెప్ప దలచినాడను మరి చెప్పనా మరొక్కసారి!

చెట్టు మీద పిట్ట చూపి చెంత నున్న గుట్ట చూపి
పట్టు తెలివి పలుమారులు దిట్టపు విలుకాడొకండు
చిత్రమైన బాణ మిచ్చి చెట్టు వెనుక చేరినాడు
బాణము చేజార కుండ భయమున గురి చెదరకుండ
పిట్ట ఎగురకుండ గొట్టి గట్టు చేరుకొనవలెనట
చిలిపి చేష్టలనిపించును తెలియదు పరమార్థమేమొ!

చెప్పినదే చెప్పుదునని చెప్పుకొందు రదియె మరల
చెప్ప దలచినాడను మరి చెప్పనా మరొక్కసారి!

కామమునకు ధర్మమునకు కనుగొంటిమి సామ్యంబును
ధర్మమునకు కామ రూప ధమ్మిల్లము సంధించుచు
కామ గతియె ధర్మ రతికి క్షేమ మార్గమనుకొంటిమి
కాదని బ్రతిమాలు కొన్న కామేశ్వరు మాట వినక

కర్మయోగమునకు క్రొత్త కాలి బాట కనుగొంటిమి
ఏడుకొండ లెక్కి చూడ నీడ నొసగు జాడ తెలిసె.

చెప్పినదే చెప్పుదునని చెప్పుకొందు రదియె మరల
చెప్ప దలచినాడను మరి చెప్పనా మరొక్కసారి!

నిండు మనసు పండునటుల నిలబడి రమణయ్య ఎదుట
తాతా నీ మాట దాటి తప్పుదారి బట్టి తిరిగి
తుట్ట తుదకు మట్టు తెలిసి పట్టి విడువ వనుచు నమ్మి
గుట్టుగ నడి కట్టున నీ గుట్టు చేరుకొంటి ననుము
కరుణాలయుడా రమణుడు కరుణించును శరణనగనె
మమకారముతో పలుకును మరచును మరియాద లెల్ల

చెప్పినదే చెప్పుదునని చెప్పుకొందు రదియె మరల
చెప్ప దలచినాడను మరి చెప్పనా మరొక్కసారి!

అడు గడుగున దండంబులు గుడి మడుగున స్నానంబులు
ఆపదకొక మ్రొక్కు తీర్చి ఆపదములు చేర వలయు
వేంకటాద్రి విభునకు మన వేదన వినిపించుటకయి
గోవిందా గోవిందా గోవిందా యని కోవెల
మారు పలుకు నటుల పిలచి చేర వలయు ప్రభు సన్నిధి
మండపమున కల్యాణము మనసు తీర చూడ వలయు

చెప్పినదే చెప్పుదునని చెప్పుకొందు రదియె మరల
చెప్ప దలచినాడను మరి చెప్పనా మరొక్కసారి!

# పునర్జన్మ

పదులు నాల్గు ఫాల్గుణములు గడచినవీ నాటికీ నే నీపుడమిని గని
ఫాల్గుణ ఫాల్గుణమునకు సాక్ష్యముగ పరుగులిడిన వేటేట శిశిరములు
సందడితో శిశిరము వేంచేయగ సంబరమున విచ్చేయు వసంతము
సాగనంపి శిశిరమును, వసంతము నాహ్వానించును నూతన వర్షము
అల్ల నల్ల చల్లగ అరుదెంచిన ఆ మధు మాసమె సుచి స్మితంబగు
అదియె కురిసి రస ధారల నవనికి హాయి గొల్పి హరి వింటిని చూపును
విమల ధవల శరదిందు హాసములతో మురిపించును భూమండలమును
ఇంతలోన హేమంత సువాసిని పంచిపెట్టు తియ్యని చలిమిడులను
మరల శిశిర మానంద నిలయమగు అవనికి మంగళ హారతి పాడును
ఈ రీతిని శాశ్వత సంవత్సర పరంపరావర్తనములు నలువది
కంటి నిదియె జీవితమనుకొంటిని, కనబడదింతకంటె నా కంటికి!!
'కాదు కాదు పార్థివ జీవితమున కాంచ దగిన వింకెన్నియొ ఉన్నవి
కనులు విప్పినిస్తంద్రిల దృక్కుల కనుగొనవలె బాహ్యాభ్యంతరములు'
అనుచు నన్ను ప్రేరేచి పలికినది అంతర్లోచన యగు శ్రద్ధామయి
వెదకి వెదకి వేసారి తుదకు నా వెంటనున్న వైభవమును గాంచితి;
కాంచియు కాంచనైతి నీ వరకును, కాంచి నేడు నివ్వెరపడి చూచితి,
హర్షధ్వనులానంద గీతికల నాలకించి పులకించిన చెవులివి;
నానా వర్ణ రతి ప్రమదావనమును కనుగొన వెలిగిన నయనములివి;
మలయా నిలమును మించు వాసనల మాధురినోలలాడు నాసికలివి;
చప్పరించి పీయూషము సురుచిర సరస రుచులు విరజిమ్ము పెదవులివి;
నవ్య భవ్యభావనలకు నిలయము నవరసధుని పెన్నిధి హృదయంబిది-
ఇవి యన్నియు జీవిత నందనమున విరిసిన పారిజాత కుసుమంబులు   22
ఇంతటి ఐశ్వర్య రాశి ఏ పరమేశ్వరి యిచ్చెనో!
ఆది లక్ష్మి కామేశ్వరి అఖిల జగజ్జనని ప్రకృతి
అడుగకనే యిచ్చె నాకు అంతులేని వైభవమును
గురుతయినను తెలుపలేదు గుణమెరిగిన వేల్పు గనుక

సాక్ష్యము నను గన్న తల్లి సారస్వత కల్ప వల్లి
ఏ మెరుగని చిరుత వయసు ఏమేమో చెప్పిపోయె
అర్థము కాలేదు నాకు ఆ పలుకుల పరమార్థము
తొలి వెలుగుల గిలిగింతలు తూరుపు పడమరలు తెలుప
వెలుగు చీకటుల వరుసలు నెల బాలుని కళలు చూపె
దేశ కాల పరిధులందు తిరిగి తిరిగి మరుభూముల
జాడయైన కన నందుకు జాలి పడుచు చింతించితి 33
ఏ నీడల దాగి వేణు గానములో మునిగితివో
స్థాయిని హెచ్చింపవోయి అని మాధవు వేడుకొంటి
వేణు గాన కళాలోల విభుడప్పుడు కనికరించి
నెమ్మదిగా వినిపించెను నీరవ తర నిస్వనములు
అని చెవులకు సోకగానె అర్థమయిన దంత శ్రృతి
తొలి బాటలు తొలి మాటలు చిలిపి చేష్టలనిపించెను
అశాంతము సొంతముగా అవగాహన చేసికొంటి–
'అంతులేదు జ్ఞానమునకు అదె సత్య మిదెల్ల మిథ్య'–
అనుచు తెలిసికొన్న వారలనుకొనగా వింటి నేను;
దానిని సాధించుటకయి ధారవోసితిని దినములు
నిదుర మాని నిరీక్షించి నిలకడగా దీక్ష పూని 44
చూపులలో చేష్టలలో చోద్యములగు పలుకులలో
తొంగి చూచుచున్న నీల తోయదముల నడుమ వెలుగు
నిత్య సత్య విద్యుల్లత నీరాజనములు పట్టగ
చూచితి నానాడు – మరల చూడలేదు నేటి వరకు–
తనువు తోడ విజ్ఞానము దినదినాభి వృద్ధి చెందె 49
పార్థివ విజ్ఞానమునకు పరి భాషలు కూడ మారె
ఏమేమో నేర్చితినని విఱ్ఱవీగు చుంటి నేను
నేను చేయునదె ధర్మము నా వాక్యమె పరమార్థము
నా వాంఛలు పావనములు నా దేహము శాశ్వతమని
ఏమేమో కోరుకొంటి, చెరసాలను చేరుకొంటి

చెరసాలయె ఆశ్రమమయి చిరకాలము సుఖ మొసంగె
పార్థివ వైభవము నింత వర కెంతో తనివి దీర
అనుభవించి విశ్రమించ నభిలషించుచున్నది మది 57
కాని నాటి లావణ్యము ఆ శైశవ నైర్మల్యము
ఆ తేజో రాశి మరల అరయ వలయునని యున్నది;
తొలుత నన్ననుగ్రహించి చెలిమి కలిమి ప్రసాదించి
దీవించిన పరమేశ్వరి తీర్చగలదు నా కోరిక
ఎంత చదివి ఎంత నేర్చి ఎన్ని విన్న ఎన్ని కన్న
ఆ దేవికి దయ రానిదె అందదు మన కానందము
ఆప్యాయముగా చెంతకు చేరదీసి తల మూర్కొని
చెక్కిలిపై కోమలతర కరతలమును చేర్చగానె
అంతరాంతరముల నుండి ఆనందము పొంగి వచ్చు
కోటి సూర్య కిరణ కాంతి కూడుకొన్న ముఖ దీప్తికి
ఆ నయనాలోకమునకు నా కనీనికలు చెమర్చు;
ఆ సౌహార్దమునకు నా కాఠిన్యము కరిగిపోవు;
ఆ నిర్మల వాగ్విభూతి నా కొక దివ్యానుభూతి,
క్షణ కాలిక సాన్నిధ్యము కల కాలము వెలుగొందును.
ఆ చల్లని తల్లి నన్ను ఆదరించి ఒడి జేర్చిన
చంటి పాప నగుదు నేను కల విభవములు మరతును;
ఆ క్షణమున పొంగి పొరలు ఆనందము చాలు నాకు-
సార్థకమగు నా జన్మము జన్మ జన్మలకు నిలుచును;
మరల జన్మ వలదు నాకు అదే నాకు పునర్జన్మ.

మార్చి 1970

# మాధవి

మాధవీ నీ మధుర కథ నా
మురళినే మరపించినది పో!
శిలను సలిలము చేయుమమతలు
కరుణనే కరగించినవి పో! 1

ఊహకందని సొగసు నిల వెల
యించి పెంచు విరించి యెవడో!
సొంపు పెంపును చూచి మదిలో
విరులు కురియగ మరియు నెవడో! 2

ఎన్నడో ఏ నాటనో ఏ
తీరునో మన ఎరుక తెలియదు
తలచినంతనె వలపు తలపులు
కలత పడినటు కలవరించును. 3

నాడు నాటిన నారు నేటికి
వాడ లేదది వీడదీ మది
వాడ వాడల వలపు గొని యీ
ఆలయమ్మును అలముకొన్నది. 4

పూల పరిమళ మేల నను మురి
పించునో వివరించ వైతివి
నాటి చెలిమికి సాటిగా మన
సార వీచు సమీర మేమో! 5

ఆశలకు హద్దులను తెలుపని
ఆకసము నెందాక వెదుకను?
నిశిత రాత్రిని నిదుర పుచ్చిన
అరుణ కిరణము లరిగెనెటకో! 6

తరణి కిరణ విధాన మెరిగిన
కడలి కెరటము నడుగగా– అది
గట్టు చేరుచు గుట్టుగా ఆ
లోకమే ఈ లోకమన్నది. 7

# గీతాంజనేయమ్

(శ్రీ గోస్వామి తులసీదాసు రచించిన 'హనుమాన్ చాలీసా'కు గేయానువాదం)

జయమారుతి! జయ జ్ఞాన గుణాంబుధి!
జయ కపివర! లోకత్రయ భాస్కర!
ఆంజనేయ! అతులిత బల సంశ్రయ!
రామదూత! మారుతసుత విశ్రుత!
మహావీర! వజ్రాంగ పరాక్రమ!
కుమతి నివారక! సుమతి సహాయక!
కనకవర్ణ కమనీయ కాంతవపు!
కుండల మండిత! కుంతల విలసిత!
కరమున వజ్రపతాకము లలరగ
మెడపయి జందెము ముంజి రంజిలగ
శివసూనుడు కేసరికి కుమారుడు
తేజోనిధియని దివిజులు పొగడగ
విద్యాగుణ చాతుర్య వారధివి
రామకార్య నిర్వహణ పరుండవు
రామకథా రసజీవివి నీ మది
నెలకొను సీతా రామలక్ష్మణులు
సూక్ష్మరూపమున కంటివి సీతను
వికట రూపమున లంకకాల్చితివి
సంహరించి భీకరముగ నసురుల
రామచంద్రునకు జయము పలికితివి
తమ్మునికయి సంజీవని తెచ్చిన
మెచ్చి నిన్ను దరిజేర్చుకొనియె ప్రభు
బహుమతించి కీర్తించె దాశరథి
భరతునివలె నీవును నా భ్రాతవు
జగతి నిన్ను వేనోళ్ళ పొగడునని
శ్రీపతి నిను బిగుకౌగిట చేర్చెను.

సనకాదులు బ్రహ్మాది మునీంద్రులు
శేషుడు నారద శారదాదులును
యమకుబేర వరుణాది దిక్పతులు
కవివర్యులు వివరింపలేరు నిను
రాజుచేసి సుగ్రీవుని వానికి
రామచరణరతి ప్రసాదించితివి
నీ మంత్రణ సామర్థ్యముచే గద
విభీషణుడు లంకేశ్వరుడయ్యెను!
యుగసహస్ర యోజనములు పరుగిడి
పట్టుకొంటి వాదిత్యుని ఫలమని
రామముద్రికను నోటనుంచుకొని
అవలీలగ దాటితివంభోనిధి
ఇలనెవ్వరు సాధించలేని పని
నెరవేరును నీ కృప ప్రవహించిన
ద్వారపాలకుడవీవు రామునకు
ఆనతిలేనిదె లేదు ప్రవేశము
శరణవేడ నిను కూడుసౌఖ్యములు
భయము లేదు నీ వండగ నుండగ
నీ తేజమునకు నీవె నియంతవు
హుంకరించ కంపించును జగములు
మహావీరనామము వినినంతనె
భూతపిశాచములడరి పరుగులిడు
ఉపశమించు వ్యాధులు భవబాధలు
తలచినంత హనుమంతుని కాంతుని
త్రికరణ శుద్ధిగ ధ్యానము చేసిన
సంకటములు తొలగించును మారుతి
రామరాజ్య మారాధ్య శిరోమణి
కరతలగత చింతామణి నీకది
ఎవరు దేని నర్థించి భజించిన
వారికమిత వాంఛితఫలమిత్తువు

నాలుగు యుగములు చాటు నీ పటుత
నీ ప్రతిష్ఠ వ్యాపించును జగముల
దుష్టశిక్షణము శిష్టరక్షణము
దీక్ష నీకు ఇక్ష్వాకు విభుప్రియ!
అష్టసిద్ధి నవనిధి సంధాయక
వరమిచ్చెను సీతమ్మ నీకు మును
రామ రసాయన సిద్ధి పొందితివి
నయముమీర సేవించి రాఘవుని
సంతసించు నినుకొలిచిన రఘుపతి
శాంతించును బహుజన్మల బాధలు
తుదకు రామ సాయుజ్యము కలుగును
వర్ధిల్లును హరిభక్తి కీర్తిలత
ఇతర దైవ చింతన మనకెందుకు
హనుమంతుని సేవించిన చాలును
తలచినంత హనుమంతుని కాంతుని
ఇడుములుడుగు తీరును భవబాధలు
జయము జయము పవమానతనయునకు
గురుదైవము తానయిన దయానిధి
నూరుమార్లు పఠియించిన దీనిని
ముక్తి కలుగు జీవితము ఫలించును
ఇది గీతాంజనేయమిది చదివిన
సిద్ధిలభించును సాక్షి ఉమాపతి
తులసిదాసు హరిచరణ నిరతమతి
సతతమతని మది నెలకొను రఘుపతి
పవన తనయ సంకటహర
మంగళకర నెమ్మనమున
జానకీశ రామానుజ
సహితముగా రాజిల్లుము.

★ ★ ★

# కఠోపనిషత్తు

–తెలుగు కావ్యానువాదం

ఆద్యక్షర మోంకారం, అంత్యాక్షర మోంకారం7
మధ్యాక్షర మోంకారం, మధురాక్షర మోంకారం
సకల నిలయ మోంకారం, సరస వాక్య పద సారం
వోంకారం వోంకారం వోంకారం పలుకుదాం

కలసి మెలసి తిరుగుదాం కలసి మెలసి పెరుగుదాం
కలసి మెలసి కలిమి చెలిమి బలము గుణము పెంచుదాం
కలసి మెలసి తెలిసికొన్న తెలివిని వెలయించుదాం
కలసి మెలసి కలత లేక కళకళ వెలుగొందుదాం
శాంతి శాంతి శాంతియనుచు శాంతి గీతి పాడుదాం
తాపత్రయ మపనయించు తాపసరుచి పంచుదాం

అనగ ననగ నొక తాపసి అతనికి యాగముల మోజు
వేద విహిత కర్మతతిని వెదకి వెదకి సాధించును
అరుణ తనయు డత డారుణి అతడే ఉద్దాలక ముని
అన్నదానమున కాతని అన్వయ మతి విఖ్యాతము
అందువలన వాజశ్రవు లయి రా వంశజులందరు
గోబ్రాహ్మణ పోషకులగు గోతము లా వంశధరులు
ఈ గౌతమ వంశకరుల యాగ యోగముల ఫలముగ
ఉద్దాలకునకు జనించె ముద్దుబిడ్డ నచికేతుడు

తండ్రిని మించిన తనయుడు తండ్రి చెంత శాస్త్రములను
వేదములను భాష్యములను విద్యల నవలీల నేర్చె
శిష్యులతో కలసి మెలసి చిన్నవాడు నచికేతుడు
గురుశిష్యుల కందరకును కూర్చె పరమ సంతోషము
తనయుని అభివృద్ధి కోరి తండ్రి చేసె నొక యాగము
దాని పేరు విశ్వజిత్తు దాన మొసగవలె సకలము
తనకున్నది వెనుదీయక దాన మొసగుటయె నియమము

కష్ట సాధ్యమని తెలిసియు ఇష్టముతో చేసె నిష్ఠి.

కాని మనసు పెరుగు కొలది కడు చిన్నది అయినది యెద
మంచి మంచి గోధనమును ఎంచి తనకు దాచుకొనుచు
నీరుకూడ త్రాగలేని నోరెండిన పొదుగుడిగిన
బక్కచిక్కి శుష్కించిన పనికిరాని పశు సంతతి
దానమొసగుచుండె తండ్రి తనయున కది నచ్చలేదు
సర్వస్వము దానమొసగ సంకల్పించిన జనకుడు
నిర్వీర్యము నిస్తేజము నిష్ఫలమగు దాన మొసగ
గుణగణములు గల తనయుడు అణకువతో తండ్రి కడకు
చని చనువున విన్నవించుకొనె తన యెదలోని జాలి.

తండ్రీ, నీ సర్వస్వము దాన మొసగవలెననుకొని
నిరానంద లోకములకు సరాసరిగ దారి చూపు
జవసత్వములుడిగిన ఈ సారహీన పశు దానము
చేసి ప్రయోజనము లేదు నీ సర్వస్వము కాదిది
"కన్నా, నీ కన్నా మిన్న కల రెవ" రని మన్ననతో
పలుమారులు చేరదీసి పలుక నేను వినియుంటిని
కావున నీ సర్వస్వము కన్నకొడుకు నెవరికేని
దాన మొసగి ఈ వ్రతమును ధన్యత గాంచుట ధర్మము
నన్నెవరి కిచ్చెదవని నయమున నచికేతు డడుగ
తనకు నీతి చెప్పుచున్న తనయుని గని తండ్రి మనసు
కలవరపడె, కాని నిజము పలుకుచున్న తన బిడ్డకు
ఉన్న మాట చెప్పలేక వూరకుండె వినియు వినక
కాని చిన్న నచికేతుడు కదలలేదు వదలలేదు
బదులు చెప్పుమని తండ్రిని బ్రతిమాలెను పలుమారులు
మొండిపట్టు వదలని తన ముద్దు బిడ్డ పయి మురిపెము
మమకారము మంచితనము మాన మోహములను మరచి
పట్టరాని కోపముతో పండ్లు కొరికి మండిపడుచు
"పోరా యమపురికి నీకు పోకాలము వచ్చెనేమొ
నిన్ను యమున కిచ్చెద" నని మిన్నదరగ పలికె తండ్రి

నచికేతుని పసి హృదయము విచికిత్సకు గురియయ్యెను
ఆవేశము చల్లారిన అనుతాపము తండ్రి నుదుట
గమనించి నచికేతుడు కడు నిబ్బరముగ నుండెను
"అయ్యో, నా కే మయినది" అని జనకుడు పరితపించె
కాలు జారిపోయినచో క్రమ్మరించుకొనవచ్చును
కాని నోరు జారినచో కలకాలము నిలచు మాట

తండ్రి మాట నమ్ముకొన్న తనయుడు యమ నిలయమునకు
దారి చూచుకొనసాగెను తనలో తర్కించుకొనుచు
ప్రథముడ నే నలుగురిలో పదుగురిలో మధ్యముడను
బహిః ప్రాణ మయిన నన్ను పంపునె యమ పురికి తండ్రి?
ఏమి చేయవలె నిప్పుడు? ఏమిటి కానున్న దిపుడు?
అనుకొన్నది కావలయును అన్న మాట కెదురులేదు
పొరబడినను తండ్రి మాట పుణ్యలోకములకు బాట
తండ్రి మనసులోని మాట తలదాల్చెను రఘురాముడు
జాతి దేశ కాలముల కతీతమయిన మహావ్రతము
సాధించిన సార్వభౌమ సాధకుల ప్రసిద్ధి నెంచి
నచికేతుడు తనకు తాను నచ్చచెప్పుకొనె ధర్మము
తండ్రి మాట కెదురు లేదు ధర్మపురిని జేరవలెను
ధర్మువునే అడుగవలెను తనువులోని తన తనమును

తనయుని దృఢ సంకల్పము తన తొందరపాటు నెరిగి
పరిపరి విధముల తనయుని బ్రతిమలాడుకొనె జనకుడు
కాని కుమారుడె తండ్రికి కాల రహస్యము తెలిపెను
మరణమన్న ప్రతి జీవికి మరణాంతకమయిన భయము
మరణించక తప్పదనుచు మనిషికి తెలిసిన విషయము
క్షణ భంగుర జీవితమును శాశ్వతమని యెంచి నరుడు
కలకాలము మనవలెనని కలలు గాంచి కాంక్షించును
దేహముపై మమకారము తీరదు వెయ్యేండ్ల కయిన

జీవితమున సాధించిన దావంతయు లేకున్నను
బ్రతుక వలయునను క ్క ప్రతి జీవికి సహజాతం

కాని యింత వర కనంత కాలములో లయము కాని
రారాజులు కవిరాజులు రాజయోగు లతియోధులు
మహనీయులు గణనీయులు మచ్చునకును కానరారు
మరణ మొక్కటే మహిలో పరమ సత్యమనిపించును
నిజమనుకొని మను మనుగడ నిజముగ కాదేమొ నిజం
గతము వర్తమాన మనాగతమును సంతులితమతిని
గమనించిన బ్రతుకు నిజము కాదనునది బయలుపడును
జీవితమొక వ్యవసాయము చేను జగము పంట నరుడు
సస్యమువలె పండి రాలి సస్యమువలె మొలకెత్తును
జీవితమున జనన మరణ చిర చంచల గతి విధి యిది
దీనికి చింతించనేల దేహి సహజ లక్షణమిది
మరణించును నరకాయము మరణించదు మంచితనము
కావున నను వెళ్ళనిమ్ము కాలుని సన్నిధికి తండ్రి!
నన్ను గుర్చి చూచి మెచ్చి యాచించిన వర మిచ్చును
నరలోకము కోరుకొన్న మరల నన్ను పంపించును
అడిగినంత స్వర్గ మొసగు నాత్మ రహస్యము చెప్పును
ఎటు చూచిన యమ సన్నిధి ఇహపరముల కిల వారధి
నా కనుమతి నొసగుమనుచు నచికేతుడు బ్రతిమాలెను

అంతులేని ఆశలతో అనురాగముతో తనయుని
పెంచిన ఉద్దాలకునికి పెద్ద చిక్కు వచ్చె నిపుడు
అన్న మాట తప్పలేదు అవునని హర్షించలేదు
మవునము నంగీకృతిగా మదినెంచిన నచికేతుడు
ఆ దిన మా క్షణము నుండి అన్న పానములు మానెను
నిరాహార దీక్షతోడ నిరసించినది కాయము
నానాటికి క్షీణించిన నచికేతుని తనువునందు
అంతులేని బ్రహ్మతేజ మణువణువున వెలుగసాగె
మనసు తపసు నాశ్రయింప తనువు ధనువుగా మారెను.
ఆత్మ మనస్సంయోగము నభ్యసించి ఉపవసించి
పిన్న వయసునందె పొందె పెన్నిధి నా నచికేతుడు
బ్రహ్మను భావించి మదిని బ్రహ్మమందు మనసు గూర్చి

బ్రహ్మ తత్త్వమున లయించు భావితాత్మ శరము పగిది
వలదు వలదు వలదనుచు వారించుచు వాపోయిన
తండ్రి కుమిలి క్రుంగిపోయె తన తనయుడు కాదనుకొనె
ఇంత చిన్న వయసునందు ఇంత మహావ్రత సాధన
ఎన్ని జన్మముల ఫలమో ఈ తనువున పండెననుచు
జన్మ సఫలమయ్యె ననుచు సమాధాన పెట్టుకొనియె

నశ్వరమగు స్థూల తనువు నచికేతుడు పరిహరించి
సూక్ష్మ శరీరమున చేరె సూటిగ యమ నిలయమునకు
తలవని తలపుగ తన పురి పొలిమేరకు అరుదెంచిన
నచికేతుని గాంచి భటులు నమ్మలేక నెమ్మదిగా

ప్రేతపతికి విన్నవించ వెడలి రడుగు లెడనెడనిడి
ఇంట లేడు ధర్మరాజు ఎక్కడికో వెళ్లెననుచు
తెలిసికొనిరి ఆ విషయము తెలియపరచి రా అతిథికి
అతిథి పూజ్యుడని అతనిని ఆదరించి సత్కరించి
పితృపతి విచ్చేయువరకు వేచియుండుడని పలికిరి
అంతక సందర్శనమున కరుదెంచిన ఆ బాలుడు
మూడు రాత్రు లుపవసించె ముంగిట శమనాలయమున
నాల్గవ నా డుదయమ్మున నచికేతుని గాంచి యముడు
నా కొర కిట వేచియుంటి నచికేతా! స్వాగతమని
ప్రేమమీర గౌరవముగ పిలిచె లోపలికి రమ్మని
ముక్కు పచ్చలారని యీ మోమున ఈ ముసలితనము
బోధ పడుటలేదు లోని బాధ యేమొ చెప్పుమనుచు
బాలు నడిగె యమ దేవత కాలుని యెద కరిగి పోయె
అతిథి నాదరించలేని అఘము నన్ను చుట్టుకొనియె
పరిహారముగా దీనికి వరములు మూడిత్తుననుచు
కోరుకొనుము కావలసిన కోరిక లే మూడయినను
అన విని యమరాజు గాంచి అంతులేని హర్షముతో
పలుకలేక పలికె చిన్న బాలుడు యోచించి యెంచి

తనువును చాలించితినని తండ్రి చాల తల్లడిల్లె

నిదుర లేక నీరసించి మది చెదరిన పగిది నుండి
నా తండ్రికి శాంతి కూర్చి నాకు మేలు చేయుమనుచు
మూడింటను మొదటిది యిది ముఖ్యమైన వరమనియెను.
నీ తండ్రికి నిన్ను గూర్చి ఏ తాపము సోక దింక
నీవు తిరిగి వెళ్ళగనే నినుగని గుర్తించి నిన్ను
చేరదీసి గారవించు గారాబముతో చూచును.
జరిగిన వృత్తాంతమెల్ల మరచును దుఃఖస్వప్నమువలె
హాయిగ నిదురించు నింక ఆనందము నింప రేయి
అని కృతాంతు దూరడించె నడిగినంతనే వరమిడి.

రెండవ వర మడుగుమనుచు దండనాథు డనుమతింప
నచికేతుడు వినయముతో నాకలోక సాధకమగు
అగ్ని విద్యలోని రహస్యములు తెలుపుమని యడిగెను
జరా మరణములు సోకని స్వర్గ సుఖము ప్రసాదించు
అగ్ని హృదయ మెరిగినచో ఆకలి దప్పిక లుండవు
యజ్ఞ యాగ విధి తెలిసిన యముని వలన తెలియదగిన
పరమ రహస్యము లడిగెను బాలుడయ్యు నచికేతుడు
అడిగినదే తడవుకాగ అగ్ని విద్య సాంతముగా
సాంగోపాంగముగ చెప్పి సకల రహస్యములు విప్పి
ఆ చెప్పిన విద్యయెల్ల ఆకళింపు చేసికొన్న
నచికేతుడు ప్రతి పదమును 'తు' 'చ' లయినను తప్పకుండ
ఒప్పజెప్పె యమరాజుకు వోహోయని మెచ్చుకొనగ
గొప్ప గొప్ప వారి బుద్ధి గుహలో గూఢముగ దాగి
లోకములకు ఆలోకము ఆకరమును ప్రసాదించు
స్వర్గ ప్రదమగు అగ్నిని క్షణములోన తెలిసికొనియె

ఇటుకలతో వేదికపయి ఏర్చి కూర్చి తీర్చి దిద్దు
చితి సంచితి రహస్యమును చిటుకలోన సాధించెను
ఆ మేధాశక్తి చూచి ఆశ్చర్యము పొంది యముడు
నాచికేతమని అగ్నికి నామకరణము చేసెను
అగ్ని విద్య నీ పేరిట అంతట వ్యాపించు ననుచు
హారమిచ్చె నచికేతున కభినందన పూర్వకముగ

చిత్రహార మిది మునిజన చిత్తహార మీ హారము
పలు వన్నెలు పలు రూపులు వెలువరించి శాంతి నొసగు
దీని ధరించిన వానికి తెలియనగును సంధ్యాత్రయి
కర్మత్రయి జనన మరణ మర్మము బ్రహ్మోద్భవమ్ము
కాలత్రయ వేది యగుచు కడతేరును భవజలధిని
కామ జఠర యోగానల గహన గుహాలయము లరసి
మూడు ముడుల ముక్కంటిని ముదమున మది గాంచు నతడు
ఈ హారము దాల్చువార లిహలోకమునందె యెదుట
మృత్యుపాశములను ద్రుంచి మృత్యుంజయు లయిపోదురు
నీ రెండవ వరమున కీ హారము గొను ముపహారము
ఇక మూడవ వరమును యోచించి యెంచి కోరుకొనుము

అన విని రవి కుమారునికి మునికుమారు డణకువతో
విన్నవించుకొనె తన మది నున్న పరమ జిజ్ఞాసను
ప్రాణము దేహమును వీడి పయనించిన పిదప ఆత్మ
మిగిలియుండునని కొందరు మిగుల దేమియని కొందరు
చెప్పుకొందు రసలు నిజము విప్పి చెప్పు వినవలతును
నా కిచ్చిన వరములలో నా కోరిన తుది వర మిది
అది విని యమధర్మరాజు – “ఇది సాధ్యముకాని వరము
దివిజులకును తెలియరాని దేవ రహస్యము దీనిని
తెలిసికొనుట వీలు కాదు తెలుపుట సాధ్యంబు కాదు
పరమ సూక్ష్మ మాధ్యాత్మిక పారీణులకును తెలియని
వరము దీని వదలి వేరు వర మడుగుట మే”లనియెను.

కాని జ్ఞాని నచికేతుడు కాలునకే నచ్చజెప్పి
దేవతలును తెలియవలచు దివ్య రహస్యము నిజ మిది
కాని చెప్పగల సమర్థ కాలజ్ఞుడు దొరికె నాకు
ఈ మహదవకాశము నే నేమాత్రము చేజార్చను
దీని మించు వరము లేదు తెలువరి మరి యెవరు లేరు

అన విని మరణాధికారి ఆ బాలుని సంకల్పము
మార్చుటకై పలు తెరగుల మారు మెరుగులను చూపెను

పుత్ర పౌత్ర బహు సంతతి భూరి ధనము దీర్ఘాయువు
వలచిన ధన కనక వస్తు వాహనములు వైభవములు
సకల కామితార్ధ సిద్ధి సాధించుము నచికేతా!
కాని జీవి మరణోత్తర కాల రహస్యము నడుగకు
మనుజ లోకమున దుర్లభ మహాభోగ భాగ్యములను
అడిగి యథేచ్ఛముగ వాని ననుభవించుమని చెప్పెను.

నవ నవ లావణ్యవతులు నానా రథ హయ గజములు
రత్న ఖచిత భూషణములు రమ్య హర్మ్య విహారములు
కోరుకొనుచు కోరినంత చేరు నిన్ను కామితములు
కాని మరణమును గురించి గడుసు ప్రశ్న అడుగబోకు

నచికేతుడు విని నవ్వెను నర్మ ఘర్మ పదములతో
దక్షిణ దిక్పతి చూపిన దాక్షిణ్యము తూచి చూచి
క్షణ భంగురములు సుఖములు సకల భోగ భాగ్యమ్ములు
నేడుండును రేపుండవు నిర్వీర్యము చేయు నరుని
కలకాలము బ్రతికిన నది కడు స్వల్పముగా తోచును
ఒకనా డీ తనువు వదలి ఒంటి జనుట తప్పనిసరి
ఆ తనువున కయి సర్వము అర్పించుట తగవు కాదు
నృత్య గీత వాహనములు నీ చెంతనె ఉంచుకొనుము
నిత్య శుద్ధ బుద్ధముక్త నిర్మలాత్మ నా కొసగుము
ధనము మానవాధీనము తత్త్వము దైవాధీనము
సకల జీవులకు స్వామివి చల్లని చూపులకు మేము
సంతసించి జీవింతుము చాలును జీవించినంత
నీ చెంతకు వచ్చి కూడ నిత్య సత్య పరతత్త్వము
తెలియలేక అజరామర దివ్య రహస్యము నెరుగక
వర్ణ రతి వినోదములను వాంఛించుట అవివేకము
ఇహపరముల కడ్డుగోడ గహన గోచరము మృత్యువు
మరణించిన పిదప జరా మరణములకు దూరముగా
శాశ్వతముగ నిలచు పరమ సత్యమేదొ వివరించుము
నా మదిలో నాటుకొన్న ఈ మూడవ వరము నొసగి
నన్ను ధన్యుజేయుమయ్య అన్యునిగా భావించకు.

అంతటట యమధర్మరాజు సంతసించి చెప్పసాగె;
శ్రేయస్సని ప్రేయస్సని జీవితమున కలవు రెండు
మార్గమ్ములు మనసును తమ మార్గములకు మరలించును
శ్రేయస్సును సాధించిన సిద్ధించును పరమ శాంతి
ప్రేయస్సును చేపట్టిన హాయి నొసగు నిహ సౌఖ్యము
ఇంపుగ మురిపించు ప్రియము నెన్నుకొందు రవివేకులు
శ్రేయః పథమున జ్ఞానులు శ్రీపదమును సాధింతురు
పరమ యోగులను సైతము వంచించెడు సుఖము వదలి
పరమార్థము కావలెనని పట్టుపట్టినావు నీవు
కనుక నీకు పర తత్త్వము కరతలగత మమలకమగు
విద్యయం దవిద్యయందు వేరు వేరు లక్షణములు
గమనించితి వందు మంచి కనుగొంటివి చేకొంటివి
ప్రియహితముల సార మరసి ప్రియము వదలి హితము కొరకు
దృఢమతితో నిలబడగల ధీశాలివి పసివాడవు
విద్వాంసులు వేదవిదులు విడువరేని మాయలాడి
బలవత్తరమగు నవిద్య పరిహరించితివి క్షణమున
అంధుడొకడు దారి చూడ అంధు లనుసరించు రీతి
అల్పజ్ఞుల ననుసరించి అవివేకులు చెడిపోదురు
కనత్కనక కాంతిని గని కనులు చెదరిపోయినపుడు
పరలోకము కనిపించదు పరమార్థము బోధపడదు
కనిపించని పరలోకము కలదని నమ్మకము లేక
మాటి మాటికిని మనుజుడు మరణజాలమున చొచ్చును
ధనలోభము పదలోభము దారేషణ పుత్రేషణ
తనువుమీది మమకారము తన్ను దాను మరిపించును
భోగభాగ్యములను మించు పురుషార్థము లేదనుకొని
జనన మరణ చక్రములో సంచరించుచుండు జీవి
పార్థివ వైభవము మించు పరమార్థము కల దిలనని
విన్నవారు కలరు గాని కన్నవారు కడు తక్కువ
విన్నవారి కందని పర విద్యను వివరించు వారు
విని తత్త్వము నెరుగు వారు వేలకొకరు కోటికొకరు

సాధారణ సాధకులకు సాధ్యము కాదిది చెప్పగ
చెప్పినంత మాత్రముననె చిత్తము గ్రహియించలేదు
మాటి మాటికిని మనసున మనన చేసికొనినప్పుడె
అణువు కంటె సూక్ష్మమయిన ఆత్మ తత్త్వమరయ నగును
ఆత్మతత్త్వ మరసినంత ఆత్మ నిరతి సిద్ధించును
తర్కబుద్ధి కంద దాత్మ తాదాత్మ్యము తారకమగు
ఆత్మబుద్ధి చిత్తశుద్ధి ఆత్మ సిద్ధి కాధారము
సత్యపదాన్వేషణమున సాటిలేరు నీ కెవ్వరు
నిధి నిత్యము గాదనునది నిజము శాశ్వతము కాదది
నిత్య సత్య మరయుటకు అనిత్య ముపకరించలేదు.
క్షణభంగుర కాంక్షలతో శాశ్వతత్త్వ మరయలేము
ఈ సత్యము తెలిసి నే నుపాసించితి ప్రేతాగ్నిని
నిత్యానిత్యముల నడుమ నిలచును నిలబెట్టు నగ్ని
నాచికేత కాంతి నాకు నా పదమును ప్రసాదించె
జాతవేదమే జీవికి సద్గతి సద్బుద్ధి నొసగు
తెలిసికొంటి విపుడు నీవు తెలియదగిన నిజమిదియని
సాంసారిక సుఖ సంతతి సారహీన మనుకొంటివి
యాగ యోగ ఫలాపేక్ష అక్కర లేదనుకొంటివి
నిత్య సత్య నిష్ఠ తోడ నిలబడగల ధీరమతివి
కంటికి కనిపించని ఘన గహన గుహల దాగియున్న
పరమ పురాతన తత్త్వము పరమ యోగులకు తెలియును
అదియే ఆధ్యాత్మ యోగమది తెలిసిన ధీవరులకు
శోకమోహములు సోకవు సుఖ దుఃఖము లేకములగు
ఈ రహస్య మెరిగిన వా రెరిగించగ విని శ్రద్ధగ
సునిశితమతితో గ్రహించి సుందరతమ రుచిని గాంచి
ఆనందము పొంగి పొరల నాత్మయోగి ఉప్పొంగును
నచికేతా! నీ కిపు డీ నందనవన మెదురయినది
నీ తపస్సు ఫలించినది నీ జన్మము ధన్యమయ్యె

అనుచు యముడు నచికేతుని అభినుతింప సిగ్గుపడుచు
"ధర్మాధర్మముల మించి కర్మాకర్మలను దాటి

భూత భవ్య భవదతీత పూతాత్మను వివరముగా
నాకు తెలియజెప్పు" మనుచు నచికేతుడు విన్నవించె.
"సకల వేదములు దేనిని సంకీర్తన చేయు నెపుడు
సకల తపస్సులు దేనిని సమ్ముఖీకరించు కొనును
బ్రహ్మచర్యమున దేనిని బ్రహ్మర్షులు సాధింతురు
అదియె ప్రణవ మేకాక్షర మదియె జగత్సర్వస్వము
అది కేవల మేకాక్షర మదియె పరబ్రహ్మ మయము
అది తెలిసిన ప్రణవజీవి కనుకొన్నది సిద్ధించును
అన్నిటి కది ఆధారము అందించును చేయూతను
ప్రణవమూల విజ్ఞానము బ్రహ్మలోకమునకు బాట
ప్రణవ నాద మోంకారము ప్రభవ విభవ లయ రహితము
అరచితమగు రచన దాని కాద్యంతములనుచు లేవు
జనన మరణముల నొల్లదు శాశ్వత మతి పురాతనము
తనువు నశించినను తాను తన తనమును నిలుపుకొనుము
చనిపోయిన ప్రాణి తాను చచ్చితినని తలచుట భ్రమ
చంపువాడు తానొకరిని చంపితినని యెంచుట భ్రమ
చంపుట చనిపోవుట పరికింప యథార్థములు కావు
స్థూల తనువు నందు దాగి సూక్ష్మ రూపమున వసించు
నిత్య సత్య శుద్ధ బుద్ధ నిర్మల నిఖిలాంతరాత్మ
అణువు కంటె అతి సూక్ష్మము అదియె మహన్మహనీయము
నిర్వికల్ప కర్మనిరతి నిశ్చల నిర్వేద సుమతి
సాధించిన సాధకులకు సాధ్యమగును తదనుభూతి
అంతరంగ సుప్రసాద మాత్మ నరయుటకు పునాది

కూర్చున్నటులే యుండియు కువలయమును చుట్టి వచ్చు
శయనించియు సకల దేశ సంచారము చేయుచుండు
అప్రమత్త మదోన్మత్త మయిన పరమ రహస్యాత్మ
అంతుపట్ట దందరికిని అంతకునకు నాకు దప్ప
తనువులందు అతనువగుచు తావులేని యెడ తావయి
మహనీయ స్థితికి మహా మహిమ నొసగు మహితాత్మను
కన్నవాడు లోకములో ఖిన్నత దరిజేరనీడు

వేద శాస్త్రములు చదివిన విద్వాంసుల కంద దాత్మ
ఎన్ని విన్న ఎన్ని కన్న ఎంతటి ధీశక్తి యున్న
అంతుపట్ట దాత్మతత్త్వ మది తనంత తెలియవలెను
అంతరంగ హితుల కాత్మ ఆంతర్యము వివరించును
దుష్కర్మలు విడనాడక దురాలోచనలు మానక
శాంతిలేని చంచల మతి సత్యము సాధించలేడు
తెలివితేటలకు లొంగదు తొలి వెలుగుల వెలుగు ఆత్మ
బ్రాహ్మణమతి క్షత్రియ ధృతి పక్వాన్నములగు దేనికి
అనుపాకము మరణమగును ఆ 'ఉనికి'ని తెలియుటెట్లు?

గుహవంటిది నరదేహము కూడియున్న విందు రెండు
కర్మ ఫలము ననుభవించు గహన తత్త్వములు సగముగ
ఎండ నీడ వలె రెండును నిండియుండునని యందురు
బ్రహ్మవిదులు త్రేతాగ్నులు పంచాగ్నుల నెరుగు వారు
యజమానుల కాధారము యజ్ఞ యాగ విధి సేతువు
అక్షర మయ పరబ్రహ్మ అభయమొసగి దరిజేర్చును
ఈ శరీరమే అరదము ఈ రథమును నడుపు బుద్ధి
మనసు పట్టుకొను పగ్గము మహారథియె అంతరాత్మ
వివిధేంద్రియములు హయములు విషయములే గోచరములు
మనసు నింద్రియముల గూర్చి అనుభవించు నంతరాత్మ
రథసారథి మతి దప్పిన రథము దారి తప్పిపోవు
మెత్తని సారథిని చూచి మితిమీరును గుర్రమ్ములు
సంయమ సామర్థ్య సహిత సారథి నడిపించు రథము
సరియగు మార్గమున సాగు సంయత హయగతి సాగగ
మనసును వశపరచుకొన్న మహనీయుడు చెప్పినటులు
నడచుకొనును ఇంద్రియములు నయమెరిగిన హయముల వలె
చంచల మతి కెదురు తిరిగి సంచరించు నింద్రియములు
విచ్చలవిడి నుచ్చు వదలి విహరించెడి హయముల వలె
మందబుద్ధి కలుషిత మతి మనసు కుదురు లేనివాడు
పరమపదము చేరలేడు మరల మరల మరణించును
పరిణతమతి స్థిర చిత్తుడు పావన గుణ కర్మశీలి

పరమ పదము చేరుకొనును మరల తిరిగిరాడు మహికి
మంచిని సారథిగ గూర్చి మనసు నాత్మ వశము చేసి
పయనించిన పరమ పదము ప్రాప్తించును హరిసదనము
ఇంద్రియముల కంటె సూక్ష్మ మింద్రియ విషయంబు లయిదు
అయిదు విషయముల కంటెను అతి సూక్ష్మము మనిషి మనసు
మనసు కంటె బుద్ధి మిన్న మహత్తత్త్వ మతః పరము
అవ్యక్తము మహత్పరము అవ్యక్తముపయి పురుషుడు
పురుషుని మించినది లేదు పరమావధి పరాకాష్ఠ
సకల భూతముల లోపల సంచరించు ప్రత్యగాత్మ
స్థూలముగా కనిపించదు సూక్ష్మబుద్ధి నరయవలెను
గహన గోప్య మగు నాత్మను కనుగొన యత్నించు జ్ఞాని
మనసునందు వాక్కు చేర్చి మనసును జ్ఞానమున గూర్చు
జ్ఞానముతో వెలుగు బుద్ధి లీనమగును మహతునందు
ఆ మహత్తు చివరకు శాంతాత్మయందు లీనమగును
అంతవరకు జ్ఞాని మనసు శాంతించదు విరమించదు
నిదురలేచి మెలకువతో నెలవు చేరుకొనువరకును
తత్త్వజ్ఞుల చింత నాత్మ తత్త్వమరయు నంతవరకు
నిర్విరామముగ సాధన నిర్వహింపవలె నిత్యము
అసిధారా వ్రతమందురు అతిదుర్గమ మీ మార్గము
అని చెప్పుదు రాత్మతత్త్వమందుకొన్న కవి వర్యులు
ఆద్యంతము లేని ఆత్మ అన్నింటిని మించిన స్థితి
శబ్ద మచట వినిపించదు స్పర్శ లేదు రూపులేదు
అవ్యయమది రసహీనము ఆఘ్రాణము పనిచేయదు
నిత్య సత్య నికేతనము నిఖిల జగతి కాధారము
దానిని లోనరయువాడు దాటును సంసరణ సరణి
ఇదియె నాచికేతుని కథ ఇహ పరముల గహన గాథ
ప్రాణనాథుడన్న మాట బ్రహ్మలోకమునకు బాట
శ్రాద్ధ సమయమందు బ్రహ్మ సన్నిధి నిది చెప్పుకొన్న
తండ్రి తాత ముత్తాతలు తనివి జెంది దీవింతురు

నర తనువు తలుపులెల్ల తెరచెను బయటికి విధాత

అందువలన దృష్టి బయట అందందు చరించుచుండు
కాని లోని గూఢాత్మను కాంచలేదు సామాన్యుడు
ఇది తెలిసిన పరమయోగి పదిలముగా ప్రత్యగాత్మ
లోలోపల వెలుగుట గని లోనారసి అమరుడగును
బాహ్య విషయములకు భ్రమసి వానిని సేవించు జనులు
మాటిమాటికిని మరణము ధాటి కణగి మణగుచుంద్రు
అట్లు కాక ధీమంతులు అమరత్వపు రూపు తెలిసి
నిత్యమందు నిలిపి మనసనిత్య మభిలషించరెపుడు
తనకోసము కూర్చుకొన్న తన రూపము తన రసరుచి
తన గంధము తన శబ్దము తన భోగము సంభోగము
అన్నింటిని తన లోపల ఆత్మలయము చేసికొన్న
చివరకు మిగులునది యేది చెప్పుకొనుము నచికేతా!

కలలయందు మెలకువలో కనబడు నేకైక విభుని
మహనీయుని పరమాత్ముని మది నెంచిన వెతలుండవు
కాలకుసుమ మకరందము గ్రోలుచు హృదయాంతరముల
వసియించుచు భూత భవ్య వర్తమానముల నేలుచు
శాసించెడు సర్వాత్మను సన్నిహితముగా నెరిగిన
ఆత్మయోగి అన్నింటను ఆత్మ వైభవము గాంచును
ఇదియె నీవు ప్రశ్నించిన హితము ఋతము నచికేతా!

తొలుత తపోబలముచేత సలిలమందు ఉదయించిన
సర్వమయ హిరణ్య గర్భ సర్వేశుని సర్వ సఖుని
సర్వాంతర్యామిని గని సాయుజ్యము పొందు జీవి
ఇదియె నీవు ప్రశ్నించిన హితము ఋతము నచికేతా!

ప్రాణికి ప్రాణముల నొసగి ప్రాణముతో ప్రభవించెడు
అదితి దేవతాత్మ జీవు నంతరంగమున వెలయును
ప్రాణములకు ప్రాణమగుచు ప్రాణుల లాలించి పెంచు
ఇదియె నీవు ప్రశ్నించిన హితము ఋతము నచికేతా!

అరణియందు దాగియున్న అగ్ని పరబ్రహ్మ మయము
గర్భవతుల గర్భమందు అర్భకు లున్నట్టు లుండు

నిత్యకర్మ నిరతితోడ నిష్ఠగ సేవించినచో
దాగియున్న ద్యుతి మేల్కొని తన తేజము ప్రకటించును
ఇదియె నీవు ప్రశ్నించిన హితము ఋతము నచికేతా!

ప్రతిదినము ప్రభాకరుడు ప్రాక్పశ్చిమ దిక్తటముల
ఉదయించును అస్తమించు నదియె సర్వ సమర్పణము
సకల సురుల కది మహార్ఘ సమారాధ్య మవిలంఘ్యము
ఇదియె నీవు ప్రశ్నించిన హితము ఋతము నచికేతా!

ఇందున్నదె అందున్నది అందున్నదె యిందు గలదు
అందు నిందు వేరు వేరు లరయుటయే మరణించుట
భేదభావమే మరణము భేదరహిత మమరత్వము
మనసు తేల్చి చెప్పవలెను మనము వేరు కాదను నది
వేరనుకొనువారు సారె సారెకు మరణించు చుంద్రు
పరమ పురుషు కాత్మలోన పరమ సూక్ష్మరూపమ్మున
కేవల మంగుష్ఠమాత్ర మావసించి వసియించును
శాసించును భూతభవ్య సర్వకాల సకల గతిని
పొగ లెగయని నిప్పు పగిది రగులుకొనక వెలుగుచుండు
భూత భవ్య వర్తమాన జాత భేదముల కావల–
ఇదియే నీవు ప్రశ్నించిన హితము ఋతము నచికేతా!

కొండపయిని పడిన నీరు ఖండఖండములుగ పారు
భిన్న భిన్న ధర్మములును ఛిన్నములయి విడిపోవును
నిర్మల సలిలాశయమున నిండిన వార్షిక సలిలము
నిలకడమెయి నిలచియుండు నిఖిల జీవ గతియు నింతె
ఇదియె నీవు ప్రశ్నించిన హితము ఋతుము నచికేతా!

పదు నొకండు ద్వారమ్ముల సదనము నరదేహ నగరి
అజు డవక్ర చేతస్కుడు అధివసించు నీ పురమున
దీని నెలవు తెలిసికొన్న దేహిని వ్యథ బాధించదు
పురపతి సందర్శనమున పరలోకము ప్రాప్తించును
ఇదియె నీవు ప్రశ్నించిన హితము ఋతము నచికేతా!

హంసపగది సంచరించు నాత్మ రుచిర శుచివసువుల
అంతరిక్షమున వసించు నగ్ని రూపమున వేదిని
అంతరాంతరముల కతిథి స్వాంతమందు సురులయందు
వ్యోమమందు వనజమందు భూతలమున స్వర్గసీమ
వాక్కునందు సత్యమందు పర్వత శిఖరములయందు
పరమ సత్యమయి వసించు పరమాత్మకు ప్రతినిధియై
ఇదియె నీవు ప్రశ్నించిన హితము ఋతము నచికేతా!

ప్రాణమునకు వూర్ధ్వగతి నపానమునకు నిమ్నగతిని
కూర్చి మధ్య మనమయి కూరుచున్న పరమాత్మను
సేవించును సకల జగతి సేవింతురు సకల సురులు
ఈ తనువును వీడి జీవి నూతన తనువును జేరగ
దేహికి దేహమున మిగులు దివ్యత్వము తెలిసికొనుము
ఇదియె నీవు ప్రశ్నించిన హితము ఋతము నచికేతా!

ప్రాణాపానములు ప్రాణి ప్రాణములను నిలబెట్టవు
ప్రాణములకు ప్రాణమదియె ప్రాణికోటి కాధారము
ప్రాణసూత్ర మదియె పరమ రహస్సనాతన సత్యము
మరణించిన పిదప జీవి మనుగడ నదె తీర్చి దిద్దు
చేసిన కర్మలను బట్టి సేవించిన శ్రుతిని బట్టి
తనువు వదలి తనువు జేరు తన కనువగు తనువుగాంచి
కొందరు దుర్భాగ్యులు తను వొందలేక స్తంభింతురు
మెలకువలో మసలు కోరికలు కలలో వెలయునటుల
జీవి వాసనలను బ్రహ్మ చేకొని నిర్మించు భవము
నిదురించిన జీవియందు నిర్నిద్రము బ్రహ్మపదము
అదియె శుక్ర మదియె బ్రహ్మ మదియె జీవ సంజీవని
సకల లోక సాధక మది శాసన మది అవిలంఘ్యము
ఇదియె నీవు ప్రశ్నించిన హితము ఋతము నచికేతా!

ఒకే అగ్ని బహురూపుల ఒక్కొక్కటిగా వెలుగగ
రూపమునకు ప్రతిరూపము రూపొందగ భువనమయ్యె
సకల భూతముల నటువలె సంచరించు నాత్మయొకటి
రూపమునకు ప్రతిరూపము రూపొందెను లోబయలుగ

ఒకే వాయు వనేకముగ ఒక్కొక్క విధమున వీచును
రూపమునకు ప్రతి రూపము రూపొందగ భువనమయ్యె
సకల భూతముల నటువలె సంచరించు నాత్మ యొకటి
రూపమునకు ప్రతిరూపము రూపొందెను లోబయలుగ
సకల లోక లోచనుడగు సవిత దృష్టి దోషముచే
ఒకరికి కనిపించకున్న ఉన్న వాడు లేకపోడు
సకల భూతముల లోపల సంచరించు నంతరాత్మ
లోక శోకముల చాటున లోపించియు లేకపోడు
ఒకటి ననేకముగ కూర్చు సకల జీవ సంచారిని
వంశీకరణ పరాయణుని స్వాంతమందు కను ధీరులు
శాశ్వత సుఖ మనుభవించి సార్థకముగ జీవింతురు

ఇట్టిట్టని చెప్పరాని ఇల నందరి కలవి గాని
పరమ సుఖము పరిభాషకు స్వాధీనము కాని దాని
భాసించియు భాసించని భాతి అనిర్వచనీయము.
అచట సూర్యకాంతి లేదు అట శశి తారకలు లేవు
మెరుము మెరయ వెరచు నచట నిరుపయోగ మగ్ని యచట
ఆ వెలుగున వెలుగొందును ఈ వివక్త కాంతులెల్ల
సకల జగతి ఆ వెలుగున సంతరించు కొని వెలుగును

వింతయైన రావిచెట్టు వ్రేళ్ళు పైకి ప్రాకియుండు
పూలు పండ్లు కొమ్మలన్ని పుడమి నంటి విస్తరించు
యుగయుగాల రావిచెట్టు యుగములతో పుట్టి పెరుగు
అదియె శుక్ర మదియె బ్రహ్మ మదియె జీవ సంజీవని
సకల లోక సాధక మది శాసనమది అవిలంఘ్యము
ఇదియె నీవు ప్రశ్నించిన హితము ఋతము నచికేతా!

ఈ ప్రపంచ మీ ప్రాణము లెచట నుండి వెడలినవో
ఎవరి వజ్ర హస్తమునకు ఈ భువనము భయపడునో
ఆ మూలము తెలిసినచో అమరత్వము ప్రాప్తించును
లగ్ని సూర్యులా భయమున అనవరతము వెలుగు చంద్రు
ఇంద్ర వాయువులు మృత్యువు హితము కూర్తురా భయమున

దేహ పాతమునకు ముందె తెలిసినచో పరతత్త్వము
కైవల్యము సిద్ధించును కానియెడల మరల మరల
నానా లోకముల యందు నానా దేహములు కలుగు
ఆత్మయందు అద్దము వలె ఆత్మ నరయగా వచ్చును
పితరుల లోకమున కలల విధమున కనిపించు నాత్మ
కదలని జలబింబము వలె కనబడు గంధర్వ భువిని
బ్రహ్మ లోకమున కననగు పగటి యెండ నీడల వలె

ఇంద్రియముల వ్యాపారము ఇంద్రియార్థముల విభవము
వేరువేరుగా జనించి వేరు వేరుగా లయించు
ఇది తెలిసిన ధీయుతులకు ఇహ బాధలు బాధించవు
మనసింద్రియములకు మిన్న మనసు కంటె బుద్ధి మిన్న
బుద్ధి కంటె మహతి మిన్న మహతి మించు నవ్యక్తము
అవ్యక్తము కంటె మిన్న లయిన వాడు పరమాత్ముడు
సర్వాంతర్యామి యితడు సర్వ లింగ రహితాత్ముడు
ఆ పురుషుని గురు తెరిగిన అమరత్వము సిద్ధించును

కంటికి కనపడదు కనుక కననేరవు కను లతనిని
మదిలో నెమ్మదిగా సమ్మతముగ వూహించిన
తెలియ వచ్చు నా రూపము తెలిసిన వాడ మరుడగును.
జ్ఞానేంద్రియములు మనసును శాంతించిన సమయములో
నిర్మల నిర్లిప్త బుద్ధి నిశ్చలముగ నిలచువేళ
ఆత్మయోగి ఆత్మయందు ఆత్మను దర్శించుకొనును
యోగశాస్త్ర విదులు దీని నుత్తమమగు యోగమంద్రు
ఇంద్రియ నిగ్రహము చేత ఈ యోగము సిద్ధించును.
ఇంద్రియలయ విభవములను ఎరిగి చరించుట యోగము
ఈ యోగము వాఙ్మనముల కేమాత్రము సాధ్యపడదు
చర్మచక్షువులు దానిని సమగ్రముగ చూడలేవు
కనుక దాని కనవలెనన కలదనుకుని కనుగొనవలె
కల దనుకొనువానికి అది కలదు లేదు లేదనుకొన
కలదన్నది మది నమ్మిన కలసి వచ్చు తత్త్వబోధ
అది యన్నది కలదనుకొని ఆత్మ తత్త్వమరయనగును.

సకల కామ వాసన లెద సమసి పోయినపుడు నరుడు
మృతిని దాటి అమర దగును అతి సమీపమగు బ్రహ్మము
హృదయములో ముడివడినవి యెన్నెన్నో ముడులన్నియు
విడివడుటయె అమరత్వము వేదవిదిత శాసన మిది.
నర హృదయమునందు గలవు నాడులు నూరును ఒక్కటి
అందొక్కటి తల దిక్కున అమరి యున్న దది ముఖ్యము
దాని వెంటనంటి చనిన ధన్యజీవి తిరిగి రాడు
మిగిలిన వన్నియును నరుని మృత్యువునకు హేతువులగు
సకల జనుల హృదయసీమ సతతము నెలకొన్న ఆత్మ
కేవల మంగుష్ఠ మాత్ర మీ విషయము గమనించిన
పరమ యోగితనువు నుండి పరమాత్మను వేరు చేసి
చూచుకొనును పరికించుచు చోద్యమంది పులకరించు
ముంజి నుండి ముల్లు పగిలి ముచ్చటగా విడివడునది
అదియె శుక్ర మమరత్వము అదియె శుక్ర మమరత్వము
ఇదియె నాచికేతుని కథ ఇహపరముల రహోగాధ
యోగ శాస్త్ర మిది ప్రశస్త యోగు లభ్యసించు విద్య
దీన దీన నచికేతుడ దీను డయ్యె నమరుడయ్యె
విరజత్వము సాధించెను పరమ పర బ్రహ్మపదము
ఈ విధముగ ఎవరయినను ఈ పదవిని పొందగలరు.
ఆద్యక్షర మోంకారం అంత్యాక్షర మోంకారం
మధ్యాక్షర మోంకారం మధురాక్షర మోంకారం
సకల నిలయ మోంకారం సరస వాక్య పదసారం
వోంకారం వోంకారం వోంకారం పలుకుదాం
కలసి మెలసి తిరుగుదాం కలసి మెలసి పెరుగుదాం
కలసి మెలసి కలిమిచెలిమి బలము గుణము పెంచుదాం
కలసి మెలసి తెలిసికొన్న తెలివిని వెలయించుదాం
కలసి మెలసి కలత లేక కళకళ వెలుగొందుదాం
శాంతి శాంతి శాంతి యనుచు శాంతిగీతి పాడుదాం
తాపత్రయమపదయించు తాపస రుచి పంచుదాం.

★ ★ ★

# జిజ్ఞాస

ఆప్యాయంబుగ కూడవలయు నను
　　కనులు, చెవులు, పలుకులు, ప్రాణంబులు
సకలేంద్రియములు, సకల శక్తి సక
　　లంబు బ్రహ్మమయ మౌపనిషదమిది
నేనెన్నడు విడనాడను బ్రహ్మను
　　బ్రహ్మ నన్ను విడనాడ దెన్నడును
వీడ నేను విడనాడరాదు నను
　　ఆత్మ తత్త్వ మనవరతము నా మది
నెలకొల్పుచు నెలకొనవలె నిత్యము
　　నెలకొనవలె సూపనిషత్సూక్తులు. 1

ఎవరి పంపున ఇచట కేతెంచు మనసు?
ఎవరు కూర్చగ ప్రాణంబు లవనిఁ గూడు?
ఎవరు పలకించఁగా పల్కు నిచట వాక్కు?
కనుల వీనుల కెవడు సంగతిని కూర్చు? 2

చెవికి చెవియది, చిత్తంబు చిత్తమునకు,
వాక్కునకు వాక్కు ప్రాణంబు ప్రాణమునకు,
నేత్రమునకది నేత్రంబు, నిపుణ మతులు
దాని గని పృథ్వి నమరులై తరలు చుంద్రు. 3

కనులు చననేర వచటకు, చనదు వాక్కు
మనసు చొరరాని నెలవది – జనులు దాని
తెలిసికొనలేరు, తెలిపిన తెలియరాదు –
తెలిసి తెలియని దాని కతీత మనుచు
తెలుపఁగా తొంటి వింటిమి తెలియువారు. 4

వాక్కుచే దాని ప్రవచింప వలను కాదు–
అదియె వాక్కున కభ్యుదయంబు కూర్చు

అరయ గానదె బ్రహ్మ మన్యంబు కాదు
జనులు సేవించునిది ఉపాస్యంబు కాదు. 5

తలపులకు దాని తలపోయ తరము కాదు –
వెలయు దాననె మనసున తలపు లెల్ల
అరయుగానదె బ్రహ్మమన్యంబు కాదు
జనులు సేవించు నిది ఉపాస్యంబు కాదు. 6

కాంచవలె నన్న కనులకు కానరాదు–
కనులు దాననె సకలంబు కాంచు భువిని
అరయ గానదె బ్రహ్మమన్యంబు కాదు
జనులు సేవించునిది ఉపాస్యంబు కాదు. 7

ఆలకించగ వీనుల కలవి గాదు–
దాననే ఆలకించును వీనులవని
అరయ గానదె బ్రహ్మమన్యంబు కాదు
జనులు సేవించునిది ఉపాస్యంబు కాదు. 8

ప్రాణశక్తికి స్పందించు ప్రాణి కాదు
ప్రాణములకది ప్రాణనాస్పదము కాని –
అరయ గానదె బ్రహ్మమన్యంబు కాదు
జనులు సేవించునిది ఉపాస్యంబు కాదు.

## రెండు

తెలియు నను కొన్నచో నీవు తెలిసికొన్న
బ్రహ్మ తత్త్వమ్ము లేశమాత్రమ్ము సుమ్ము
నిజము పరికించ నీవును నిర్జరులును
తెలిసికొన్నది కొద్ది – సందిగ్ధమదియు! 1

ఎఱుగుదును లెస్స యంచు భావించ రాదు
ఎఱుగ ననియును పలుకరా దెరిగి యుంట
ఎఱుక గలవాడె అన్నింటి నెఱుగు నిజము
ఎఱుగుటయు కాదు కాదది యెఱుగకుంట. 2

మనన మెరుగని మనసిరి కనును దాని
మననమున మున్గువాడు కన్గొనఁడు నిజము
తెలియుననుకొన్న వానికి తెలియరాదు
తెలియదనుకొన్న వానికి తెలియనగును. 3

ఇదియె ప్రతిబోధ విదిత మభీప్సితంబు
అందుకొని దీని నమరత్వ మొందు నరుడు
ఆత్మవైభవ మొసగు వీర్యాఖినిరది
అమరు నొనరించు నరుని విద్యాను రక్తి. 4

దేహ ముండఁగనే దీని తెలియ వలయు
లేని నాఁడది తీరని హాని యగును
సకల భూతములం దాత&మ సార మరసి
అమరులగుదురు బుదులు లోకాంతరముల. 5

## మూడు

దేవతలను గెలిపించెను బ్రహ్మము
గెలిచితిమని తలపోసిరి విబుధులు
సాధించితిమ విజయమనుచు భా
వించిరి సురులా ఘనత తమదె యని 1

ఈ విషయము గమనించిన బ్రహ్మము
ఆవిర్భావము పొంది అచట ప్ర
త్యక్షమయ్యె నొక యక్ష రూపమున –
తెలియదయ్యె ఆ రూప మెవ్వరికి! 2

అపుడగ్నిని పిలిపించిరి వారలు
తెలిసికొనుటకా యక్షుడెవరొయని
సమ్మతించి అతడరిగె నచ్చటకు
అడిగె నతని నా రూప మెవరవని. 3

నే నగ్నిని నను జాతవేదుడని
చెప్పుకొందురని చెప్పె నగ్నియును –

ఏమి చేయ గల వీవని యడుగగ
ఇల నన్నియి దహియించ నేర్తుననె 4

గడ్డిపోచ నట వైచి కాల్చుమని
పలుక నురికి యత్నించె నగ్నియును
తిరిగి వచ్చె తుద కలవి గాక ఆ
యక్షుడెవరొ తెలియఁగ రాదాయెను 5

అపుడు వాయువును పంపిరి వారలు
తెలిసి కొనుటకా యక్షుఁడెవరొ యని
సమ్మతించి అతఁడరిగె నచ్చటకు
అడిగె నతని నా రూప మెవరవని 6

నే వాయువు, నను మాతరిశ్వమని
చెప్పుకొందురని చెప్పె వాయువును -
ఏమి చేయ గల వీవని యడుగగ
ఇల ననిటి నే నెగయ నేర్తుననె. 7

గడ్డి పోచ నిడి ఎగుర వేయమని
పలుక నురుకి యత్నించె వాయువును -
తిరిగి వచ్చె తుద కలవి గాక ఆ
యక్షుడెవరొ తెలియఁగ రాదాయెను 8

అపు డింద్రుని అర్థించిరి వారలు
తెలిసికొనుటకా యక్షు డెవరొ యని
అరిగె నతడు నాతని గని నంతనె
మాయమయ్యె మాయామయ రూపము. 9

గగన వీధి నక్క జముగ నచటనె
వెలసె నొక్క యోషిత శోభామయి
తుహినా చల తనయాన్విత తను ఉమ-
అడిగె నామె నమరేంద్రుడు: దేవీ!
ఎవర వీవు, యక్షాకృతి యేమని. 10

## నాలుగు

ఆ లలామ వివరించె బ్రహ్మమని
"మీ జయమున కాధారము బ్రహ్మము"
ఆ మాటలు విని నంతనె సకలము
బ్రహ్మమయంబుగఁదోచె నింద్రునకు 1

అగ్ర గణ్యులయిరందు వలన సుర
జాతికి అగ్నియు, వాయువు, ఇంద్రుడు -
చెంతనుండి తొలు దొల్త బ్రహ్మమును
తెలిసికొనిరి కని ప్రత్యక్షంబుగ. 2

అందు నింద్రు దత్యంత సన్నిహిత
ముగ గాంచెను మున్ముందు తెలిసికొని
మెరుము మెరయ భాసించును, రెప్పలు
వాలగ నగు నంతర్హిత మా ఛవి. 3

అధి దైవతమగు బ్రహ్మ భావమది
ఆధ్యాత్మికముగ దాని గాంచి మది
అనుసరించు స్మరియించును సతతము
సహకరించు సంకల్ప శుద్ధియును. 4

అది తదీయ భావన తద్వన మది
సకల జనారాధ్యము తద్వన రుచి
దాని నెరిగి తన్మయు డగు వానిని
ప్రాణి కోటి వాంఛించి కొలచు నిల 5

ఉపనిషత్తు వివరించి చెప్పుడన
వివరించితినని తెలిపె దేశికుడు
ఉపనిషత్తు బ్రాహ్మీమయ మట్టిది
తెలియ పరచె తెలిపితినని తెలువరి. 6

తపో నిష్ఠ, దమ సంపద, కర్మో
పాసన దానికి మూల కందములు -
వేదములే అవయవములు దానికి -
సత్య మాయతనమగు నా విద్యకు. 7

దాని తత్త్వమిటు లామూలాగ్రము
తెలిసి కొన్న తొలగును పాపౌఘము -
మహనీయంబగు స్వర్గ లోకమున
వెలయు నతడు శాశ్వతముగ వెలయును. 8

ఆప్యాయంబుగ కూడ వలయు నను
కనులు, చెవులు, పలుకులు, ప్రాణంబులు
సకలేంద్రియములు సకల శక్తి సక
లంబు బ్రహ్మమయ మౌపనిషదమిది
నే నెన్నడు విడనాడను బ్రహ్మను
బ్రహ్మ నన్ను విడనాడ దెన్నడును
వీడ నేను విడనాడ రాదు నను -
ఆత్మ తత్త్వ మనవరతము నా మది
నెలకొల్పుచు నెలకొన వలె నిత్యము
నెల కొన వలె సూపనిషత్ప్రోక్తులు.

ఓం తత్ సత్

మూలం : కేనోపనిషత్తు

# దిదృక్ష

అదియు పూర్ణము-ఇదియు పూర్ణము
పూర్ణమున ఉదయించు పూర్ణము
పూర్ణమున పూర్ణంబు పోయిన
పూర్ణమే శేషించి యుండును

జగతి జగమున గోచరించెడు
సకల మీశావాస్య మియ్యది
అనుభవించుము త్యాగ మతితో
వలదు లోభము, ఎవరిదీ సిరి!

ఆచరించుచు కర్మలను జీ
వించవలె శత వత్సరంబులు
లేదు మార్గాంతరము నీకిక
అంట దిటు లిట కర్మ నరులను

ఆత్మ ఘాతకులరుగుదురు దే
హాంతమున లోకాంతరములకు
అవి అసూర్యము లందెపుడు గా
ఢాంధ కారము నిండి యుండును

కదలదది మది కంటె వడిదది
అందదది ముందరుగు సురులకు
అందుకొను పరుగెత్తు వారిని
అందె జలమనిలములు నిలచును

నడచునది, నడయుడిగి నిలచును,
దూర మరుగును, చేరు చెంతకు
ఉండునది యన్నింటి లోపల
అన్నిటికి బాహ్యముగ దోచును.

ఆత్మలో భూతముల నెల్లను
సకల భూతము లందు ఆత్మను
గురుతుగా కనుగొన్న సకలము
తెలియనగు తెలియనది యుండదుబు
సకల భూతము లాత్మ యందుద
యించు నని గమనించు వారికి
ఒకటి గనె కనిపించు సకలము
శోక మోహము లతని సోకవు.

అతడు శుభ్రమకాయ మవ్రణ
మయిన దానిని పాప విద్ధము
కాని దానిని, శుద్ధమయి అ
స్నా విరంబగు దాని పొందును

కవి యతండు మనీషి పరిభవు
డాత్మ భవుడు యథార్థ మరయుచు
కూర్చు నిల సకలార్థములు పలు
వత్సరంబులు శాశ్వతంబుగ

చేరుదురు గాఢాంధ తిమిరము
ఇలనవిద్యను కొలచు వారలు
అటులనే తిమిరమున చొత్తురు
విద్య నిల సేవించు వారలు

విద్య గుణమగు కొందరకు మరి
కొంద రెంతురవిద్య గుశ్రీని
వింటి మిటులా తత్త్వమును వివ
రించి ధీరులు మాకు తెలుపుగ

విద్య యిట్టి దవిద్య యిది యని
రెంటి కూరుపు నెరుగు వారలు
దాటి మృత్యు వవిద్యయ తోడుగ
విద్యతో సాధింతు రమృతము

చేరుదురు గాఢాంధ తిమిరము
ఇలను లేమిని కొలచు వారలు
అటులనే తిమిరమున చొత్తురు
కలిమి నిల సేవించు వారలు

కలిమి గుణమగు కొందరకు మరి
కొంద రెంతురు లేమి గుణమని
వింటి మిటులాతత్త్వమును వివ
రించి ధీరులు మాకు తెలుపగ
కలిగి యిట్టిది లేమి యిది యని
రెంటి కూరుపు నెరుగు వారలు
దాటి మృత్యువు లేమి తోడుగ
కలిమితో సాధింతు రమృతము

పసిడి పూసిన పాత్రలో స
త్య స్వరూపము దాగియున్నది
సత్య ధర్మ సమీక్షణము పో
షించు దొర? తొలగించు మీ పొర

పూష ఋషివర యమ దివాకర
విధి రచిత దీధితుల నాపుము
చూడ వలె నీ శివతమచ్ఛవి
పురుషుడతడితడతడె నేనయి

అనిల వాయువు లమరములు, భ
స్మాంతమిది పార్థివ శరీరము
ఓ క్రతూ! మరువకుము కృతమును
మరువకుము క్రతు, మరువకుము కృతి

విశ్వ నయున విదుండ వగ్నివి
సుపథమున గొని పొమ్ము మము ప్రభు!
పొందవలె రాష్ట్రమును, బాధలు
తొలగవలె, మ్రొక్కెదము మరి మరి

అదియు పూర్ణము - ఇదుయు పూర్ణము
పూర్ణమున ఉదయించు పూర్ణము
పూర్ణమున పూర్ణంబు పోయిన
పూర్ణమే శేషించి యుండును.

ఓం తత్ సత్

ఈశావాస్యానికి అనుకృతి

11-6-1968

# కాంచన పతాక

చిత్ర చిత్ర విచిత్ర దేవా
నేను గర్జించినప్పుడు నా గుండె చేసే శబ్దం
నీ జైత్రయాత్రకు భేరీనినాదం కాగలిగితేచాలు
నా హృదయం రక్తం చింది చిందులు ద్రొక్కి
నీ వాకిటికి రత్నతోరణం కట్టగలిగితే చాలు.
నా నీల తరళ తనుచ్ఛాయ
ఒకింతసేపు నీ అందాన్ని ఆరాధించగలిగితేచాలు.
నాలోని దుర్భరవేదనా జ్వాలలు
నీకు కాంచనపతాకగా వెలగగలిగితే చాలు
నాలోని జాలి నీకు తివాచీ అయి
నీ అయనానికి అందం కూర్చగలిగితేచాలు.
నా కన్నీరు నీకు పన్నీరై
నిన్ను అభిషేకించగలిగితే చాలు
తండ్రీ!
జన్మజన్మాంతరాలకు నేను
మేఘంగానే జన్మించాలని
సర్వాత్మనా కోరుకుంటాను.

(మైకేల్ మధుసూధనదత్తా)

# రవీంద్రుని గేయాలు

చిత్తము భయపడని చోట శిరమున్నతమయిన చోట-
స్వచ్ఛందముగా జ్ఞానము సాగి విరులు కురియు చోట-

ప్రాకారము గృహాభ్యంతరముల నిరంతరము ధరను
చీల్చి తునిమి తుత్తునియలు చేయ నలవికాని చోట-

హృదయ వర్తి నుండి వెడలి వాక్యము వెలుగొందు చోట-

నలు దిక్కుల పలు తావుల వెల్లువలయి పొంగి పొరలి
ప్రతిబంధము లేక పారు శత సహస్ర కర్మధార
చరితార్థముగా ప్రపంచ సంచారము చేయుచోట-

మూఢాచారము లెడారి నిసుక తిన్నెలయి ఎదురగు
కమ్మని భావాంబువులను కబళించక మెలగు చోట-

పాయలుగా పురుషార్థము పొరబడి విడివడని చోట-

సకల కర్మలకు విషాదములకు మహానందమునకు
నిత్య సత్య దీప్తి వెలయ నీ వధిపతి వయిన చోట-

జాలి గొనక తండ్రీ, నీ చేతులతో మందలించి
మేల్కొల్పుము భరతావని నపుడగునది స్వర్గసీమ
వెలిగించుము నా గృహమున నీ చేతులతో జ్యోతిని-

నీ వెలుగున సార్థకమగు సకల వేదనలు బాధలు
మాయమగును దాగిన చిరు చీకటి నీ వెలుగును గని
నీ వెలుగున అందరు నా కయిన వారివలె నుందురు
వెలిగించుము నా గృహమున నీ చేతులతో జ్యోతిని

నిలకడగా వెలుగును నీ కరతల గత మణి దీపము
కనురెప్పల తీర్చిదిద్ది పసిడి వన్నెలను కూర్చును
వెలిగించుము నా గృహమున నీ చేతులతో జ్యోతిని

మసక మసకగా వెలుగును నే వెలిగించిన దివ్వెలు
ప్రసరించుము నీ కరతతి నా వాకిటి మెట్లపయిని
వెలిగించుము నా గృహమున నీ చేతులతో జ్యోతిని

జీవితమున నన్నేలు వేలుపని నిలతునెపుడు నీ యెదుట నో ప్రభూ
సకలలోక నాయకుడవు నీవని నిలతునెదుట కైమోడ్చి నే ప్రభూ

అంతులేని నీ అంతరిక్షమున మారుమూల నిర్జన వనసీమల
మెత్తనియెద చెమరించిన కనుగవ నిలబడుదును నీ యెదుట నో ప్రభూ

నీ విచిత్ర సంసృతి భవ జలనిధి నధిగమించి ఆచరణ తటమ్మున
అఖిల జగతి జన సంకుల తలమున నిలతు నెపుడు నీ యెదుట నో ప్రభూ

నీదగు భువి నా చేయదగిన పని ముగియగనే రాజాధిరాజ నే
నొంటరిగా సన్నని నిస్వనమున నిలబడుదును నీ యెదుట నో ప్రభూ
జీవితమున నన్నేలు వేలుపని నిలతు నెపుడు నీ యెదుట నో ప్రభూ

★ ★ ★

# నాసామి

విని పించెనో లేదో వినుడతని పదరవము
విచ్చేసె విచ్చేసె విచ్చేసె నా సామి
యుగ యుగంబులనుండి పగలనక రేయనక
అపుడనక ఇపుడనక అనుదినంబరుదెంచు-
విచ్చేసె విచ్చేసె విచ్చేసె నా సామి
ఎదురు చూపుల ఎడద ఏమరక ఏమేమొ
పాడుకొన్నది పిచ్చి పట్టినటులదియిదే-
విచ్చేసె విచ్చేసె విచ్చేసె నా సామి
ప్రావృడంబర వీధి శ్రావణపు చీకటులు
క్రమ్ముకొన వారిధర రథమునధిరోహించి-
విచ్చేసె విచ్చేసె విచ్చేసె నా సామి

2

అతని అడుగుల వడియె అంతమొందని చింత
వాని కోమల కర- స్పర్శ మణి సుఖమయ్యె
విచ్చేసె విచ్చేసె విచ్చేసె నా సామి

1963

ఆధారం : గీతాంజలి

★ ★ ★

# ఆరాధన

అపరి పూరిత జీవితారాధనా క్రమము
వ్యర్థంబు కాదనుచు అర్థమైనది ప్రభూ!
వికసింపకయె ధరణి విడివడిన కుసుమంబు
మరు భూమినుప్పొంగి పరుగులిడి పొరలు నది
వ్యర్థములు కావనుచు అర్థమైనది ప్రభూ!
జీవితంబున వెనుక చిక్కి పోయిన వెల్ల
కల్ల గా వని తేట తెల్లమైనది ప్రభూ!
నా అనాగత మనగ, నా అనాహతమనగ
నీ విపంచిక మాట నిర్గమించినవవే
వ్యర్థములు కావనుచు అర్థమైనది ప్రభూ!

1964
(విశ్వకవి రవీంద్ర గీతాంజలి నుండి)
భావానువాదం.

★ ★ ★

# పసిడి నౌక

(మూలం: రవీంద్ర రచన, సోనార్ తరీ : 1963)

పలిత ధాన్యంబుకోసి కుప్పలుగ పోసి
మింటి ఘనఘోష వినుచు కూర్చుంటి దరిని
తోడు తెలియని జడివాన తోడు కాగ
పరుష నిశితాసిధారతో పారెనదియు
కోయుచుండగనే వాన కురియ వచ్చె

అతి లఘుక్షేత్ర మొంటరినైతి నేను
కుటిల జలము చతుర్దిశల్ కూడియాడ
అభిముఖాంచల పూర్వ సంధ్యాను రక్త
జలధరావృత పురతరుచ్ఛాయనౌక వి-
శిష్ట చిత్రంబు కనుచు ఈ చివరనుంటి

నిండు తెరచాప - నిశ్చల నేత్ర యుగము
గతి నిరూపింప పాడుకొనుచతడెవండొ
చేయునది లేక కెరటముల్ చెదరిపోవ
నడుపు చున్నాడు పడవనా నావికుండు-
చూడగనె తోచె - ఎచటనో చూచినట్లు

ఎచట కీయాత్ర? ఏ దేశ మేగ వలయు?
ఓడదరి నిల్పి రమ్మిటు లొక్క మాటు
చివరకెటకేగి ఎవరికిచ్చినను సరియె
వచ్చికొని పొమ్ము చాలు... నా పసిడి పంట
క్షణిక మధుమయ మందహాసము నొసంగి

పడవ నిండుగ కొనుము కావలసినంత
ఇంతమిగులక సకల మర్పించి నాడ
ఇన్ని దినములు నా చెంత నున్న దాని
స్వ స్థలిం జేరనిడితి సర్వస్వ మిపుడు
కరుణ గొని పొమ్ము నన్ను నీ తరణిపైని.

నావ చిన్నది - ఏ పాటి తావు లేదు
స్వర్ణ ధాన్యంబు చేత సంభరితమయ్యె
ప్రావృడంబర మంబుధరా వృతంబు
కాగ శూన్యాంచలమున ఏకాకినైతి
భవ్య మయినది కొనిపోయె -- పసిడి నౌక!!!

# స్వాగతము

(మూలం: గీతాంజలి)

నీ కొఱకు జీవితము నీరసించిన వేళ
కరుణ ధారలు కురియరావోయి!
ఇలనున్న మాధుర్య -మింకిపోయిన వేళ
సంగీత సుధ విరియ రావోయి!
కరుణ ధారలు కురియ రావోయి!
నలుదెసల ముసురుకొని నన్ను బెదిరించుటకు
భీకరాకృతి కర్మ బిట్టు గర్జన చేయ
ఆంతర్యమున నీరవాధిపత్యము తోచ
అల్ల నల్లన నడచి రావోయి!
కరుణ ధారలు కురియ రావోయి:

కార్పణ్యమున కరగి కంది పోయిన మనసు
మారు మూలన చేరి మాటలుడిగిన వేళ
ఔదార్య రాశి! నన్నరయ ద్వారము తెరచి
రాజ తేజములలర రావోయి!
కరుణ ధారలు కురియ రావోయి!

తెలివి వెలుగును మాసి జిలిబి చీకటి చేసి
వాసనలు నా మనసు వంచించుటకు రాగ
నిద్ర మరచిన నీదు నిర్మలాంతఃకరణ
రుద్ర కాంతులు వెలయ రావోయి!
కరుణ ధారలు కురియ రావోయి!!

1963

★ ★ ★

# సాక్షాత్కారము

ఆధునిక హిందీ మహాకావ్యాలలో సుప్రసిద్ధమైన 'కామాయని' లోని ఒక సన్నివేశం
కవినామధేయం: జయ శంకర్ ప్రసాద్

కలహ కోలాహలాకుల వేళనుదయింతు
హృదయ నిర్గత మధుర పదము పోలిక నేను.

సకల చైతన్యంబు శ్రాంతమై క్లాంతమై
నిత్య చంచలతచే నిద్ర నన్వేషింప
జీర్ణ శీర్ణంబయిన జీవితంబున మృదుల
మలయ పవనము వోలె మసలు చుందును నేను

చిరవిషాదము నెడద జీర్ణించుకొని జీవి-
తారామ మంధకారావృతంబగు వేళ
లే- సంజ కంజ రేఖల దీప్తి వికసించు
సుప్రభాతము వోలె చూడ వచ్చెద నేను

మరుభూమి నలముకొను మండుటెండలమధ్య
బిక్కుబిక్కున నీటిచుక్కపై విలపించు
చాతకాక్రందనము జగతినిండినవేళ
సరసవర్షాకృతిని కరగివచ్చెద నేను

స్తబ్ధ పవనమునందు స్తంభించి జీవితము
క్రుంగి కుమిలిన గుండె కూర్చుకొని కుంటుపడ
అఖిల జగతిని దాహమావరించిననాడు
మధుమాస యామినీ సుఖము నొసగుదు నేను

పేరుకొన్న నిరాశ వారిధరముల వోలె
కన్నీటి కొలనిలో తన్నుందా చూచుకొన
మధుపములు ముసురుకొన మధువునాడి దాచుకొను
సజల జలజముగ సాక్షాత్కరింతును నేను.

1962

★ ★ ★

# ఎంత పిచ్చిని పడిపోయెనీజగంబు

(సుప్రసిద్ధ హిందీ కవయిత్రి మహాదేవి వర్మ కవితకు
ఛాయానువాదం)

షట్పదావృత పరిఫుల్ల సరసిజంబు
వాడి గాలికి ధూళిపై పడి యొనర్చు
మర్మరధ్వని వినుమదే మారుమూల
*ఎంత అస్థిర సౌందర్య మీ జగంబు!* 1

కిసలయాధర మధు సుధా రసముగ్రోలి
సురభి వెదజల్లి విహరించుచున్న దదిగో
మంద మలయజ మాధవీ మారుతంబు
*ఎంత మాదక వాహ్యాళి యీ జగంబు!!* 2

స్వాతి సలిలపిపాసతో చాతకంబు
ప్రియ, ప్రియా! అని విలపించి విసుగు చెంద
అగ్ని కణములు కురియించు నంబుధరము
*ఎంతనిష్ఠుర పరిహాస మీ జగంబు!!!* 3

సుఖ నిశానంద డోలికా సుప్త భువిని
పరిహసించుటకై సుధాకరుడొనర్చు
చంద్రికాహాస మాధుర్య సారమిదియె-
*ఎంత పిచ్చిని పడిపోయెనీ జగంబు!!!!* 4

★ ★ ★

# గురువాణి

(గురునానక్ 'గురుగ్రంథసాహెవ్' నుండి ఓ అనువాద ఖండిక)

ప్రాపంచిక వాసనలను
రంగరించి సిరా చేసి
నిర్వికార నిర్వికల్ప నిర్మల నిజమానసమను
కాగితమును చేత గొనుము
కలము చెలిమి చేసికొనుము
మదికి ముదము నొసగు మృదుల
పదముల వెలయించు నెడద
కూర్చుకొనుము గురుపదములు
కొలచి రచన నేర్చుకొనుము
వ్రాయుమతని నామములను
పాడు మతని దివ్యమహిమ
అతడనంతు డప్రమేయు డక్షయు డవ్యక్తుడనుచు
తెలిసి తెలియ వెలయించుము
తొలి తెలివిదియని జనులకు
అదే రచన అదే గణన
అదే లేఖ అదే రేఖ
అదే ఇహము అదే పరము
ఇది గురు నానకుని పదము.

# కారుణ్య ఘనత

వాడనొల్లక వికసించు వారిజములు
దీప్తి వీడని నక్షత్ర దీపమాల
కరిగి కురియగ నేరని ఘన నిచయము
ముత్యములు రాల్చి మురియని ముదిత కనులు
ప్రణయ గౌరవ మెరుగని ప్రాణికోటి
స్నేహ జర్జరనశ్వర దేహ జనిత
శోక సారస్య మెరుగని నాకభోగ
సారములుమాకు కరుణోపహారములట
వలదు! కారుణ్య ఘనత కావలయు మాకు!!

(సుప్రసిద్ధ హిందీ కవయిత్రి మహాదేవి వర్మ
– గేయానికి భావానువాదం – 1952)

# మీమాంస

షట్పదావృత పరిపుల్ల సరిసిజంబు
వాడి గాలికి ధూళిపై పడి యొనర్చు
మర్మర ధ్వని వినుమడే మారు మూల-
ఎంత అస్థిర సౌందర్య మీ జగంబు!

కిస లయాధర మధు సుధా రసము గ్రోలి
సురభి వెదజల్లి విహరించుచున్న దదిగొ
మంద మలయజ మాధవీ మారుతంబు
ఎంత మాదక వాహ్యాళి యీ జగంబు!

స్వాతి సలిల పిపాసతో చాతకంబు
ప్రియ, ప్రియా! యని విలపించి విసుగు చెంద
అగ్ని కణములు కురియించు నంబుధరము-
ఎంత నిష్ఠుర పరిహాస మీ జగంబు!

సుఖ నిశానంద డోలికా సుప్త భువిని
పరిహసించుటకై సుధాకరుడొనర్చు
చంద్రికా హాస మాధుర్య సార మిదియె-
ఎంత పిచ్చిని పడి పోయె నీ జగంబు!

ఆధారం : మహాదేవి